
గోపాలకృష్ణ ప్రొడక్షన్స్
కథానాయకుడు
దర్శకత్వం:
కె. హేమాంబరధరరావు
నిర్మాత:
కె. గోపాలకృష్ణ
సంగీతం:
టి.వి. రాజు
కెమెరా:
వి.యస్.ఆర్. స్వామి. W.I.C.A
పూర్ణా రిలీజ
NAVRANG

# ఉత్తరాలు

## సీరియల్

ఆంధ్ర సచిత్రవారపత్రికలో సీరియాల్‌గా తిరుమల రామచంద్రగారి బృహత్కథామంజరి అను కథ అన్న శాతవాహనుల కాలములో గుణాఢ్యుడు వ్రాసిన బృహత్కథ మంజరి అన్న ఒక టేనా? కాదా? ఏ విషయము పత్రికాభిముఖంగ తెలియపరస్తారని సంపాదకులని కోరుచున్నాము.

సి. తిరుమల శ్రీ, సి. జాహ్నవి, (మహబూబ్‌నగర్)

### జ వా బు

* శాతవాహన కాలపు గుణాఢ్యుడు బృహత్కథామంజరిని వ్రాయలేదు; బృహత్కథను వ్రాశాడని ప్రతీతి. ఆ బృహత్కథనే బృహత్కథామంజరిగా చెప్పానని క్షేమేంద్రుడు బృహత్కథామంజరి పీఠికలో తెలిపాడు. అతనికి ముందే కొందరు బృహత్కథా సంగ్రహమన్న పేరుతో ఆ కథలను వ్రాశారు. క్షేమేంద్రుని తర్వాత సోమదేవ సూరి కథాసరిత్సాగరమన్న పేరుతో విస్తారంగా వ్రాశాడు. — సం.

## సంక్రాంతి ప్రత్యేక సంచిక

మీ సంక్రాంతి సంచిక సర్వాంగసుందరముగా వెలువడినది చదివి ఎంతో ఆనందించినాను

డా. నారాయణరెడ్డిగారి గేయము "అమృతం పంచి పెడుతున్నాను" ఎక్సలెంటుగా యున్నది తరచు ఇటువంటి గేయములు ప్రచురిస్తారని ఆశిస్తాను నారాయణరెడ్డిగారి చిరునామా తెలుపవలసినదిగా కోరుతున్నాను

ఇకపోతే 1968లో విడుదలైన సినిమాల గురించి మీరిచ్చిన వివరాలలో ఒకపొరపాటు దొర్లినదని తెల్పుటకు చింతిస్తున్నాను 'రాము' చిత్రానికి సంగీతం సమకూర్చినది గోవర్ధన్‌గాని మీరు ప్రకటించినట్లు 'ఘంటసాల'కాదని గమనించ ప్రార్థన

ద్వాదశి హరేరామశర్మ, (బెంగుళూరు)

* సాధారణంగా రచయితల చిరునామాలు తెలువటం సాధ్యంకాదుకాని శ్రీ నారాయణరెడ్డి ప్రముఖ వ్యక్తి. వారి చిరునామా — రీడర్, ఉస్మానియా యూనివర్శిటీ, హైదరాబాదు.

* * *

సంక్రాంతి సంచికలో "మోహన్‌కుమార్ వ్రాసిన 1968 లో తెలుగుచిత్ర పరిశ్రమ" వ్యాసంలో సి యస్. రావు గత సంవత్సరములో ఏడు చిత్రాలకు దర్శకత్వం వహించి రికార్డు సృష్టించారన్నారు చాలా సంతోషం కాని సి యస్ రావుగారు ఆరుచిత్రాలు. (నిలువుదోపిడీ, నిండుసంసారం, మనసంసారం, గోవులగోపన్న, బంగారుగాజులు, గ్రామదేవతలు) మాత్రమే దర్శకత్వం వహించారు. ఏడవచిత్రము ఏదో తెలియపర్చినచో సంతోషించెదను. దయచేసి తెలియపరుస్తారుకదూ!—

సి. శంకర్‌బాబు, (మచిలీపట్నం)

## వ్యా సా లు

శ్రీమతి లక్ష్మీప్రసాద్‌గారి వ్యాసం 'సినిమాలపై అర్థంలేని విమర్శలు' చాలా చక్కగా వుంది. చాలా ఆలశ్యంగానైనా ఒక రచయిత్రి నిజాన్ని సూటిగా, నిష్కర్షగా చెప్పటం శ్లాఘ్యనీయము. రచయిత్రి చెప్పినట్లు ఫాషన్ ముందు ప్రజలకి వచ్చి, ఆ తరువాతే (మన తెలుగుసినిమాలో కట్టుకడపట)వస్తోంది ముఖ్యంగా ఢిల్లీ, కలకత్తా, బొంబాయి లాంటి నగరాల్లో మన హైందవనారి అలంకరణ చూస్తే యిప్పుడు అసభ్యత, అసభ్యత అని ఆవేదన పడుతున్న వారందరో మతులు పోతాయేమో మరి! అంతేకాదు నగరంలకిన్ని 'ఏ' సర్టిఫికేట్ ఇంగ్లీషు పిక్చర్స్‌గల థియేటర్లలో హవుస్‌ఫుల్ బోర్డులను, ప్రేక్షకులలో సగంపైగా ఆడవాళ్ళను చూచినప్పుడు యింకా ఆశ్చర్యమేస్తుంది.

సెక్సు అవమానకరమైన విషయంకాదు. దాన్ని సరిగ్గా అర్థం చేసుకోలేనివారూ, సంతృప్తికరమైన 'ఫెమిలీ ఎడ్యుకేషన్' లేనివారు దానిని అవమానకరమైన విషయంగా భావిస్తారు. ఈనాటి సినిమాలవల్ల సెక్సునవలలవల యువతరం నైతిక ప్రవర్తన పాడైపోతోందనుకోవటం శుద్ధ పొరపాటు. అది సెక్సువల్లకాదు. మన సమాజంలో పుట్టిపెరిగి, జీర్ణించుకుపోయి ప్రవహిస్తున్న సంకుచితత్వం కుసంస్కారాలవల.

సమాజాన్ని బాగుచేయదలచినవారు ఈనాటి సినిమాలు సాహిత్యం జోలికిపోక, మన సమాజంలోని సంకుచితత్వాన్ని కుసంస్కారాన్ని, నీచజీవిత విధానాలను పారద్రోల ప్రయత్నిస్తే లోకానికి ఎంతో మేలు చేసిన వారవుతారు. అంతేకాదు సినిమాలు, సాహిత్యం అవంతటవే బాగై కూర్చుంటాయి.

నిరంజన్‌రావ్ చిట్నార్స్ (51.ఎ.పి.ఒ)

* * *

సంక్రాంతి సంచికలో 'డాక్టర్లు! మందులు! చదివి విచారించేను. పిలంగా విమ్మకాయంత బొప్పి కడితే తీవ్రంగా మూడు రోజులు పరీక్ష చేసి '.. ఏదైనా కాన్సరస్ గ్రోత్ అయ్యుండాలి' అని యే డాక్టరైనా అంటాడా? ఇది హాస్యమా! సబబూ సమంజసమూ అవసరమనిపించలేధా?

వి. రాంబాబు ( విశాపట్నం )

* * *

మనయింటి పరిసర ప్రభావాలు అయితే మన వరకే పరిమితమై వుంటవి. కానీ ఈ సినిమాలు అనునవి మొత్తం దేశంపై తమ ప్రభావాన్ని చూపేవి దీనిమంచీచెడూ గమనించి చిత్రములు తీసిన యింత అలజడి లేకపోను.

పోతే లక్ష్మిగారు వ్రాసినటు శిల్పాలు చూస్తున్నాము, కానీ ఆ శిల్పాన్నిచూచునపుడు ఆ శిల్పి యొక్క భావాలు కళను తల్చుకొని ఆనందిస్తాము. ఆ శిల్పి యొక్క మధురభావాలు శిల్ప రూపము దాల్చినవి కానీ అది వాస్తవంకాదుగదా? అర్థనగ్న శిల్పాలు చూచి సంతోష పడినంతగా సుందరీమణులను చూచి ఆనందించగలమా? పూర్వం హిమాలయాలలో మునివారు దిగంబరులుగ సంచరించినది వాస్తవమే కానీ వారు ఈ పాపపు ప్రపంచానికి దూరంగా మసలిన సర్వసంగ పరిత్యాగులు, వారికి ఈ సమాజంతో పని లేదుకదా? మనకు సమాజంలో ప్రతిచిన్న విషయంలో కూడా సంబంధం వుండితీరుతుంది. దీనిలో ఈ సినిమాలు అనునవి ఒక ముఖ్యమైన భాగము.

ఒకచిత్రం లేక నాటకం యొక్క ప్రభావం సమాజంపై ప్రతిబింబిస్తుందన్న సత్యం తెలుపుటకు వెనుకటి సాహిత్యమూ, చలనచిత్రములే నిదర్శనములు ప్రస్తుత సినిమాలలో ప్రభావతిగారు వ్రాసినట్లు పాత్రధారిణిలేకాక దర్శక, నిర్మాతలుకూడా బాధ్యులని చెప్పవచ్చును ఈమాటకు వారు ప్రజల అభిరుచిననుసరించి తీస్తున్నాము మా తప్పేమీ లేదంటారు.

సాహిత్యవేత్త తను వ్రాసిన సాహిత్యమున కెంత బాధ్యులో అదేవిధముగ చిత్రదర్శక, నిర్మాతలు చిత్రముయొక్క నైతిక విలువలకు అంతే బాధ్యులగుదురు. వారు తీయుచిత్రములు ప్రేక్షకులపై కొంతకుకొంత వుపయోగకరమైన ముద్రవేయాలి. ఇందులో ముఖ్యముగా వస్త్రాలంకరణను గురించి విమర్శిస్తున్నాము. పాత్రల అసభ్య వస్త్రాలంకరణల వల్ల సెక్సు ప్రదర్శనవల్ల చిత్రం విజయవంతమగునను భావన కేవలం ఒక గ్రుడ్డిఅపోహ మాత్రమే ముఖ్యముగా నిర్మాత, దర్శకులనుండి అంది తొలగాలి. అందును గురించి వారు కొంత వెనుకటి చిత్రాలను సామాజిక వ్యవస్థను ఆలోచించాలి.

చిత్రములు గొప్ప కళాఖండములు. చిత్రమునకు ఒకకావ్యము లేక ఒక నవలను ఆధారముగ తీయుదురు కదా? దీనిలో నవరసాలు తదితర కావ్య లేక గ్రంధ సామాగ్రి వుండితీరాలి కానీ కళపేరుతో వచ్చిసెక్సుప్రదర్శనము చూపించిన ప్రేక్షకులలో స్వచ్ఛమైన భావము పోయి వుద్రేకభావములకు దోహదము చేయునుకదా? వారి అభిరుచి దొంగతనమూ అందుకని మేము ప్రోత్సహిస్తున్నామంటే సరిపోయిందా? మన శక్తివంచన లేక బాగుకొరకు ప్రయత్నించాలి

ఆనాటి పౌరాణికాలుగానీ, సాంఘికాలుగానీ ప్రణయగాథలుగానీ, ప్రజలలో కలిగించిన భావవిప్లవ ఈ నాటికీ ఆరిపోలేదనట అతిశయోక్తి కాదేమో!

"మల్లీశ్వరి", "దేవదాస్" మొదలగు సినిమాలలోని పాటలు ఈనాటికీ ప్రజలు మరచిపోలేక, యున్నారు. నటనా, వస్త్రాలంకరణ, సంగీతము నృత్యము సమపాళ్ళలో రంగరించి చొప్పించి చిత్రములు తీసిన ఆనాటి దర్శకుల హద్దులుమీరని భావుకతయెట్టిదో మరపురాదు ఇంతకూ అసలు విషయం దర్శక నిర్మాతల నుండి ఈ కృత్రిమ యెన్నికపోయి వ్యాపార సరళికొంత తగ్గించుకుని కళారాధన అనునది మరచిపోక మంచి చిత్రములు తీసి విడుదల చేసిన ఆనాడుచూచిన ప్రజలు, ఈనాడు చూడకపోరు.

చిత్రము యొక్క రూపు నూహించి స్వచ్ఛమైన కథావస్తువునెన్నుకుని చిత్రము తీసిన తప్పక విజయ

## రచయితలకు మనవి

### కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరించబడని తమ వ్రాత ప్రతులని తిప్పిపంపగోరే రచయితలు వ్రాత ప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన, స్వంత చిరునామాగల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంప రాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాత ప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పి పంపబడవు.

ప్రచురణకి స్వీకరించబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

### నవలలు

ప్రచురణకి స్వీకరించబడని నవలల వ్రాత ప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాత ప్రతులతో స్వంత చిరునామాకల, తగు మాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంప నవసరం లేదు. 100 పరగాన్ని పేజీల వయిన ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణింప బడుతాయి.

### కార్టూన్లు

ప్రచురణకి స్వీకరింపబడని కార్టూన్లు తిప్పి పంపగోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరిచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

షరా : వ్రాతప్రతులని, కార్టూన్లని వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని, వాటి విషయమయి ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్లు పంపగలరు.

సంపాదకుడు
ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## ఉత్తరాలు

వంతము కాగలదు అంతేకాని! అసభ్య అలంకరణ, సెక్సు ప్రదర్శనలు ముఖ్యముకాదని మనవారు గ్రహించాలి. ఈ వస్త్రాలంకరణ హరి స్త్రీ పాత్రల లోనే యెక్కువ అసహ్యకరముగ కానవచ్చుచున్నదన్న ఆశ్చర్యములేదు. ప్రజలు కూడా కొంతవరకు ఈ సినిమాలపై శ్రద్ధ తగ్గించిన ఈ అలజడి కొన్ని రోజులకైనా తగ్గ యుండేమో?

శ్రీయుతులు లక్ష్మీప్రసాద్, ప్రభావతి గారల వ్యాసాలననుసరించి నా అభిప్రాయాలు వ్రాశాను. యేదియేమైనా దర్శక, నిర్మాతలు, సెన్సారువార్లు నటీ, నటులు అందరూ బాధ్యతవహించి ఈ అసభ్య వస్త్రాలంకరణ అర్థంలేని నృత్యాలు, మాటకు ఒక పాటలేక స్వచ్ఛమైన శ్రద్ధగ చూసతగిన చిత్రములు తీసి ప్రజలలో ఈ అలజడిని తొలగిస్తారని ఆశిస్తాం.

కుమారి పవిని, కుసుమకుమారి.

### ముఖచిత్రం

10—1—69 వ సంచిక ముఖచిత్రం చాలా నిండుగావుంది వత్రికకి 'ఊమెన్ కార్టూన్స్' హైలైట్. మహేష్‌గారి 'ముగ్గురు మూర్ఖులు' నేటి ప్రభుత్వపు విధానాన్ని బాగా ఏకుతున్నారు. ఆదివిష్ణుగారి 'వధువు' గురించి వేరే వ్రాయక్కరేదు

సీరియల్స్ రెండు 'ప్రేమించు ప్రేమకై', 'సురేఖాపరిణయం' జోడుగుర్రాల పరుగులు తీస్తున్నాయి కార్టూన్స్ విషయంలో కనీసం కమ్మకు ఒక కార్టూన్ ఆయినావుంటే బాగనిపిస్తుందని ఈగా విజానదాయకమైన కృషిని పత్రిక చేస్తుంటుందంటే ఎచ్చుకోలేకుండా వుండం.

హరికిషన్ (స్తంభంపల్లి)

### స వ ర ణ

ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంక్రాంతి (17—1—69) సంచికలో ప్రచురించిన '1968 లో విడుదలైన తెలుగు చిత్రాలు' జాబితాలో 'రాము' చిత్రానికి సంగీత దర్శకుడు గోవర్ధన్, 'సతీ అరుంధతి'కి సంగీత నిర్దేశకుడు అశ్వత్థామ, 'చిన్నారి పాపలు' చిత్రానికి సంగీత దర్శకత్వం పి. లీల నిర్వహించారని పాఠకులు గమనించ కోరుతున్నాము. పొరపాటుకి చింతిస్తున్నాము

—సం.


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 31—1—'69
కీలకనామ సం॥ మాఘమాసం శుద్ధ త్రయోదశి
సంపుటము : 61 సంచిక : 23

స్థాపితము
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక


ఉత్సాహం
మేం లాటరీలు ప్రారంభించం
కానీ లాటరీలవల్ల చాలా ఆదాయం ఉంది
అతను వెళ్ళేలా చేయాలి
కాదు బలవంతంగా బయటికి నెట్టాలి
చైనా
భారత భూభాగం
వియత్నాం శాంతి
మైళ్ళకొద్దీ దూరం ఉంది
పారిస్ శాంతి చర్చలు
మిమ్మల్ని నేను మెచ్చుకుంటాను
తమర్ని కూడా నేను మెచ్చుకుంటాను. నన్ను దారి చూపించనిస్తారా
స్వతంత్ర
జన సంఘ్

# పార్లమెంటు ఉండగా ఇన్ని ఆర్డినెన్సులు ఎందుకు?

శ్రీ కామరాజుగారు ఉపఎన్నికలో గెలవటం, ప్రధానమంత్రి శ్రీమతి గాంధీగారు లండన్‌నుంచి తిరిగిరావటం, రెండు ఆర్డినెన్సులు ఈ వారం కలగూరగంప విశేషాలు.

శ్రీ కామరాజుగారి విజయాన్ని కొనియాడుతున్నారు. కాని, పంజాబు, ఉత్తరప్రదేశ్, బీహారు, రాష్ట్రాలలో కాంగ్రెసుకి ఇది ఏవిధంగా సహాయపడగలదు? జరగబోయే ఉపఎన్నికలలో ఉ. ప్ర. లో కాంగ్రెసుకి 50-50 అవకాశం ఉందంటున్నారు. పంజాబు, బీహారు, బెంగాలులలో ఏమి జరుగుతుందో కాని కాంగ్రెసు విజయం అవకాశాలు చాలా తక్కువ అని అనుకుంటున్నారు ఎందరో...

### మింక్ కోటు, ఓటు

శ్రీ కామరాజుగారు ఎప్పుడూ వామపక్ష [illegible] చెప్పే. మంత్రివర్గంలోచేరి 'మింక్‌కోట్' [illegible] ఒంపరదమని [illegible] కొందరు [illegible] ఆశ్చర్యం లేదు. ఈ భాషసంగతి ఏమిటి? శ్రీ కామరాజుగారికి ఇంగ్లీషు, హిందీ రెండూరావు. పార్లమెంటులో, పరిషత్తులో ఏమిచేస్తారు? అందుకనే ఆయనని పోర్టుఫోలియోలేని మంత్రిగా చెయ్యొచ్చు. శ్రీమతి గాంధీగారికి [illegible], నోటూ రెండూ ఇస్తారు.

లిన్‌లిత్‌గో ప్రభువు భారతదేశాన్ని ఆర్డినెన్సుల ద్వారా పరిపాలించేవారు వీటికి అధికారం ఉండేదికాని పార్లమెంటు ఆమోదం లేదు ప్రపంచ యుద్ధంవల్ల ఏర్పడిన అత్యవసర పరిస్థితిని ఎదుర్కొనటానికే ఆర్డినెన్సులని వాడుతున్నానని ఆయన వాదించేవాడు.

### అత్యవసర పరిస్థితి ఏదీ?

నేడు మన ప్రభుత్వానికి ఇటువంటి పోరులేదు అత్యవసర పరిస్థితీలేదు, ఇతర అవసరమూ లేదు కాని బోనస్ చట్టాన్ని, దొంగరవాణా సరకు ఆర్డినెన్సుని అమలు [illegible]. ఈ ఆర్డినెన్సులద్వారా పార్లమెంటు శాసనాలని పరిశీలించే అవకాశం తగ్గిపోతోంది. ఆరునెలలు గడచిన తర్వాత ఏ చట్టాన్నీ మార్చటం తేలికకాదు.

సాలమన్ రాజుగారు కట్టించిన గుడికి రెండు స్తంభాలుండేవిట. శ్రీమతి గాంధీగారి మంత్రివర్గానికీ అంతే. శ్రీ ఫక్రుద్దీన్ అలీఅహమ్మద్ ఒకస్తంభం, సేఠ్ సాహెబ్ జయసుఖలాల్‌హాతీ రెండవస్తంభం. ఇద్దరూ ఎడమవయిపుకే మొగ్గటంచేత నిలకడ తక్కువగా ఉంటోంది. ఇదే జయసుఖలాల్‌గారికి వాణిజ్యశాఖ ఇస్తే ఆయన దక్షిణ నాయకుడివలే మాట్లాడేవారు. కార్మికులమంత్రి కాబట్టి వామపక్షం వహిస్తూ మాట్లాడుతారు.

### కొత్తబోనస్ ఆర్డినెన్సు

సేఠ్ హాతీగారు బోనస్ ఆర్డినెన్సుద్వారా ఒకకొత్త సంవత్సరం కానుక సమర్పించారు దేశానికి. దీనిప్రకారం బోనస్ మొత్తంమీద వచ్చిన పన్ను రిబేటుని మరుసటి ఏడాదికి పంచవలసిన మొత్తానికి కలపాలి బోనస్ కమిషన్ సలహాకీ, సుప్రీమ్ కోర్టు ఇచ్చిన నిర్ణయానికి ఇది వ్యతిరేకమని యజమాన్య పక్షంవారు అంటున్నారు. అసలు ఈ ఆర్డినెన్సుకి ఇంత అవసరం ఏమిటి? ఈ ఆర్థిక సంవత్సరంలో ఇంకా రెండున్నర నెలలు ఉన్నాయికదా? కొందరు వామపక్షం నాయకులు పార్లమెంటు అధికారాన్ని నాశనం చేసి ఆవిధంగా ప్రజాస్వామ్యాన్ని నాశనం చెయ్యటానికి ప్రయత్నిస్తున్నారు ప్రభుత్వంవారు వారి ప్రయత్నాలకి సహాయం చేస్తున్నారు.

### శ్రీ భగత్ ప్రకటన

శ్రీమతి గాంధీగారు కామన్వెల్తు సమావేశంనుంచి తిరిగివచ్చేశారు. విదేశాంగ వ్యవహారాలశాఖలో స్టేట్‌మంత్రి శ్రీ బలిరామ్ భగత్ లండన్‌లోనే ఉండిపోయారు అసలు ఆయన అక్కడ ఉన్నట్లు ప్రధానమంత్రి వెళ్ళిపోయేదాకా ప్రజానీకానికి తెలియదు! భారతపత్రికల ధర్మమా అంటూ ఒక ప్రకటన ప్రచురణ అయింది. తూర్పు ఆఫ్రికాలో బ్రిటిషు పాస్‌పోర్టులు కల ఆసియావారిని బ్రిటన్ పేచీపెట్టకుండా స్వీకరించాలని ఆయన అన్నారు.

రాజధానికి తిరిగివచ్చిన ప్రధానమంత్రి అన్నారూ—రొడీషియాలో అధికసంఖ్యాకుల పరిపాలన ముందు స్వాతంత్ర్యం రాకూడదు అన్న సిద్ధాంతం (ఇంగ్లీషులో నో ఇండిపెండెన్స్ బిఫోర్ మెజారిటీ రూల్ ఇన్ రొడీషియా లేక నిబ్మార్) పయిన ఒప్పందం కుదిరింది, అని.

బ్రిటిషుమంత్రి శ్రీ కాలఘాన్ ఏమన్నారంటే, బ్రిటన్‌కికూడా ఇమ్మిగ్రేషన్‌ని అరికట్టే హక్కుఉంది అన్నారు గత పది సంవత్సరాలలో బ్రిటన్‌లోకి సుమారు ఏడున్నర లక్షలమంది వలసవచ్చారుట. ఏదేశమయినా పరిమితంగానే వలసవచ్చేవారికి ఆశ్రయం ఇవ్వగలదన్నారు శ్రీ కాలఘాన్. కొన్నిదేశాలలో సమాజంలోని వారందరికీ వీలయినన్ని సౌకర్యాలు ఏర్పరచే ప్రయత్నాలు జరుగుతున్నాయి కాబట్టి ఈ విధంగా జనసంఖ్య ఎక్కువ అయితే చాలా ఇబ్బందులు వస్తాయన్నారు. దీనికితోడు జాతిద్వేషాలు అధికం అవుతాయని కూడా అన్నారు

శ్రీ బలిరామ్ భగత్ హెచ్చరికని బ్రిటిష్ ప్రభుత్వం అంతగా పట్టించుకున్నట్లు కనిపించదు.

బ్రిటిషుమంత్రి ప్రకటననిబట్టి ఇతర దేశాల విధానాలవల్ల తమదేశంలోకి అధిక సంఖ్యాకులువస్తే వారిని ఆపే హక్కు తమకి ఉంది కాబట్టి వారిని అరికట్టడానికి వెనుదీయరని గ్రహించవచ్చు.

గృహవసతి, విద్యాభ్యాసం, వైద్యసదుపాయాలు, ఉద్యోగాలు—వీటితో శ్రీ భగత్‌కి ఏమిపని? బ్రిటన్‌వంటి దేశాలలో ఇవన్నీ అతిముఖ్యమయిన విషయాలయితే ఆయనకేమిటి, అవకపోతే ఆయనకేమిటి?

### కెన్యాని ఎందుకు స్వీకరించలేదు?

కెన్యా స్వతంత్రం అయ్యేముందు అక్కడి ఆసియావారిని బ్రిటిషు, కెన్యా, భారత పౌరసత్వాలలో ఒకదానిని తీసుకో

మన్నారు. ఎందరో తమ స్వదేశమయిన భారతదేశాన్ని ఎన్నుకోకుండా తెల్లదేశమయిన బ్రిటన్‌ని ఎన్నుకున్నారు. అసలు కెన్యా పౌరత్వాన్నే ఎందుకు స్వీకరించిఉండరాదు? భారతదేశం విదేశీయులని అన్ని రంగాలలోనుంచీ తరిమివేస్తున్నారు. అదే పని కెన్యాలో చేస్తున్నారు కాబట్టి ఏమీ అనలేకుండా ఉంది మన ప్రభుత్వం. ఎవరో దేశాయి, షా లండన్ వెళ్ళి మాతృదేశానికి తిరిగి వచ్చినట్లు మాట్లాడుతారు!

**శ్రీ జిన్నా విధానానికి ఎవరు కారకులు?**

ఒకప్పుడు భారత రాజకీయాలలో మత విధానాలు చాలా పాపం అనే సిద్ధాంతం బలంగా ఉండేది. ముస్లింలీగ్ ధైర్యంగా తన మత విధానాన్ని చాటింది. అసలు శ్రీ జిన్నా, ఆయన లీగ్ మతాభిమానులు కావటానికి ఎవరు కారకులో ఇప్పుడు ప్రత్యేకంగా చెప్ప నవసరంలేదు.

కొందరు జాతిద్వేషం ప్రధానంగా ఉండే విధానాలు అనుసరిస్తారు. కాని, జాతిద్వేషం పాపం అంటారు. మరికొందరు తాము జాతివిచక్షణని అనుసరిస్తున్నామని నిర్మొహమాటంగా చెప్తారు; దక్షిణ ఆఫ్రికా దీనికొక నిదర్శనం. భారతదేశంపట్ల బ్రిటన్ జాతివిచక్షణ చూపుతున్నదన్నా అతిశయోక్తి లేదు.

ఇక మెజారిటీ పరిపాలనగురించి ఒక మాట. ఈ మెజారిటీ పరిపాలనా సిద్ధాంతమే భారతదేశాన్నీ, పంజాబునీ ముక్కలు చేసింది. భారతదేశంలో మెజారిటీ పరిపాలన అంటే హిందూ పరిపాలన అని ముస్లిం లీగ్‌వారు వేరుపడిపోయారు.

**ఫిజీ**

ఫిజీ ద్వీపంలో అధిక సంఖ్యాకులు భారతదేశపు అంశం కలవారు. అందువల్ల 'అసలు ఫిజీదేశానికి చెందినవారు' తమకి ప్రజాస్వామ్యం వద్దని బ్రిటిషు రాణిని అడుగుతున్నారు. వీరు 'అసలు ఫిజీవారు' కదా? భారతదేశం అంశంకలవారు 'బయటివారు' కదా? ఎవరు ఎవరిని పరిపాలించాలి? రొడీషియా తెల్లవారు బయటివారా 'అసలు రొడీషియావారా?'

శేఠ్ జయసుఖలాల్ హాతీ ఇటీవలే ఫిజీకి వెళ్ళివచ్చారు. వారు మన ప్రభుత్వానికి ఏమి నివేదిక సమర్పించారో తెలియదు... ●

**ఆటలు**

# నిబంధనలని ఎప్పుడు సడలించాలి?



మదరాసు క్రికెట్ ఎసోసియేషన్ లీగ్ ఛాంపియన్ షిప్పు పోటీలు ముగియవస్తున్నాయి. రెండేళ్ళగా ఈ పోటీని 'జాలీ రోవర్స్' గెలుస్తూవచ్చారు. ఇది నేను రాసే సమయానికి ఒక ఆట మాత్రమే మిగిలి ఉంది. నా ఆలోచనలు పోటీల నిబంధనలలో ఒకదానిమీదకి మళ్ళాయి. ఈ నిబంధన ఏమిటంటే, ఎటువంటి జట్టు అయినా సరే కింది డివిషన్ నుంచి నెగ్గుకురావాలిసిందే. ఎంత బలమయినదయినా సరే. జాలీరోవర్స్‌ని తీసుకోండి. ఇందులో ఆడేవారందరూ ఇండియా సిమెంట్సు, పారీస్ స్పోర్ట్స్ క్లబ్బు, ఇండియన్ ఓవర్సీస్ బాంకు మొదలయినసంస్థలవారే.

జాగ్రత్తగా ఉండకపోతే కొన్ని క్లబ్బులు మంచి ఆటగాళ్ళని 'కొనివెయ్య'గలవు. అందుకనే పయినచెప్పిన నిబంధనని అమలువరిచారు. ఈవిధంగా ఇది మంచి నిబంధనే.

కాని కొన్నిసంస్థల జట్ల విషయంలో ఈ నిబంధనని సడలించవచ్చునేమో! ఎందుకంటే తమ జట్లని బలపరుచుకొనటానికి పెద్ద కంపెనీలవారు ఆటగాళ్ళకి మంచి ఉద్యోగాలు ఇస్తారు. మంచి ఆటగాళ్ళు తమ ఆటకీ, ఆర్జనకీ అడ్డురాకుండా మంచి జట్టులో ఉండాలంటే కొన్ని జట్లని పరిశీలించి, అందులోని వారందరూ నిజంగా ఆజట్టుకి చెందినవారేనని నిర్ధారణచేసుకుని వాటికి నేను మొదట చెప్పిన నిబంధన వర్తించకుండా ఉండేట్లు చూడవచ్చు.

ఏది ఎలాఉన్నా అన్యాయాలు జరక్కుండా చూడటం చాలా అవసరం. పెద్ద కంపెనీలు వగయిరా నడిపే జట్లలో అన్యాయాలు (ఆటగాళ్ళని కొనటం!) జరగటం అరుదు.

మదరాసులో 'హిందూ' ట్రాఫీ, సీనియర్ లీగ్ ఛాంపియన్‌షిప్పులు చాలా ముఖ్యమయినవి. వీటిలో వీలయినందరు పాల్గొనేట్లు చూడటం మదరాసు క్రికెట్ ఎసోసియేషన్ బాధ్యత. ఒక జట్టులో ఖాళీలు వచ్చినప్పుడు ఆ ఖాళీలని ఎలా నింపుతున్నారో కూడా పరిశీలించాలి.

—కె. ఎస్. నరసింహన్




కళింగసేన రహస్యాలు తెలుసుకొనడానికి ఉద్యానభవనంలో యౌగంధరాయణుడు నియమించిన బ్రహ్మరాక్షసుడు — యోగేశ్వరుడు సోమప్రభా కళింగ సేనల సంలాపం విన్నాడు. వెంటనే యౌగంధరాయణుని వద్దకువచ్చి ఆసంలాపం తెలియపరచాడు. మళ్లీ ఉద్యానమందిరానికి వెళ్లి అదృశ్యుడై కావలి ఉన్నాడు.

వత్సరాజు కళింగసేనతో వివాహంకోసం, వివాహ శుభదినం ఎప్పుడు వస్తుందా అని తదేకధ్యాన పరాయణుడై వున్నాడు. ముహూర్తం గుణించే జోస్యులను దినమూ తిట్టేవాడు మనసులోనే, ఎన్నాళ్లయినా ముహూర్తం పెట్టరని. ఆసమయంలో వాసవదత్త అతనికి ఒకసారి కనిపించింది కళింగ సేన సంగతి తెలిసినా ఆమె నిర్వికారంగా ఉండడం వత్సరాజు చూచాడు అది ఆమె సహజగుణం కాదు గనుక, యౌగంధరాయణుడేదో భేదనీతిని ప్రయోగించి వుంటాడని అతనికి ఆ శంక కలిగింది

వెంటనే యౌగంధరాయణుని పిలిపించి వాసవదత్తాదేవి నిర్వికారతకు కారణం అడిగాడు. అతడు "దేవ, ఇద్దరు దేవేరులు అభిమానినులు, మనస్వినులు. అందువల్ల కోపం కారణం ఉన్నప్పటికీ నవ్వుముఖంతో ఉండడం చూడగా, మరణానికి నిశ్చయం చేసుకొని, కోపమాని కొత్తపద్ధతిని అనుసరిస్తున్నట్టు నాకు తోస్తుంది" అని విన్నవించి, మరికొన్ని యుక్తి మాటలతోను రాజు మనసులో కళింగసేనా వివాహం విషయంలో ఆదరం సడలేట్లు చేశాడు

కాని వత్సరాజు మళ్లీ యౌగంధరాయణుని మాటలను ఆలోచించాడు మనస్సు ఉద్విగ్నమయింది. సందేహం మనస్సును ముంచివేసింది. తాగిన వానిలాగా కంపిస్తున్న వానివలె ఇల్లా అన్నాడు

"మహామంత్రీ, తనకు తానై వలచివచ్చిన ప్రణయినిని అవివేకంతో ఎవడైతే అవమానిస్తాడో అలాటి షండుడైన పశువుకు, కరిసచిత్తునికి నమస్కారం మా పురాణ పురుషుడయిన అర్జునుని వంటి ధీమంతుడు గూడ రంభ వరించివస్తే ఇలాగే చేశాడు ఆమె శాపంవల్ల షండత్వం పొందాడు. రాజకన్యను వదలడమనే చింతాజ్వరం నాకు దుస్సహం. తనంతటతానై వచ్చినలక్ష్మిని వదలిన వానికి సంతోషం కలిగేనా ?"

మంత్రి వర్యుడు వత్సరాజు మాటలు విన్నాడు "దేవా, ఈ సందర్భంలో ఒక కథ మనవిచేస్తాను వినండి. పూర్వం శ్రుతసేనుడనే ఒకరాజు ఉన్నాడు. అతడు మన్మథుని వలె సుందరుడు. అగ్నిశర్మ అనే బ్రాహ్మణుడు ఆరాజ్యంలో ఉండేవాడు అతడు తీర్థయాత్రక బయలు దేరి, సోమేశ్వర స్వామి మొదలయిన దేవతలను దర్శించుకొని కాకతాళీయంగా ఆరాజసన్నిధి చేరాడు. అతడు, రాజు ప్రశ్నించగా తన తీర్థయాత్రా విశేషాలను ఇలా విన్నవించాడు.

'దేవా, పూర్వం సవ్యసాచి అప్సరసలకు శాపవిమోచనం చేసిన పంచతీర్థంలోస్నానంచేసి, సోమేశ్వర,

దేవుని దర్శించాను. ఆసోమేశ్వరుడు మహారాష్ట్ర దేశానికి అమృతవర్షం కురిపించేమేఘం వంటివాడు. తర్వాత తాటిచెట్ల వనంతో నల్లగా వుండే సముద్రతీరంలో తిరుగుతూ వున్నాను అప్పుడు ఒకసుందరి అయిన రాజకుమారి కనిపించింది. ఆమె వసంతసేనమహారాజు కూతురు. పేరు విద్యుద్ద్యోత. నేను ఆరాజు సత్రంలోనే భోజనం చేసే వాడిని. రాజకుమారి కుసుమచాపధరుడయిన మన్మథుని భల్లంవలె, యౌవనమనే వృక్షపు శాఖావల్లివలె, ఎదమనే పుళిందరాజుపల్లెవలె ఆకర్షకంగా, నవనవలాడుతూ, ఎదించివుండేది ఆమెను చూచి ఆశ్చర్య పడ్డాను

"రతీ సమానురాలయిన ఆమెను చూడగానే మన్మథ సమానుడయిన నీవునాకు జ్ఞాపకంవచ్చావు శ్రుతసేనమహారాజు తప్ప మరొకడు ఈమెకు యోగ్యుడు కాడని గట్టిగానే అనేశాను. నీవుతప్ప మరొకరు ఆమెను వరించడానికి తగరు".

శ్రుతసేనునికి అతని మాటలతో విద్యుద్ద్యోత పై ప్రేమ మొలకెత్తింది. అతనినే వసంతసేన మహారాజువద్దకు దౌత్యం పంపాడు వసంతసేనుడు తన కుమార్తెను శ్రుతసేనునికి ఇవ్వడానికి ఒప్పుకున్నాడు. ఇద్దరికీ వివాహం జరిగింది. శ్రుతసేనుడు స్మరోద్యాన విలాసరసికుడయాడు. వారి ప్రేమవృక్షం ప్రౌఢంగా పెరిగింది

కొంతకాలం గడచింది శ్రుతసేనుని విఖ్యాత గుణాలు సౌందర్యాన్ని విన్న మరొకరాజకుమారి తనంత తానై అతనిని వరించడానికి వచ్చింది ఆసంగతి విద్యుద్ద్యోతకు తెలిసింది. ఇకతనకు తనభర్త సమాగమం తరచు కలుగదనేభయంతో గుండె పగిలి మరణించింది ఆ వియోగాగ్ని తాపానికి సహించలేక శ్రుతసేనుడూ మరణించాడు. మానిని అయిన నూతన రాజతనయ గూడా తన గౌరవానికి భంగం కలుగుతుందనే సంశయంతో మరణించింది ''

వత్సరాజు యౌగంధరాయణుడు చెప్పిన కథ విన్నాడు. ఒకవైపు తన దేవేరులు, మరొకవైపు కన్యఅయిన కళింగ సేన. అతని మనసు ఊయెలలాగ ఊగులాడ సాగింది. కాని, వత్సరాజు దృష్టి మరొకమారు వాసవదత్త మీద వాలింది ఆమెను చూచిన మీదట రాజు కళింగసేనపొందు ఎలా కోరగలడు? అతని మనస్సు ప్రసన్నోదారమయింది

యౌగంధరాయణుడు రాజు మనస్సు మారినందుకు చాల సంతోషించాడు. అయినా, జాగ్రత్త మానలేదు ఒకరాత్రి యౌగంధరాయణుడు నియమించిన బ్రహ్మరాక్షసుడు ఎవరి కంటా పడకుండా యౌగంధరాయణుని వద్దకు వచ్చాడు. ఇలా చెప్పాడు.

'మంత్రిపుంగవా, రాజుగారి బావమరిది చిన చారుడు నాకు ఒక సంగతి చెప్పాడు. కళింగసేనుడు తనకుమార్తె సంగతి తెలుసుకోవడం కోసం ప్రపంచమంతటా చారులను పంపాడట. తర్వాత రహస్యసంకేతాలతో తిరుగుతున్న కళింగసేనుని చారులను నేనుగూడ చూచాను."

యౌగంధరాయణుడు బ్రహ్మ రాక్షసుని మాటలు విన్నాడు. అతనితో ఇలా అన్నాడు "మిత్రమా, కళింగ సేన వృత్తాంతం పూర్తిగా తెలుసుకో ఏవిధంగా నైనా తెలుసుకో ప్రభువుపై కొత్తగా పడిన వ్యసనాన్ని నీ బుద్ధి వైభవంతో తొలగించ దలచాను రాజుల స్మరాగ్నిని చికిత్స చేయడం కష్టమని నీకు తెలియదూ? వ్యసనాల నుంచి కష్టాలనుంచి కాపాడుకోడమనేది మానవులకు సహజమైన బుద్ధి దీనిలో ఆశ్చర్య మనేదేమీ లేదు. తిర్యగ్జంతువులు గూడ తమ ఆపదలను తొలగించు కొనడానికి బుద్ధిని వినియోగిస్తాయి, వాటికి ఆ సమయాలలో సహజంగానే ప్రతిభ కలుగు తుంది. దీనికి ఒక కథ చెబుతాను విను.

ఒక అడవిలో ఒక మర్రి చెట్టు వుంది దాని వేళ్లలోని కలుగులో ఒక ఎలుక వుండేది దాని పేరు పాలితం. ఒకనాడు ఒక వేటకాడు ఆ మర్రి చెట్టు కింద వల పన్నినాడు ఆ వలలో పక్షులు మృగాలకు మారుగా ఒక పిల్లి తగులు కొంది దాని పేరు రోమశం

అది వలలో తగులు కొంది గనుక, తనకు భయం లేదని ఎలుక కలుగు నుంచి వెలుపలికి వచ్చింది ఆహారం వెదకడం కోసం చుట్టు పట్టు ప్రాంతాలను వాసన చూస్తూ త్వరగా ప్రాకుతూ, గోళ్లతో నేలను గీకుతూ ఆహారం కోసం తిరిగింది

అంతలో ఒక ముంగిస, ఒక గుడ్లగూబ కనిపించాయి గుడ్లగూబ వికార ముఖంతో చూడ భయంకరంగా వుంది. వాటిని చూడగానే ఎలుక ప్రాణాలు ఎగిరి పోయాయి ఇలా ఆలోచించింది —

"ఒక వైపు ముంగిస, మరొక వైపు గూబ వీటిని చూస్తేనే భయం పుడుతూంది ఈ రెండింటికన్నా బలమైనది పిల్లి దానినే ఆశ్రయిస్తాను విషమ స్థితి ఏర్పడినప్పుడు శత్రువుతో సంధి చేసుకోడం సరైన పని దానితో స్నేహం చేసి, దాని వలతాళ్లు తెంచి వేస్తాను ''

ఇలా ఆలోచించి నల్లని గాజులాగ బంగారులాగ మెరిసే కళ్లున్న ఆ పిల్లితో ఇలా అన్నది— "రోమశ మార్జాలా, కాలాన్ని బట్టి శత్రువు మిత్రుడవుతాడు మిత్రుడు శత్రువు అవుతాడు అందువల్ల నేను కాలవశాన నీకు మిత్రుడినయి, నీ వలతాళ్లు కొరికి తెంచి వేస్తాను ''

పిల్లి, తియ్యని ఆ ఎలుక మాటలు విని, దానిని తన మిత్రుడుగా చేసుకొంది, ఆపదలో వున్న ఆ ఎలుకను తన ఒడిలో పెట్టుకుని గాఢంగా కౌగిలించుకొనింది.

పిల్లిని చూసి ముంగిస, గూబ ఇక ఎలుక దొరకదని నిరాశపడ్డాయి. దాని దగ్గరకు వెళ్లడానికిభయపడి తలదించుకొని చూస్తూ కూర్చున్నాయి.

ఎలుక నిర్భయంగా వలతాళ్లు నెమ్మదిగా కొరక సాగింది అది చూచి పిల్లి "ఏమిట ఇంత నెమ్మదిగా కొరుకుతున్నావు? త్వరగా కొరికి ముగించు'' అన్నది.

ధూర్తులు స్వార్థంకోసం రాజుచుట్టు భక్తితో సేవతో మూగుతారు. పని చేసి పెట్టమని కోరితేచేదో సాకుతో కాలం గడుపుతుంటారు నేను ఇలాగే ఉదయం వేటకాడు వచ్చేవరకు నెమ్మదిగా పని సాగిస్తూ వుంటాను—అని ఎలుక మనసులో అనుకొని, తెల్లవారే దాక ఒక ఉచ్చుతప్ప అన్నిటినీ కొరికివేసింది

తెల్లవారింది. యమాకారుడయిన వేటకాడు రావడం కనిపించింది మిగిలిన ఒక ఉచ్చును ఎలుక కొరికి వెళ్లి బొరియలో దాక్కుంది పిల్లి, వ్యాధుణ్ణి చూచి గడగడవణికిపోతూ, ఎలుక ఉచ్చును కొరికీ కొరకగానే ఒళ్లు విదిలించుకొని వలనుంచి బైటికి దూకి పరుగెత్తింది

కొంతకాలానికి ఆ పిల్లి మర్రిచెట్టు వద్దకు వచ్చింది ఎలుక కలుగువద్దఆగి, "మిత్రమా, వెలుపలికిరా'' అని ఎలుకను పిలిచింది

కలుగు వెలుపల వాడిగాను, ఎత్తుగాను వున్న కోరలతో, సూదులవంటి మీసాలతో భయంకరంగా వున్న పిల్లిముఖం కనిపించింది ఎలుకకు పిల్లి తన తోకను ముడిచి ముందుకాళ్లకు చుట్టుంది ఎలుక కలుగు వాసను ఆప్యాయంగా ఆస్వాదిస్తూంది ఒంటి కాలిమీద నిలబడి, ఒక కాలిని వెనక దాచుకుంది అరమూత కన్నులతో నిలబడి పక్కలకు చూస్తూ తప్పు పలుస్తూంది

పిల్లి ఆత్రాన్ని ఎలుక గ్రహించింది "రోమశ మార్జాలమా, మంచి సరస్వభావమైత్రితో పూర్వం నీకు నేను, నాకు నీవు ఉపయోగపడ్డాము ఆ కాలం పోయింది ఇక వెళ్లిపో నేను మోసపోయేవాడిని కాను నీ తియ్యనిమాటలు నాకిప్పుడు రుచించడం లేదు మనకు పనిబడిన కాలం గడచిపోయింది ఇప్పుడు ఆ సమావేశంలేదు స్వప్రయోజనం కోసం తియ్యగా ప్రేమతో మాట్లాడే క్రూరులయిన లోభులను బుద్ధిమంతుడు విశ్వసించడు నీవు కృతజ్ఞతతో వుండు దూరంగానే వుంటూ నాకు మిత్రుడుగా ప్రవర్తించు భుజించే వాడికి, భుజించబడే వాడికి పొత్తు కుదురుతుందా?''

ఎలుక పిల్లిని ఇలా నానా విధాలుగా చీవాట్లు పెట్టింది తర్వాత కొంతకాలానికి, ఆధూర్త శత్రువు ఎప్పుడు ఏమైనా చేయగలడనే ఆశంకతో ఆ కలుగును వదలి వేరొక చోటికి వెళ్లింది.

"అందువల్ల మిత్రుడా, యోగేశ్వరా బుద్ధిమంతులు కార్యసిద్ధికోసం నిగూఢమయిన నీతి అనుసరిస్తారు ప్రాజ్ఞుడు పాపాత్ముని మనస్సులో నిగూఢంగా వున్న దానిని గూడ తన మనస్సులోనే చూస్తాడు'' అని యౌగంధరాయణుడు అన్నాడు.

**(ఇంకా ఉంది)**

# భీష్మ ఏకాదశి

ప్రతినెలా వచ్చే పంచ పర్వాలలోనూ ఏకాదశి ఒకటి. అది ముఖ్యమైనది కూడాను. నాటిదినం ఉపవాసం వుండి మర్నాడు ఉదయం అతిథులకు పెట్టి తాను భుజించాలనీ, ఆ రీతిగా చేస్తే ఉత్తమగతి కలుగుతుందనీ హిందువుల విశ్వాసం. అట్టి ఏకాదశులలో భీష్మ ఏకాదశి ప్రత్యేకమైనది.

భారత వీరులలో అగ్రగణ్యుడైన భీష్ముడు కురుక్షేత్ర సంగ్రామంలో శరతల్ప గతుడైన దినం ఏకాదశి అనీ, భీష్ముడు కార్తిక శుద్ధ ఏకాదశినాడు అంపశయ్యపై శయనించి వుండడంవల్ల అది భీష్మ ఏకాదశి అని చెప్పబడుతున్నదనీ కొందరు అంటారు తాను కోరుకొన్నప్పుడే మరణించే శక్తిగల భీష్ముడు ఉత్తరాయణం వస్తేనే కాని ప్రాణాలు విడవ దలచుకోలేదు. ఆయన మాఘ శుద్ధ అష్టమినాడు భౌతిక దేహాన్ని విడిచిపెట్టినట్లు

'మాఘ మాసే సితాష్టమ్యాం
సలిలం భీష్మతర్పణమ్,
శ్రాద్ధంచయే నరాః కుర్యుః
తేస్యుః సంతతి భాగినః'

అనే శ్లోకం వల్ల తెలుస్తున్నది. తర్పణం యివ్వడం, శ్రాద్ధం పెట్టడం మరణించిన తిథినాడే జరపడం ఆచారం కదా!

భీష్ముడు తన ప్రాణోత్క్రమణ సమయంలో ధర్మరాజుతో...

దిష్ట్యా ప్రాప్తోఽసి కౌంతేయ
సహామాత్యో యుధిష్ఠిర,
పరివృత్తో హి భగవాన్
సహస్రాంశు ర్దివాకరః.
అష్ట పంచాశతం రాత్ర్యః
శయానస్యాద్య మేగతాః,
శరేషు నిశితాగ్రేషు
యథావర్ష శతం తథా,
మాఘోఽయం సమనుప్రాప్త
మాసః సౌమ్యో యుధిష్ఠిర,
త్రిభాగశేషః పక్షోఽయం
శుక్లో భవితు మర్హతి.'

అని అన్నట్లు అనుశాసనిక పర్వంలో 168—వ అధ్యాయంలో ఉన్నది.

'ఓ ధర్మరాజా! నీవు మంత్రులతో కూడా యిప్పుడు ఇక్కడకు రావడం చాలా మంచిదే అయింది. సహస్ర కిరణుడైన సూర్యుడు ఉత్తరంవైపు మళ్ళాడు. వాడి మొనలు గల అమ్ములపడకపై శయనించిన నాకు ఏభైఎనిమిది రోజులూ నూరేళ్ళుగా తోస్తున్నవి. మాఘమాసం వచ్చింది: ఇది సౌమ్యమైన నెల. ఇది శుక్లపక్షం, మాసంలోని నాలుగు భాగాల్లోనూ మూడుభాగాలు మిగిలివున్నాయి.' అని దీని అభిప్రాయం:

ఈ లెక్కనుబట్టి చూస్తే భీష్ముడు అంపశయ్యపయి కార్తిక శుద్ధ ఏకాదశి నాడు కాక మార్గశిర శుద్ధ ఏకాదశినాడే పరుండినట్లు తెలుస్తున్నది. అయితే—పయి ఏకాదశులలో దేనికీ భీష్మ ఏకాదశి అనే పేరు ప్రసిద్ధంగా ఉన్నట్లు కానరాదు. కార్తిక శుద్ధ ఏకాదశి ఉత్థానైకాదశి; మార్గశిర శుద్ధంలోనిది మోక్షైకాదశి. ఒక్కొక్కప్పుడు వైకుంఠ (ముక్కోటి) ఏకాదశి అవుతూ ఉంటుంది'

భీష్మ నిర్యాణానికి సంబంధించిన శ్లోకాలు కొన్ని పరస్పర విరుద్ధంగా ఉన్నవి. భారత వ్యాఖ్యాతలు వాటిని ఎలాగో ముడిపెట్టి సమర్థించారు మాఘ శుద్ధ ఏకాదశి భీష్మ ఏకాదశిగా సర్వత్రా వ్యవహారంలో ఉంది. నిర్ణయ సింధువనే ధర్మశాస్త్ర గ్రంధాన్నిబట్టి దీనికి హైమైకాదశి అనీ, జయైకాదశి అని పేర్లు ఉన్నట్లు కానవస్తున్నది. పంచాంగకర్తలు మాత్రం దీన్ని భీష్మ ఏకాదశిగానే చెప్తున్నారు.

మార్గశిర శుక్లపక్షంలోని ఏకాదశి భీష్ముని నిర్యాణదినం కాదు: అంపశయ్యనెక్కిన రోజు! సాధారణంగా జయంతిని బట్టి పేరు రావడం పరిపాటి శ్రీరామనవమి, శంకర జయంతి, శ్రీజయంతి మున్నగునవి యీ విధంగా ఏర్పడినవే! మాఘ శుద్ధ ఏకాదశికి భీష్మ ఏకాదశి అనే పేరు ఆయన జన్మను అనుసరించి వచ్చియుండ వచ్చునేమో!

భీష్ముడు మరణించునప్పటికి అతని వయస్సు 170 ఏండ్లు అనీ, అప్పటికి ధర్మరాజు 80 ఏళ్ళవాడనీ పరిశోధకులు తెలుపుతున్నారు దీర్ఘజీవి, బ్రహ్మచర్యవ్రత నిష్ఠాగరిష్ఠుడు, జ్ఞాననిధి అయిన భీష్ముణ్ణి స్మరిస్తూ, ఈ ఏకాదశి వ్రతాన్ని జరుపుకోవడం ఆచారమై ఉన్నది.

—బు. వేం. ర.



# ఫోస్ఫోమిన్ శక్తిని పెంపొం దించును, ఆకలిని అధికముచేయును. సహనశక్తిని హెచ్చించును. శరీరము యొక్క రోగనిరోధక శక్తిని ఎక్కువచేయును




అవును —
కుటుంబము అంతటికి ఫోస్ఫోమిన్ వల్ల ఆరోగ్యము కలుగును.

ఫోస్ఫోమిన్...బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫోస్ఫేటులుగల ఆకుపచ్చని పండ్ల రుచిగల టానిక్

SQUIBB® 

SARABHAI CHEMICALS

shilpi sc 49/67 Tel.

# డా॥ ఆత్మారాం

భారతప్రభుత్వ విద్యామంత్రిత్వశాఖలో కార్యదర్శి, కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రిసర్చి (సి. ఎస్. ఐ. ఆర్. కి డైరెక్టర్—జనరల్ అయిన డా. ఆత్మారాం, శాస్త్రవిజ్ఞానాన్ని పారిశ్రామిక ప్రయోజనాలకి వినియోగించడంలో మంచి కృషి చేశారు. 1966లో ప్రస్తుత పదవిలోకి రాకముందు డా. ఆత్మారాం కలకత్తాలో కేంద్రగాజు, సిరామిక్స్ ( కుమ్మరిపని) పరిశోధనా సంస్థకి డైరక్టరుగా వుండేరు. వీరి పర్యవేక్షణలో ఆప్టికల్ గ్లాస్ (కళ్లద్దాలకి వాటికి పనికొచ్చేది) తయారు చేసే పద్ధతిని రూపొందించారు. యిది పరిశ్రమలకి, దేశరక్షకి చాల కీలకమైంది. దీనివల్ల యిప్పుడు మన దేశ ప్రపంచంలో యిటువంటి గ్లాస్ తయారు చేసే బహుకొద్ది దేశాల్లో ఒకటిగా స్థానం సంపాయించింది. డా. ఆత్మారాం పరిశోధనలను గుర్తించి లెనిన్ సోవియట్ టెక్నాలాజికల్ యిన్‌స్టిట్యూట్ (లెనిన్‌గ్రాడ్) వారు ఈమధ్య వారికి 'డాక్టర్ ఆఫ్ టెక్నాలజీ'' అనే గౌరవ డిగ్రీ యిచ్చారు.

ఆత్మారాం 1908లో ఉత్తరప్రదేశ్‌లో పుట్టారు. చదువంతా అలహాబాద్ యూనివర్శిటీలో జరిగింది. 1936లో ఆ యూనివర్శిటీలోనే కెమిస్ట్రీలో డి. ఎస్. సి. డిగ్రీ తీసుకున్నారు. తరువాత స్వర్గీయ ప్రొ మేఘనాధ సాహా (ప్రసిద్ధ భౌతిక శాస్త్రవేత్త) తో కలిసి నేషనల్ ప్లానింగ్ కమిటీలో పనిచేసారు. ఈ కమిటీకి జవహర్‌లాల్ నెహ్రూ చెయిర్మన్‌గా ఉండేవారు.

1940 ప్రాంతాల్లో సి. ఎస్ ఐ. ఆర్ సంస్థ స్థాపించినపుడు డా ఆత్మారాం స్వర్గీయ సర్. ఎస్ ఎస్. భట్నాగర్ దర్శకత్వంలో పరిశోధనలు జరిపారు. 1945లో గాజు, సిరమిక్స్ పరిశోధన సంస్థను నెలకొల్పే బాధ్యత డా. ఆత్మారాంకి అప్పచెప్పారు. దీన్ని ప్రపంచంలో పేరుగల సంస్థగా రూపొందించడానికి ఆయన పాటుబడ్డారు వారిపర్యవేక్షణలో అనేక రకాల గాజులను తయారు చేసే పద్ధతులని రూపొందించారు. వాటివల్ల క్రొత్త పరిశ్రమలు నెలకొల్పడానికి అవకాశం కలిగింది.



డా ఆత్మారాం రచనలు చాలా వున్నాయి రసాయనశాస్త్ర చరిత్రను వారు హిందీలో రచించారు.

సొసైటీ ఆఫ్ గ్లాస్ టెక్నాలజీ (షెఫీల్డ్) వారు ఈయన్ని ఆనరరీ ఫెలోగా ఎన్నుకున్నారు. యింటర్నేషనల్ కమీషన్ ఆఫ్‌గ్లాస్‌లో 1948 లో సభ్యులుగా ఎన్నికయ్యారు. 1967—68లో యిండియన్ సైన్స్ కాంగ్రెస్‌కి ప్రెసిడెంట్ అయ్యారు. నేషనల్ యిన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సెస్‌వారి శాంతి స్వరూప్ భట్నాగర్ పతకాన్ని (1959) పొందిన మొదటి శాస్త్రవేత్త డా ఆత్మారాం గాజు పరిశ్రమలో వైజ్ఞానిక పరిజ్ఞానం ఆవశ్యకతను గుర్తింప చేయడంలో డా. ఆత్మారాం కృషికి వారిని 1964లో అఖిలభారత గాజు ఉత్పత్తి ఫెడరేషన్‌వారు గౌరవించారు.

అభివృద్ధి చెందుతున్న దేశాలు వైజ్ఞానిక పరిశోధనల్ని ఎక్కువగా మానవ ప్రయోజనాలకి వినియోగించాలని డా. ఆత్మారాం అభిప్రాయం.

—డా॥ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి

## తానొకటి తలుస్తే

దానిపై వీళ్ళూ, వీళ్ల సామాన్లూ ఆ రెండిట్నీ ఒక గదంతా ఆక్రమించేసి ఎట్లాగో సర్దుకుని పడుకున్నారు

ఆ వచ్చిన వాళ్ళు మూడు దివాలుండి, వదలకుండా కొడుతున్న ఆ ముసురులోనే వెళ్లవలసిన చోట్లకంతా వెళ్లి, చూడవలసిన ప్రదేశాలన్నీ చూసుకుని, మరీ మమ్మల్ని వదిలారు నిజంగా ఆ మూడు దినాలు మా ప్రాణాలకి మూడు యుగాల్లా కనిపించాయంటే నమ్మండి. వాళ్ళు వెళ్లిన మరునాడు మా అందరికీ పోయిన ప్రాణాలు తిరిగి వచ్చినట్లయినాయి. మా పనిమనిషి కూడా అవేళే వచ్చింది. తాను మానిన దానికి లక్ష సవా సాకులు చెప్పుకుంటూ

ఇంకో విశేషమేమిటంటే, వారం దినాల నుండి మా ప్రాణాలు తీస్తున్న ముసురు కూడా పూర్తిగా వెలిసి వున్నట్లుగా వుండి ఎండ కాయటం మొదలెట్టింది.

వర్షం వెలిసిన తరువాత, జానకి రామయ్యగారి భార్య పనిమాలా వెకిలి నవ్వునవ్వుకుంటూ మమ్మల్ని పరామర్శించటానికి గబోలు తెల్లవారే ప్రత్యక్షమయింది — 'మామ్మగారూ, బంధువులంతా అప్పుడే వెళ్లిపోయినట్లున్నారే. ఏదీ నిన్న సాయంత్రందాకా ఈ పాడువర్షం, బయట అడుగు పెట్టనిస్తేనా? అయ్యోర్రాత. అందరినీ వచ్చి చూసి పోదామన్నా వీలుపడింది కాదూ' అంటూ రాగాలు తీస్తూ అమ్మని వుడికించాలని సర్వప్రయత్నాలూ చేసింది.

అమ్మమ్మ మాత్రం ఏం తక్కువ తిన్నది గనుకనా కడుపులో ఎంతమంటగావున్నా పైకి— 'వెళ్లారమ్మా నిన్నరాత్రేను ఇంకో రెండు దినాలుంటే మా అల్లుడు కూడా వస్తాడు, చూసి మరీ వెళ్లండని ఎంతచెప్పినా వినకుండాను. వాళ్లకీ అరజంటు పనులేవో వున్నాయిట' అని లోపలి బాధ బైటక్కనబడనీయకుండా తీయగా నవ్వుతూ మరీ జవాబిచ్చింది

మీరు నమ్ముతారో లేదోకానీ ఆ దినం నుండి ఆవిడ బతికున్నన్నాళ్లూ చుట్టుపక్కల వాళ్లిళ్లకొచ్చే ఎలాంటి బంధువులను చూచి కూడా, హాస్యం చేసికానీ, కనీసం చిరునవ్వు నవ్వికానీ, ఆనెఱుగదు ఆ సంఘటన మా అందరికి కూడా మంచి గుణపాఠం నేర్పిందంటే నమ్మండి.

తమాషా ఏమంటే, యిన్నేళ్ల తరవాత యిప్పటికి కూడా కొంచెం ముసురుపడితే చాలు ఆ సంగతులన్నీ కళ్లకట్టినట్లు గుర్తుకొస్తుంటాయి. అప్పుడవి ప్రాణ సంకటంగా కనిపించినా యిప్పుడు తలచుకుంటే మాత్రం బలేనవ్వు వస్తుంటుంది.

ఏమిటో జీవితంలోని కొన్ని కొన్ని సంఘటనలు చిన్నవే అయినా, అవన్నీ మనస్సులో ముద్ర పడిపోయి ఆ జన్మాంతమూ వుండిపోతుంటాయి. ●

# కన్నతండ్రి పై కత్తి దూసిన కొడుకు

కన్నతండ్రిని కత్తితో పొడిచిన ఘనత ఢిల్లీలో ఓంప్రకాష్ అనే అతనికి దక్కింది. తన తండ్రి వద్ద అప్పుకు వచ్చిన మేనమామ మీద, మేనత్త మీద అప్పు ఇస్తున్న తండ్రి మీదా విరుచుకుపడి, కోపంలో తండ్రిని పొడిచి, అడ్డొచ్చిన మేనత్తనూ, వారితో వచ్చిన మరో పెద్ద మనిషినీ ఓంప్రకాష్ గాయపరచాడట.

* * *

బొంబాయిలో ఒక సంపన్న కుటుంబకుని సంస్థలో గేటు కాపలాదారుడైన ఓ 25 ఏళ్ళ గూర్ఖాతో ఆ యజమాని కూతురు (19 ఏళ్ళు) లేచిపోయిందట. ఈ విషయం ఆయన పోలీసులకు తెలియజేస్తే—వారు కేరళకి చెందిన కొచ్చిన్‌లో వారిద్దర్నీ పట్టుకున్నారట—విధిరాకాసి.

# పునర్జన్మ

మిలన్ (ఫ్రాన్స్)లో స్టైమెన్ లెబెల్ అనే ఆమె ప్రసవ సమయంలో చనిపోయి, తిరిగి బ్రతికిందట కాన్పు సమయంలో డాక్టర్లు తప్పనిసరిగా ఒక కష్టతరమైన ఆపరేషను చేశారట ఈ ఆపరేషను ఒకే ఒక నిముషంలో ముగిసిందట కానీ, ఆమె గుండె వెంటనే ఆగిపోయిందట. నాలుగు నిముషాలు చేసిన మర్దనతో గుండె తిరిగి ఆడ నారంభించిందట. తల్లీ పిల్లా ఖులాసాగా వున్నారట.







# వింత ప్రేమ, పెళ్లి!

పాకిస్తాన్‌లో కంజానార్ అనేచోట ఎనమండుగురు పిల్లలతల్లి అయిన యాభై యేళ్ళ ముసలావిడ పదిహేడేళ్ళ కుర్రాణ్ణి ప్రేమించి, పెళ్ళిచేసుకుందట. ఈమెకు భర్తపోయి పదిహేడేళ్ళు అయిందట. ఇంటిపక్కనున్న స్కూలులో తొమ్మిదో తరగతి చదువుతున్న ఆ కుర్రాణ్ణి యింటికి పిలిచి, ప్రేమపాఠాలు చెప్పిందట. ప్రేమ ముదిరాక, ఇటీవల వీరిరువురూ సశాస్త్రీయంగా పెళ్లి (?) చేసుకున్నారట. దీర్ఘశృంగమనద్వాహం, నిర్లజ్జంచ విధవాం స్త్రియాం......దూరతః పరివర్జయేత్...కాదూ!

* * *

కరెంటును దొంగతనంగా ఉపయోగిస్తున్న వారిని పట్టుకోడానికి చేస్తున్న సోదాలో ఓ పిండి మరమీదకు దాడి చేసిన ఒక సబ్ ఇనస్పెక్టరును 200 మంది ఎదుర్కొని చంపేశారట. పిండిమరనుంచి ఆయనా, ఇద్దరు కానిస్టేబుల్స్, ఇద్దరు ఎలక్ట్రికల్ ఇంజనీర్లు తిరిగి వస్తుండగా 200మంది వారిమీద పడ్డారట. సబ్ ఇనస్పెక్టరు తప్ప మిగిలినవారు తప్పించుకున్నారట— ఇది పాట్నాలో జరిగింది.

* * *

40 వేల తులాల బంగారం, 5 వేల వాచీలు మరికొన్ని విదేశీయ సిగరెట్లు, వెరసి 83 లక్షల రూపాయల కిమ్మత్తు చేసే సరకును కస్టమ్స్‌శాఖ, సెంట్రల్ ఎక్సయిజుశాఖ కొచ్చిన్ ప్రాంతంలో పట్టుకున్నది. వీరు ధైర్యసాహసాలతో ఈ సరుకున్న ఒక వోడను వెంబడించి, తమ వెసల్‌లోంచి ఆ ఓడలోకి దూకి వస్తువులను పట్టుకున్నారట. ఈ సందర్భంలో వో 14 మందిని పట్టుకున్నారు

* * *

కుటుంబ నియంత్రణ పథకంలో పురుషులకూ లూప్‌లూ, మాత్రలూ తయారు చేస్తున్నారట. ఈ విషయం అహ్మదాబాద్‌లో ఎల్. కొఠారి చెప్పారు. జామ్‌నగర్‌వద్ద కల అయుర్వేద విశ్వవిద్యాలయం పోస్టుగ్రాడ్యుయేట్ పరిశోధనా శిక్షణా కేంద్రం డైరెక్టరు డా. శుక్లా పురుషులు ఉపయోగించేటందుకు వీలయిన గర్భ నిరోధక మాత్రలు తయారు చేస్తున్నారట.

# ఆగిపోయిన వివాహం బహుమతుల వేలం

రియోడిజనీరోలో వివాహ మాడదలచుకున్న ఇద్దరు వధూవరులు ఆఖరిక్షణాన్న




మనసు మార్చుకుని, తమ ఇద్దరికీ దాంపత్య జీవితం సరిపడదని తీర్మానించుకున్నారట. కానీ ఆ పాటికే వారికి చాలా బహుమతులు రావడంవల్ల బంధువులంతా చేరి ఆ బహుమతులను ఆగిపోయిన వధూవరుల సమ్మతిమీద ఆ ఎగ్జిబిషను వేలం వేశారట. దీనికి నారిద్దరూ అధ్యక్షత వహించారట—నావెల్ ఐడియా. ●




**బి. ఎస్, హైదరాబాదు**

అన్నయ్యతో చనువుగా ఉండడం తప్పా? అది చూసి తోటి వారు అపవాదు వేయడం న్యాయమా?

బాగుంది—లోకులకి అతగాడు అన్నయ్యా మామయ్యా ఎలా తెలుస్తుంది?

**బి. ఎస్. ఎస్, చెక్కాం**

చాలా ఘోరం, అన్యాయం. ఇన్ని రచనలు మీవి పత్రికలో వస్తూంటే ఇక మాలాంటి క్రొత్తకారు రచయితల మాటేమిటి?

చెక్కాం బి. ఎస్. ఎస్గా, తమరు రాసి నేర్చుకునే దాకా నేను రాయడం మానేస్తానుగా?! లేక నేను రాయకుండా ఉండడమే కావాలా?

**వి. ఎస్. డి. కాకినాడ**

మా వారికి తోచదు. చెప్తే వినరు. ఉద్యోగంలో నాలుగురాళ్లు సంపాదించినా అందరూ నెత్తిన చెయ్యి పెట్టేవాళ్లే. పోనీ అని పొలం పుట్రాలేదు. ఇప్పటికే నలుగురు పిల్లలు కానీ సంసారం చూస్తూంటే బెంగగా ఉంటుంది ఏమయ్యె

ఏంచేస్తాం చెల్లెలా—ఏ మాటకారి మొగుడైనా కావాలి— మదుంపార మడ్డైనా కావాలన్నారు. ఆ రెండూ లేకున్నా కనీసం పెకైనా సంసారంలో నేర్పుండాలి.. ఆలోచించుకో,

**టి. జి. ఎస్, హైదరాబాదు**

నేనో రచయితగా రాణించాలంటే ఏమైనా క్వాలిఫికేషన్సు కావాలా? కేవలం లౌకిక జ్ఞానం చాలా?

రాయడం వస్తే చాలు!

**వి ఎస్. డి, న్యూఢిల్లీ**

ఇతర భాషల నుండి (ఇంగ్లీషు, హిందీ) కథలు గేయాలు తెలుగులోకి అనువదించడానికి, లేక వాటిని ఆధారం చేసుకొని స్వయంగా వ్రాయడానికి ఆయా రచయితల అనుమతి ఎలా తీసుకోవాలి? ఒకవేళ వారు జీవించి లేకపోతే ఏం చెయ్యాలి? వారపత్రికలలోని కథలు అనువదించడానికెవరి నడగాలి?

అనువాదానికిగాని అనుసరణకిగాని ఆయా ఒరిజనల్ రచయితల పర్మిషన్ ఉంటే చాలు. సాధారణంగా ఉత్తరంరాస్తే చాలు రచయితలు (ముఖ్యంగా ఆంగ్ల రచయితలు) తమ సమ్మతి నిచ్చేస్తారు. వారి పర్మిషన్‌లో ప్లాటు వాడుకుంటే మీరా రచయితపేరు చెప్పనే అక్కరలేదు. (కాని పర్మిషన్ మటుకు రాసి తెప్పించుకోవాలి) పత్రికలలో వడే కథలకి గూడా ఆయా రచయితలని అడిగితేచాలు. కెరాఫ్ పత్రిక,కి రచయితలకి రాసే పత్రికవారు ఆయా రచయితలకి మీలేఖను పంపేస్తారు. ఒక రచయిత మరణానంతరం ఏభయి సంవత్సరాలదాకా ఆ రచనలకి కాపీరైటు ఉంటుంది కనుక రచయిత వారసులను అడిగి పర్మిషన్ పొందడం ఎప్పుడూ మంచిది. కథాశిల్పంగాని ప్లాటుగాని నచ్చితే వాడుకుందుకు (అనువదించడం కాదు) అంతే చేస్తారు. ఇలాగే నా కెంతోమంది ఆధునిక ఆంగ్ల రచయితలతో లేఖా పరిచయా లున్నాయి . . . తప్పకుండా ఉత్తరాలు వ్రాసి మీకు అనువదించాలనుకున్న వాటిని అనువదించండి. మీకు నా వ్యాసాలు నచ్చుతున్నందుకు కృతజ్ఞురాలిని.

**పి. వి. కె. ఎమ్, నందలూరు**

మీకు నేరుగా వ్రాసి కొన్ని ముఖ్యమైన సంగతులు తెలుసుకో వచ్చునా? లేదా?

ప్రశ్నావళికి జవాబులు పత్రికా ముఖంగానే—మూర్తి గారూ.

**యమ్. బి. హెచ్. ఎల్, విజయవాడ**

...మరల యీ కాన్పుకూడా ఆపరేషనే. పిల్లలు యిక కలగకుండా చేస్తారట. మా అత్తగారికి చాలా మంది పిల్లలు కావలెనని ఉన్నది ... నాలుగైదు ఆపరేషన్సు కూడా చేస్తారట కదా అంటారు?

ముచ్చటగా ముగ్గురు చాలదా. ఎంత ఆస్తి యిచ్చినా ఎంత ఉన్నతికి తెచ్చినా? సీరియల్ ఆపరేషన్లు సాధారణంగా 'మూడింటికి — నివ్వరు. అత్తగారికి నచ్చ చెప్పండి.

**బి. ఎల్. కె, విజయనగరం**

మీకు మహాగర్వం అని విన్నాను.

నిజమే— 'అల్పవిద్యా మహాగర్వః' అన్నారు కదా పెద్దలు!

**ఎస్. ఆర్. ఎమ్, ఖర్గపూరు**

చిన్నపిల్లలా ఎల్లప్పుడూ చెల్లెళ్లు తమ్ముళ్లతో గిల్లి కజ్జాలు తెస్తూ ప్రాణాలు తోడేస్తుంది. కోపంవచ్చి చేయి చేసుకుంటే ఈడొచ్చినఅమ్మాయి నెందుకలా కొడతారని యిరుగు పొరుగు వారు చెప్పొస్తున్నారు...

కొంత వయస్సు దాటాక పిల్లలమీద చెయ్యి చేసుకోవడంలో అర్థంలేదు. అయినా అమ్మాయి అలావిసిగించడం ఏమిటి? ఇంగిత జ్ఞానం లేనిదా? చదివించడంలేదా?... పనిపాట లేని కుర్రపిల్లలలాగే తయారవుతారు — ఏమీతోచక. కాలక్షేపానికేనా ఏదైనాపని కల్పించండి. కనీసం అదయినా చేసేటట్టు కట్టుదిట్టం చేయండి తప్పులేదు.

**ఎమ్. ఎస్. ఎన్, మద్రాసు**

'నిదానమే ప్రధానం'అన్నారు పెద్దలు. అదే పెద్దలు ఆలస్యం అమృతం విషం అనికూడా అన్నారు. ఏమాట నమ్మాలి?

రెండు మాటలలో ఒకే విషయాని కన్నారా? లేదే. ఆయా పనులనిపట్టి అవలంబించవలసిన మార్గం సూచించారంతే. ప్రాణంమీద కొస్తే ఆలస్యం అమృతం విషం త్వరగా ముందుసంగతి చూడండి. ఆస్తిపాస్తులు కొనే ఆలోచన చేస్తున్నారా? నిదానం ప్రధానం. అదీ సంగతి.

తెలుగు పుస్తక ప్రపంచంలో
హెచ్. ఎల్. పి. కొత్తవెలుగు।
అందులో ఇది మరీ సరికొత్త మలుపు




# "ఇంటింటా స్వంత గ్రంథాలయం" ప్రణాళిక సరికొత్త రూపంలో సమర్పణ!







## పాఠకుల సౌకర్యానికై సరికొత్త మార్పులు! సరికొత్త సదుపాయాలు!! సరికొత్త పద్ధతి!!



ఎన్ని మార్పులు తెచ్చినా, ఎన్ని చేర్పులు చేసినా అందరికీ అందుబాటుగా వున్న మా చందా మొత్తంలో మార్పులేదు!

ఈ వివరాలు పరిశీలించండి. మీకే తెలుస్తుంది!



| పాత హెచ్. ఎల్. పి. ప్రణాళిక | కొత్త హెచ్. ఎల్. పి. ప్రణాళిక | సమీక్ష |
|---|---|---|
| 3000 తెలుగు పుస్తకాలనుంచి మాత్రమే ఎన్నుకోవచ్చు. ఇంగ్లీషు పుస్తకాలు లేవు | 3200 తెలుగు పుస్తకాలేకాక 400 పైగా ఉన్న ఇంగ్లీషు పుస్తకాల నుంచి కూడ ఎన్నుకోవచ్చు | పెరుగుతున్న మీ స్వంత గ్రంథాలయానికి మరిన్ని కొత్త పుస్తకాలు. |
| పూర్తి చందా కట్టడానికి పూర్తి 18 నెలల దీర్ఘ గడువు | 12 నెలల్లోనే చందా మొత్తం పూర్తవుతుంది | శీఘ్రతరమైన సదుపాయం. |
| చందా మొత్తం రు. 5 × 18 నెలలు = రూ. 90/- | చందా మొత్తం రు. 7.50 × 12 నెలలు = రూ. 90/- | అందరికీ అందుబాటైన మొత్తం. మార్పులేదు. |

హెచ్. ఎల్. పి. చందాదారులు ఇన్నాళ్లూ పొందుతూ వచ్చిన ఉచిత పుస్తకాలూ, ఉచిత రవాణా సదుపాయాలూ, నెలనెలా 'పుస్తక ప్రపంచం', యావజ్జీవిత సదుపాయాలూ మొదలైన వాటిలో ఏవిధమైన మార్పులేదు.

ఇన్నాళ్లూ ఇంతగా ఆదరణ పొందిన 'ఇంటింటా స్వంత గ్రంథాలయం' ప్రణాళికలో సభ్యులుగా చేరి 22,500 మందికిపైగా ఆంధ్రపాఠకులు తమ ఇళ్లలో స్వంత గ్రంథాలయాలు నెలకొల్పుకున్నారు.

ఇప్పుడు ఇస్తున్న సరికొత్త సదుపాయాలద్వారా మరిన్ని 'ఇంటింటా గ్రంథాలయాలు' వెలుస్తాయని ఆశిస్తున్నాం.






**జరిగిన కథ**

లలితకి మోహన్‌తో పరిచయమవుతుంది. అది ప్రేమగా పరిణమిస్తుంది. పెళ్ళికూడా చేసుకోవా లనుకుంటారు. ఆస్తికోసమే మోహన్ తనని పెళ్ళిచేసుకోగలిగాడని తెలుసుకున్న లలిత అతనితో తెగతెంపులు చేసుకుంటుంది. లలితకి పెద్ద దిక్కయిన అత్తయ్య చనిపోతుంది. లాయరు సలహాపైన ఆమె బలరామశాస్త్రి గారనే మరో గార్డియన్ ఇంటికి వెళ్తుంది. బలరాం లలితమీద ఎక్కువ శ్రద్ధ చూపిస్తూ వుంటాడు. లలితకి మోహన్‌కి సంబంధ మున్నదని అందరికీ తెలియజెప్పాలని చూస్తుంది సరళకు సరళ మాటలు నమ్మలేకపోయాడు బలరాం. అయినా లలిత మీద నమ్మకం పోలే దతనికి. సరళకు యుక్తిని కనిపెట్టి వాళ్ళని యింట్లో నుంచి వెళ్ళగొట్టా లనుకుంటాడు.

## 10

లలిత వీరావేశంతో తోలుకొచ్చిన కారు ఆ రోజు మోహన్‌ని దింపిన ఇంటిదగ్గర ఆపింది.

తలుపు తెరచుకుని దిగి విసురుగా తలుపు మూసింది.

అదొక లాడ్జింగు కాబోలు—చూడ్డానికి కూడా అంతగొప్పగాలేదు. ముందు హాల్లో బల్ల ముందో వ్యక్తి కునికిపాట్లు పడుతూ కూర్చున్నాడు.

'మిస్టర్ మోహన్‌ని కొంచెం పిలుస్తారా ?...' అడిగింది.

'ఏమోహన్ ? మీరెవరు ?' అడిగా డతగాడు. ఆడపిల్ల రాత్రిపూట ఒంటరిగా వచ్చిందేమిటన్న ఆలోచనతో.

'అదే నిన్నమొన్న పెనీ పనిమీద ఇక్కడ దిగామని చెప్పారు.' అంది ధైర్యంకూడ తెచ్చుకుని.

'వారంతా ఓ అరగంటైంది వెళ్ళి పోయారు...' అన్నాడు గుమస్తా.

'వెళ్ళిపోయారా ? ఎక్కడికి ?' భయంతో ఓ మూలనుంచి మాట రావడంలేదు లలితకి. మోహన్ వెళ్ళిపోతే—ఇంక బల రాంకి తనేం సమాధానం చెప్తుంది?

'కాని ఓ కవరిచ్చి వెళ్ళారు—ఎవరేనా వస్తే యివ్వమని.' అన్నాడు గుమస్తా.

'ఎవరొస్తారని చెప్పారు ?'

'ఓ అమ్మాయిగారొస్తారు యివ్వమన్నారు' అంటూ డ్రాయరులాగి ఓకవరు తీసి అందించాడు.

కవరుమీద స్పష్టంగా లలితపేరు రాసి ఉంది.

'ఈ కవరందుకున్నట్టు సంతకం పెట్టండి' అని ఓ రిజిస్టరు ముందుకి తోశాడు. యాంత్రికంగా సంతకంపెట్టి కారుదగ్గిరకి నడిచింది లలిత...సీటులో కూర్చుని వణుకుతున్న చేతులతో కవరు చించింది—నన్నిక ఏవిధంగా పీడిస్తానని బెదరిస్తాడీ మోహన్? అనుకుంది—కాని కవరులో టిష్యూ కాగితానికి చుట్టి వగడాలదండ ఉంది. చిన్న కార్డు ముక్కమీద— 'నన్ను క్షమించు లలితా, నిన్ను అపార్థం చేసుకున్నాను' అనిమాత్రం రాసిఉంది.

దడ దడ లాడుతున్న గుండెలతో ... కారు స్టార్టు చేసింది లలిత. ఇంటికివెళ్ళి బలరాంకి అంతా వివరంగా చెప్పేస్తే యీ బెడద తీరిపోతుంది. నన్ను అర్థం చేసుకుంటాడా సరి—లేకుంటే ... గొంతులో దుఃఖం అడ్డుపడింది లలితకి...కారు రోడ్డువారగా నిలిపి స్టీరింగుమీద తల ఆన్చి కసితీరా ఏడ్చుకుంది ... కళ్ళు తుడుచుకొని

'ఇక ప్రపంచాన్ని ఎదుర్కోవచ్చు— ఇదివరకటిది ప్రేమ మంటకాదు— పిచ్చిమోహం అందుకే గుండె కాల్చలేదు. ఇప్పు డిది— నన్ను నిలువునా దహించివేస్తుంది తప్పదు — నేనిక జీవితంలో ఇలా ఎవరికోసం బాధపడలేను—ఉద్యోగం చేసుకు బ్రతకడమే శరణ్యం అనుకుంది. కొంగుతో ముఖం తుడుచుకుని తిరిగి డ్రైవింగుమీదకి దృష్టి నిల్పింది .. రోడ్డు ప్రశాంతంగా ఉంది. అసలు జనసంచారం లేదు. లారీలూ కార్లూకూడా లేవు—రోడ్డు కిటూ అటూ ఉన్న చెట్ల మొదళ్ళు కారు లైట్లుపడి కదలి నడుస్తున్నట్టు కనిపిస్తున్నాయి. ఆకాశం చెట్ల సందులనుంచి అక్కడక్కడే కన్పిస్తూంది.—ఒకటిఅరా మిణుకుమిణుకు మంటూ నక్షత్రాలు కన్పిస్తున్నాయి. మిణుగురు పురుగులు మటుకు వందలకి వందలు వింత కాంతులు వెదజిమ్మి తిరుగాడు తున్నాయి — దారిపొడుగునా ...

దూరంలో కారేదో వస్తోందో. లేక ఏ లారీ ఏనానో — పెద్ద నక్షత్రంలాగా లైటు కన్పిస్తూంది. అది త్వర త్వరగా ముందుకి సాగివస్తూంది ...

బలరాం ఆలోచనలు కట్టిపెట్టి శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు. రంగయ్య అందించిన ఉత్తరం తక్షణమే చూసిఉంటే ఇంత ఆలస్యం కాకపోను అనుకున్నాడు.

ఎదురుగా కారు రావడం సరళతో పాటే బలరాంకూడా చూశాడు.

ఎదుటికారు లైట్లు తగ్గించి హెచ్చించింది. అదేం గమనించినట్టులేదు సరళ... ఆమె మనస్సు విషపుటాలోచనలతో సత

మతం అవుతోంది. ఈ లలితెక్కడ దాపురించింది. అవదయి తీరుతుందని తలపోసిన జీవితాన్ని...కాకుండా చేసేలా తయారైంది. ఇప్పుడిక అసలు లాభంలేకుండా పోయింది. బలరాంకి చాలా నిజాలు తెలిసిపోయి ఉంటాయి. అందుకే అంత పట్టుదలగా తనని తీసుకువచ్చి ఉంటాడు.

కార్లు దగ్గరవుతున్నకొద్దీ సరళ బుర్రలో ఒకపథకం ఏర్పడ సాగింది... ఒక్కసారి కళ్ళు మూసుకుని చేసేసిందంటే అన్నిసమస్యలూ పటాపంచలై పోతాయి అనుకుంది అంతే.

'జాగ్రత్త—మరీ దగ్గరిగా వస్తూంది లైటు తగ్గించవేం?' అంటూనే స్టీరింగు మీద చేయివేశాడు బలరాం.

బలంగా అతనిచేయి తోసేసి రోడ్డు మధ్యకి కారు తెచ్చేసింది—సరళ.

అక్షణంలో ఆమెతలపెట్టిన ఘాతుకం అర్థమైంది.

విజ్జోకారు చిన్న హంసలాగా తేలిపోతూ వస్తూంది. అది లలితదే సందేహం అక్కరలేదు.

మరుక్షణంలో కీచుమంటూ బ్రేకు వేసింది లలితకారు. అప్పటికే సరళ తిన్నగా ఎదుటికారుని కొట్టేసింది. పెద్ద చప్పుడుతో రెండుకార్లూ అటూయిటూ ఆగాయి. లలిత కేకతోపాటే చిన్నకారు బాగా వారకిపోయింది. ముందుభాగం—తుక్కుగా అయిపోయింది. విండ్‌స్క్రీను అద్దం అసలు మిగలలేదు.

ఎలాగో కారులోంచి బయటపడ్డాడుబలరాం. సరళకాట్టే దెబ్బ తగల్లేదు గాని రాయిలా కూర్చుండి పోయింది.

బలరాం కాలికి దెబ్బతగిలింది. లక్ష్య పెట్టకుండ పక్కగా నిలచిన కారుదగ్గరికి పరుగెత్తాడు.

'లలితా! మై గాడ్ చచ్చిపోలేదుకదా?' అంటూ డ్రైవరు సీటులోకి చూశాడు. లలిత చక్రంమీద వాలిపోయి ఉంది—నుదిటిమీంచి రక్తం కారుతోంది.

'లలితా! ప్లీజ్ చూడు నాకేసి, నేను బలరాంని' అంటూ బాధగా కుదిపి చూశాడు లలితని. కాని ఆమెలో చైతన్యం లేదు...స్పృహతప్పి పడిపోయింది.

తలుపు బలంగా తెరిచి, నెమ్మదిగా చక్రం ముందునుంచి ఆమెని తన గుండెలకి ఆన్చుకున్నాడు. మెల్లిగా రెండుచేతులో ఎత్తి ఇవతలకి తీశాడు. తల వాల్చేసి అలాగే ఉండిపోయిన లలితని చూస్తే బలరాంకి భయం, దుఃఖంకూడా పొంగాయి. 'ప్లీజ్, అన్ని మబ్బులూ విడిన యిప్పుడు నువ్వు నన్నొదిలిపోకు,' అంటూ చెప్తున్నాడు.

సరళ కారుదిగి కింద నిలబడింది.

బలరాం లలితని కారు వెనకసీటులో భద్రంగా పడుకోపెట్టాడు. డ్రైవరు సీటులోకి ఎక్కి ఇంజన్ ఆన్‌చేశాడు చప్పుడేకాని



అమ్మమ్మగారు పెడుతూంటే భోజనం చేస్తూ గత ఇరవైనాలుగ్గంటలలో జరిగిన విశేషాలు తిరగేస్తున్నాడు.

'సరళ యింత దారుణం చేస్తుందని నేను ఊహల్లోకూడా అనుకోలేదు... కొంచెంలో తప్పింది ప్రమాదం' అన్నాడు.

'ఈయన కారెక్కించుకునేసరికే బాగా కుప్పకూలి పోయిందట. ఫోను రాగానే బయలుదేరారు...పోనీలే కడుపు చించుకుంటే కాళ్లమీద పడ్తుందన్నారు— మన యింటి గుట్టే రచ్చ కెక్కేది. అన్నీ మరిచి పోవడమే మంచిదని తోస్తుంది బలరాం.'

'మోహన్ ఆలేఖ రాసి పంపకపోతే నే నెన్నిటికీ లలితని నమ్మలేక పోదును... సరళ అంత గట్టిప్లాను వేసినట్టుంది...'

'నేనిక్కడే కాస్సేపు పడుకుంటాను. వెళ్లి లలితని చూసిరండి' అన్నాడు.

'అదే నేనూ అనుకుంటున్నాను...ఏం కావలసినా రాఘవుణ్ణి పిలు' అంటూ ఆవిడ పళ్లాలు అవి పట్టుకుని ఆస్పత్రికి బయలుదేరారు...

లలిత తెలివిగానే ఉంది.

అమ్మమ్మగార్ని చూసేసరికి ఎక్కడలేని దుఃఖం పొంగివచ్చింది

'అంతా అయిపోయింది కదమ్మా ఇప్పుడెందుకు దుఃఖం' అంటూ తల నిమురుతూ కూర్చున్నారు.

'సరళేనా చేయాలని చేసిందనుకోను...' అంది నెమ్మదిగా.

'వాళ్లసంగతి ఎత్తకిక. వాళ్లని చిట్టివలసలో పొలాలు చూసుకోమని అన్ని ఏర్పాట్లూ చేసేస్తున్నాడు బలరాం. ఎంత బంధువైనా పాముకి పాలుపోసి పెంచడం ఎప్పటికైనా హానికరమే బలరాంని చూశావా?' అడిగారు.

'రానేలేదు.. నామీద బాగా కోపం వచ్చి ఉంటుంది...నేనేం చెయ్యాలి? ఎప్పటికప్పుడే చెప్పాలని...కాని కుదరలేదు' బాధగా అంది లలిత.

'నీమీద కోపం ఎందుకు పిచ్చితల్లీ. నువ్వంటే అతనికెంతయిష్టమో గ్రహిస్తే అలా అనుకోవు. ప్రేమ లున్నచోటే కోపతాపా లుంటాయి ఆవేశం ఉంటుంది నా అనుకున్నవాళ్లు ముభావంగా ఉంటే ఎలా ఊరుకో గల్గుతారు లలితా. నువ్వుకొంచెం ఓరిమ చూపించాలి ...

'నేనా! నువ్వు చిన్నదాన్నని తోసిపారేస్తుంటే ... అమ్మమ్మగారూ, నేనంటే కోపంలేదుకదూ బలరాంకి?' పసిపిల్లలాగా అడిగింది.

'లేదు. నీమీద జాలికూడా లేదు బలరాంకి...ఒక్క ప్రేమ తప్పించి'

'నిజమంటారా? నన్ను నిజంగా ప్రేమిస్తాడంటారా?'

'అందుకే కదమ్మా నీకేదైనా అయిపోయిఉంటే అని బాధపడుతున్నాడు ... నేను వెళ్లి బలరాంని పంపిస్తాను...రేపు నిన్నింటికి పంపేస్తారు. నా దగ్గరఉండు. అన్నీ సవ్యంగా ముగించి నీయింట దింపుతాను సరేనా?' ఆప్యాయంగా తల నిమురుతూ అడిగారు.

'నా మూర్ఖత్వాన్ని క్షమించమని చెప్పండి బలరాంకి ... చెప్తారుకదా?'

'అలాగే' అంటూ ఆవిడ తిరిగి యింటికి వచ్చేశారు

'కీర్తిపతాక'లో కొత్తవెలుగు నింపే వార్త చెప్పి సుబ్బారావుగారుకూడా తిరిగి వచ్చారు

'రెండు రోజుల్లో సరస్వతమ్మ సరళ వెళ్లిపోతారు బలరాం, తరవాతే లలితని తీసుకువెళ్ళు.' అన్నారు.

'అంతే కాదండీ అమ్మాయికీ బలరాంకీ ఆ పెళ్లి కాస్త జరిపించి పంపేస్తే మన బాధ్యతకూడా తీరిపోతుంది' అన్నారు అమ్మమ్మగారు.

'అది బాగానే ఉంటుంది ... ఇదిగో బలరాం అమ్మాయికారు సీటులో ఉంది—' అంటూ పగడాలదండ ఉన్న కవరు అందించారు.

'కారుకూడా గారేజికి పంపే ప్రయత్నం చేసేసాము. నీ కారుకి పొట్టలేగా పడక. అవి తరవాత చూసుకోవచ్చు. ఏమంటావు?'

'అలాగే చేద్దాం...నేనోసారివెళ్లి లలితని చూసి యింటికి వెడతాను.' అంటూ లేచాడు బలరాం.

గది తలుపులు జేర్లవేసి ఉన్నాయి.

తోసుకుని లోపలికి వెళ్లాడు బలరాం.

'బలరాం వచ్చావా?' అంటూ చేయి చాపింది లలిత.

మంచం పక్కగా మోకాళ్ల మీద కూర్చుంటూ ఆమెచేయి అందుకుని తన గుండెల కాన్చుకున్నాడు బలరాం.

గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి.

'నేను చాలా గుడ్డిగా ప్రవర్తించాను. క్షమించు లలితా, నీతో చనువుగా ఉండలేక, ఉండకుండా ఉండలేక సతమతమై బాధపడ్డాను బాధపెట్టాను.' అన్నాడు పచ్చగా ఉన్న ఆమె మునివేళ్లని పెదవులతో తాకుతూ.

'నువ్వెలా ఉన్నా భరిస్తాను. కొట్టు తిట్టు కోప్పడు అంతేగాని యిలా దైన్యంగా మాట్లాడితే నేను సహించలేను బలరాం'

అంది లలిత. ఆమెకళ్లు నీళ్ళతో నిండి మిలమిల మెరుస్తున్నాయి.



వంగి వణుకుతున్న ఆమె పెదవులు చుంబించాడు బలరాం.

అప్రయత్నంగానే ఆమె చేతులతని విశాలమైన వెన్ను నిమిరాయి.

'మనం దెబ్బలాడుకోవచ్చు, మాట్లాడుకోవడం మానేస్తూ ఉండవచ్చు కాని ఎప్పుడూ విడిగా ఉండడంమటుకు నేను సహించను. నన్ను వెళ్ళనివ్వవు కదూ ?' అడిగింది లలిత.

'ఇంకెక్కడికి వెళ్ళడం ?' అంటూ అమ్మమ్మగారి ప్లాను చెప్పాడు బలరాం.

'నన్ను క్షమించకలవా బలరాం. నిజంగా మోహన్‌ని నేను ప్రేమించా ననుకున్నానే అది ప్రేమ కాదని త్వరలోనే తెలుసుకున్నాను అందుకే మోహన్ ఇక్కడికి వచ్చినా నా హృదయం ఉప్పొంగిపోలేదు. ఉదాసీనంగా ఉండిపోయింది నువ్విది గ్రహించకలవా ?' బలరాం తలనిమురుతూ అడిగింది లలిత.

'మోహన్ చెప్పాడు లలితా, నువ్విప్పుడెందుకు చెప్పడం ! నువ్వా రాత్రి వస్తావని చెప్పివచ్చిందిట సరళ. అతనికి కూడా ఎక్కడో అమాయకంగా ఉండే నిన్ను మోసగించడం బాధపెట్టడం ఇష్టంలేకపోయింది. అందుకే అమ్మమ్మగారి తోటవాడితో ఉత్తరంయిచ్చి నా కిమ్మన్నాడు. తను ఇక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు ... నే సరళకీ సంగతి చెప్పకుండా బయిలుదేరదీశాను...పోనీలెద్దూ మబ్బుతెరలు తొలగిపోయిన యిప్పుడిక ఆ సంగతులు జ్ఞాపకం చేయకు' అంటూ ఆమె గుండెలమీద తలవాల్చు కున్నాడు బలరాం.

'నాకీ ప్రమాదం జరక్కపోతే ఎప్పటికీ నీ ప్రేమ చెప్పకుండా నన్ను బాధపెట్టివాడివేకదూ ?' అడిగింది లలిత.

'ఏమో...అయినా మనిషి ఓర్పుకి కూడా ఓ అంతముంటుంది. నాలో ఎన్నాళ్ళిముడ్చుకుంటాను ? చెప్పేసేవాణ్ణి నేను లేకపోతే జెలసీతో నిన్ను కాల్చుకుతినేవాణ్ణి !...బాగా ఆలోచించుకో లలితా, యిప్పటికీ మించిపోయింది లేదు. వయస్సులో డబ్బులో హోదాలో నీకుతగిన వరులు ఎందరో లభిస్తారు...'

బలరాం మాట ముగించకుండా చేతితో అతని నోరుమూసింది.

'ఇది జాగ్రత్తగా విను బలరాం. నాకు తగిన వరుడు దొరికాడు. కొంచెం దళసరి బుర్ర అయితేనేం ? ఒకొక్కప్పుడు పిచ్చిగా ఆలోచిస్తాడు. అయితేనేం నా కతనే కావాలి ...ఇక వయస్సు అంటావా ? నాకు పెద్దవాళ్ళమీదే మోజు — అన్నది అత్తయ్యతో సద్దుకుపోతే తెలియలేదా ? లాయరుగారంటే ఉన్న యిష్టంలో తెలియలేదా ? ఇక్కడ సుబ్బారావుగారు నాకు మంచి సర్టిఫికేటిచ్చినప్పుడు తెలియలేదా ?' అంటూ నన్నగా ఓ మొట్టికాయి యిచ్చింది.

జేబులోంచి వగడాలు తీసి మెళ్ళో తగిలిస్తూ...బలరాం సన్నగా నవ్వుకున్నాడు.

'ఎందుకు ?' అడిగింది లలిత.

'ఆరోజు—అంటే నిన్నకదూ ! ఇలాగే నిమెడలో ఇది పెట్టాలనుకున్నాను.

ఒక్కసారి నిన్ను కౌగిట చేర్చుకోవాలన్న పిచ్చికోరికని బలవంతంగా అణచుకోడం జ్ఞాపకం వచ్చింది.

లలిత చేతులుజాచి అతన్ని గట్టిగా పెనవేసుకుంది—అతని భుజంలో ముఖం దాచుకుంది......'నన్నిప్పుడే ఇక్కణ్ణుంచి తీసుకుపో బలరాం, ప్లీజ్' అంది రహస్యంగా.

'లేదు లేదు...మళ్ళీ నువ్వు నాభార్యగానే నాయింట అడుగుపెడుదువుగాని అప్పటిదాకా అమ్మమ్మగారి దగ్గరే ! అంటూ ముక్కుమీద చిన్నముద్దు పెట్టాడు... బలరాం.

మూతి ముడుచుకుని పడుకుంది లలిత.

'రేపు నీకు విముక్తి. అమ్మమ్మగారింట నిన్ను ఆరాధించి—నాదాన్ని చేసుకుంటాము లలితా, అప్పటిదాకా నన్ను మరిచిపోకు' అంటూ లేచాడు బలరాం.

'ప్రేమించు ప్రేమకై' అంటూ పాడేవే...నయం అది పాడుకోమన్నావు కాదు—' అంది లలిత.

'పాడుకున్నా తప్పులేదు—నేను ముక్తి కోసం నిన్ను ప్రేమిస్తున్నానులే' అంటూ గదిదాటి వచ్చేశాడు బలరాం.

ఇంటిదారి పట్టిన కారులో బలరాం హృదయం తేలికగా ఉంది. దారంతా కొత్త అందం సంతరించుకుని కన్పించింది.

లలిత ఆస్పత్రి మంచంమీద విశ్రాంతిగా పడుకుంది—రాగల రోజులు తలచుకొంటూ.

(అయిపోయింది)

ఎంతటి వానికైనాసరే, పక్షపాతబుద్ధి వుండకూడదు ఒకరియెడల ఎక్కువ ప్రేమనూ, ఇంకొకరియెడల తక్కువ ప్రేమనూ చూపక సమపక్షపాతంగా ఉండాలి పక్షపాతం వున్నప్పుడు దేవతలకయినా సరే—దాని ప్రతిఫలాన్ని అనుభవించక తప్పదు

చంద్రుడు పేరుపొందిన దేవతలలో ఒకడుకదా! అతడు అమృతకిరణుడుకదా! అట్టివాడు క్షీణిస్తూ వుండడం ఎలా సంభవించింది? అది — అతనికి వుండే పక్షపాతం మూలాన శాపంవల్ల కలిగిన క్షయరోగమే అట్టి క్షీణదశను కలిగిస్తూ వున్నది

బ్రహ్మదేవుడికి మువ్వురు పుత్రులు ఉమార్తెలు ఉన్నారు—వారు కృత్తికను మినహాయించి ఇరవై ఆరుగురు నక్షత్రరూపమయిన వారున్నూ, అంబ, దుర్ఘవతన్నీ, అభ్రయంతి, మేఘయంతి, వర్షయంతి, చుపుణీక అనే ఏడుగురు కృత్తికలున్నూ, వీరందరినీ ఆయన దేవతలలో ఉత్తముడైన చంద్రునికి ఇచ్చి వివాహం చేసాడు

అందరిలోనూ రోహిణి చాలా అందకత్తె అందువల్ల చంద్రుడికి ఆమెమీదనే ప్రేమ ఎక్కువ అతడు తక్కిన భార్యలను అలక్ష్యంగా చూశేవాడు అది వాళ్ళకు చాలా కష్టంగా తోచింది సవతి అయితే సరి, సోదరి అయినా అసూయకు పాత్రురాలు అవుతుంది అలాంటప్పుడు ఒకర్ని ఎక్కువగానూ, తక్కినవారిని హీనంగానూ చూచేటప్పుడు, వాళ్ళమనస్సు బాధపడిందంటే ఆశ్చర్యంలేదు వాళ్ళు ఎంతకాలం సహించగలరు? చూచి చూచి, వాళ్ళందరూ తండ్రివద్దకు పోయి చంద్రుడి 'న్యాయాన్ని తెలియజేశారు బ్రహ్మమాత్రం ఏమి చేయగలడు? ఎంత గొప్పవాడయినా మామగారు అల్లుడికి లోకువేకదా! 'అతని ప్రవర్తన పక్షపాత సహితమైతే మీరు అక్కడికి వెళ్ళవద్దు ఇక్కడే వుండండి కొన్నాళ్ళకు అతడే దారికి వస్తాడు' అని తండ్రి వారిని తనదగ్గరే ఉంచివేశాడు.



కొన్నాళ్ళయిన తర్వాత బ్రహ్మ తలచివచ్చే చంద్రుడు ఆయనవద్దకువచ్చి తన భార్యలను తనతో పంపవలసిందని అడిగాడు అందుకు బ్రహ్మ 'ఓయీ! నీవు పక్షపాతబుద్ధితో ప్రవర్తించడంవల్ల దాన్ని సహించక నా కుమార్తెలు ఇక్కడికివచ్చారు ఇకమీదనయినా నీవు నిష్పక్షపాతంగా ప్రవర్తిస్తానని గట్టిగా వాగ్దానమిస్తే వాళ్ళను పంపుతాను లేకపోతే వాళ్ళు ఇక్కడేవుండిపోతారు' అని అన్నాడు. 'ఇకమీద అందర్నీ నిష్పక్షపాతంగానే చూస్తాను ఇదివరకు జరిగిన దానిని మరిచిపోండి' అని చెప్పి, తన భార్యలనందరినీ తనతో తీసికొని వెళ్ళిపోయాడు

పక్షపాత రహితంగా ప్రవర్తిస్తానని వాగ్దానం చేశాడేగాని చంద్రుడు తనమాటను చెల్లించుకోలేదు. అతని పద్ధతిలో మార్పేమీ కానరాలేదు రోహిణినే అభిమానంగా చూస్తూ, తక్కినవారిని నిర్లక్ష్యంగానే చూడసాగాడు దానికి ఫలితంగా ఆయనకు రాజయక్ష్మ — అంటే క్షయరోగం పట్టుకుంది ఆరోగం ప్రకోపించినప్పుడు, దినక్రమంగా క్షీణిస్తూ, అది తగ్గినప్పుడు క్రమక్రమంగా కోలుకుంటూ వుంటాడు ఆ క్షయరోగం యొక్క వృద్ధి క్షయాలవల్లనే చంద్రుడికి శుక్లపక్షంలో వృద్ధి, కృష్ణపక్షంలో క్షయమూ ఏర్పడుతూ వుంటాయి

చంద్రుడివంటి వానికి పక్షపాతం ఇట్టి అపరాధాన్ని శాశ్వతంగా తెచ్చిపెట్టింది

అనర్థదాయకమైన పక్షపాత బుద్ధి ఎవ్వరికీ, ఎప్పటికీ వుండకూడదు ●



వొద్దు మొర్రో అనుకునే వాళ్ళకు గంపెడు పిల్లలు. కావాలని తపించిపోయేవారికి పిల్లలుండరు.

అడుక్కునేవాడికి వానముసురు.

అనూరాధకు పెళ్ళయి పదిసంవత్సరాలయినా యింతవరకూ సంతానంలేదు. తన వయసువాళ్ళు, ముగ్గురేసి, నలుగురేసి పిల్లల్ని కని కూర్చున్నారు. అదే అనూరాధ బాధ.

పెళ్ళయిన నాలుగైదు సంవత్సరాలు పిల్లలు కలక్కపోవడం బాగానేవుండేది అనూరాధకు. ఆ యదృష్టానికి అనూరాధ తోటివాళ్ళు అసూయపడటంకూడా కద్దు. కాని పరిస్థితి తారుమారయింది. ఇతరుల పిల్లల్ని చూసి అసూయపడటం అనూరాధవంతయింది. అసలు పిల్లలు కలక్కపోవడం అనూరాధకే చిన్నతనం అనిపిస్తోంది. నలుగురిలో ఏదో అపరాధిలా ఫీలవుతోంది. తన స్త్రీత్వానికే కళంకం అని బాధపడుతుంది.

ఏసమయంలో జరగవలసిన క్రియ ఆసమయంలో జరిగితేనే అందం, ఆనందమూనూ ప్రకృతి నియమంకూడా అదే ఆడపిల్ల— ఎంత చదువుకున్నదయినా సరే పెళ్ళిచేసుకోవడం అందం. పెళ్ళయిన మూడు నాలుగేళ్ళ మొగుడితో పైలా పచ్చీసుగా తిరగడమూ ఆనందమే. తరువాత?

ఆడది పిల్లల్ని కనితీరాలి.

పెళ్ళికాకుండా పిల్లల్నికన్నా, పెళ్ళయ్యాక పిల్లల్ని కనకపోయినా, అమ్మమ్మల వయసులో పిల్లల్నికన్నా అసహజంగా వుంటుంది.

లోకులు కాకులు.

కాకులు అరవడం సహజం.

లోకులు నవ్వడం సహజం.

నిరుత్సాహపు సముద్రంలో మునిగిపోతున్న అనూరాధకు ఒక అరటిపిలక లైఫ్ బోటయి కూర్చుంది. అంతేకాదు. మండుటెండలో దప్పిక గొన్న బాటసారికి ఏ మురికినీటితోనైనా గొంతు తడుపుకోవాలనుకునే సమయంలో చల్లటినీటితో తాబేటికాయ దొరికినట్లయింది.

ఇంత చిన్న సంఘటన అనూరాధ జీవిత గమనాన్నే మార్చివేసింది.

ఎన్నడూ పెరటితోటలపై ఆసక్తి చూపనిభర్త ఒకరోజున హఠాత్తుగా అరటి మొక్కతో ప్రత్యక్షం కావడంతో అనూరాధ ఆశ్చర్యాంబుధిలో మునిగిపోయింది. యింకా తేరుకోకమునుపే భర్త మాధవరావు 'చాలమంచి జాతి అనూ! భుసావల్ నుండి తెప్పించారు ఫారెస్టువాళ్ళు. పది నెలల్లో గెల దిగవలసిందే. ఈ రకంపళ్ళ వల్ల మనదేశానికి ఎంతో విదేశమారక ద్రవ్యం వస్తోందట...' ఇంత పుత్సాహంతో చెప్పుకుపోతున్న భర్తను నిరుత్సాహపరచడం యిష్టంలేక అనూరాధ మొక్కను చేతిలోకి తీసుకుంది. పసిపిల్లను నిమిరినట్లు నిమిరి ఆప్యాయంగా 'అబ్బ! బాగుంది సుమండీ! లక్షణం చూస్తే పదినెల్లెందుకు పదిరోజుల్లోనే పళ్ళు తినిపించేట్టుంది' అంది అనూరాధ.

వ్యవసాయశాఖ వారి సలహా ప్రకారం రెండడుగుల చవుకం రెండడుగుల లోతూ గొయ్యి తవ్వారు దంపతులిద్దరూ కలిసి.

'మంచి పాటిమన్ను కావాలి. ఎక్కడ దొరుకుతుంది చెప్మా?' మాధవరావు.

'మీది ఛాదస్తం మరీనూ' అంది అనూరాధ నవ్వుతూ.

'అహ! అలాగనకు. భూమి మంచిదయితేనే కాయలు కాస్తవి. చవిటినేలలో పంటలు పండవు' అంటూ మంచి మన్ను కోసం అన్వేషణ సాగించాడు.

అనూరాధ గతుక్కుమంది. భర్త యదాలాపంగా అన్నా అనూరాధ గాయపడింది. తనని వుద్దేశించి అన్నమాటలు కావని తెలిసికూడా, మనసు సంబాళించుకోలేకపోయింది,

'నేల మంచిదయుండి కూడా విత్తనం మంచిది కాకపోతే?' ప్రశ్నించుకుంది. తనే సమాధానం చెప్పుకుంది. 'అపుడూ పంట పండదు.'

దంపతుల మధ్య ఈ మూగ సంఘర్షణ కొద్ది సంవత్సరాలుగా జరుగుతోంది.

ఆ రాత్రే అనూరాధకు తియ్యటి కలొచ్చింది. మరపురాని కల. తన జీవితం చిగురింప జేసిన కల.

కలలో అరటిచెట్టు మాంచి బలమైన గెలవేసింది. పళ్ళు పచ్చగా నవనవ లాడుతూ వున్నయ్. పండిన పళ్ళను తాను స్వయంగా కోసితింది. పళ్ళు తియ్యగా అమృతం తలపినట్లున్నని.

'[illegible]! కంఠం [illegible] డన్నమాట.'

'ఇహ దిగులుపడొద్దు అనూ. నీ కడుపు తప్పక పండుతుంది.'

'సంవత్సరం తిరక్కుండా చూడు నీ మనవుతుందో ?'

అమ్మలక్కల వ్యాఖ్యానాలు మధుర సంగీతంలా వినిపించినవి అనూరాధ చెవులకు. యింకా వినాలి. తాను నలుగురికీ ఈ సంగతి చెప్పాలి. వాళ్ళ అభిప్రాయాలు వినాలి. అప్పటికిగాని తనకు తృప్తి కలుగదు. కాని అనూరాధ ఈ మధ్య బయటికి వెళ్ళడం మానుకుంది. ఎవరిళ్ళకూ వెళ్ళడంలేదు. ఆఖరికి రామాలయానికి పురాణ కాలక్షేపానికికూడా వెళ్ళడం మానుకుంది. ఇదంతా అనూరాధ తనకు తాను విధించుకున్న శిక్ష. రామాలయంవద్ద జరిగిన సంఘటన గుర్తొచ్చింది :

శాస్త్రులుగారు పురాణం హుషారుగా చెప్పుకు పోతున్నారు. శృంగారం చెప్పాలంటే శాస్త్రులుగారికి పోటీలేదు. ఆయన కాయనే సాటి. హనుమంతుని పుట్టుక ఘట్టం రసవత్తరంగా సాగుతోంది. స్త్రీలంతా శ్రద్ధగా వింటున్నారు.

'అంజనాదేవి వానరి అయినప్పటికీ సర్వాంగసుందరి. చిత్తమువచ్చిన రూపము ధరిస్తుండేది. ఒకనాడామె మానవాంగన రూపం ధరించి, రూపయౌవనశాలినిగా తిరుగుతూ, నానావిధాభరణాలు పెట్టుకుని, రంగు రంగుల పూలదండలు వేసుకుని, మహార్ఘమయిన పట్టుచీరధరించి ఒక పర్వతముమీద విహరించ సాగింది. ఆ దారినే వెడుతున్న వాయుదేవుడామె సౌందర్యానికి ముగ్ధుడై, మన్మథావేశ పరవశుడై, విచక్షణాజ్ఞానాన్ని కోల్పోయి బలవంతంగా ఆమెను తన పెనుగాలివంటి చేతులతో కౌగలించుకున్నాడు అంజనాదేవి కలవరపడిపోయి 'ఎవడా ధూర్తుడు?' అని గర్జించింది అంతట వాయుదేవు 'ఓ మగువా! భయపడకుము. నేను వాయుదేవుడను. నీ సర్వాంగశోభ చూసి మోహితుడనైనాను. నీకు నావల్ల మహాబుద్ధిమంతుడూ, అమిత పరాక్రమవంతుడూ అయిన పుత్రుడు పుడతాడు! అంజనాదేవి సంతుష్టురాలయింది.' అని హనుమంతుని పుట్టుక ముగిస్తూ శాస్త్రులుగారు [illegible]

# గాలివాన

విధంగా వ్యాఖ్యానించారు:

'సంతానం కోసం వ్యభిచరించడం తప్పు కాదు. పురాణాల్లో అనేక దాఖలాలు చూపెట్ట గలను.'

శాస్త్రులు ఏ దురుద్దేశంతో ఈ వ్యాఖ్యానం చేస్తున్నాడో అనూరాధకు తెలుసు. తత్వచింతన కోసం వెళ్ళిన తను యిలాంటి వికారపు మాటలు వినవలసి వస్తుందని అనూరాధకు తెలీదు ఇందరి ఆడవాళ్ళలో యింత బాహాటంగా శృంగారం చిత్రించడం రోత పుట్టింది.

ఆనాడు వొట్టు పెట్టుకుంది పురాణం ఛాయలకు వెళ్ళనని.

అనూరాధ పురాణం వైపుకు వెళ్ళడం కట్టడి చేసుకో గలిగింది గాని హనుమంతుని పుట్టుక ఘట్టం ఆమెలో అలజడి లేవదీసింది. ఎంత మరచిపోదామన్నా ఆ సంఘటనసే గుర్తుకొస్తోంది. మనసులో ఏదో చెప్పలేని అశాంతి. ఆందోళన. చిరాకు. ఈ ఒక్క విషయం చాలదన్నట్టు మరో ప్రమాదకరమైన భావన. ఎదురింటి సుందరమ్మ మొగుడు పదేపదే తలపు కొస్తున్నాడు సుందరమ్మ మొగుడు తన భర్త కన్నా ఎన్నో రెట్లు యోగ్యుడుగా కనిపించడం మొదలెట్టాడు. ముగ్గురు పిల్లల్ని కన్నాడు (సుందరమ్మ కనలేదు.) ఎప్పుడూ హుషారుగా నవ్వుతూ వుంటాడు. పెళ్ళాన్ని ఎంత ప్రేమతో చూసుకుంటాడని? ముద్దు ముద్దుగా ఎన్ని పేర్లతో పిలుస్తాడు? భార్యని. తన భర్తకిలాంటి వేమీ తెలియవు. అనూరాధకు భర్తమీద ఈసడింపు కలిగింది.

హనుమంతుని పుట్టుక, సుందరమ్మ మొగుడు పదేపదే గుర్తుకు రావడం, తన భర్తమీద గౌరవం సన్నగిల్లి పోతూ వుండటం— ఈ లింకుకి అర్థం ఏమిటి? అనూరాధ ప్రశ్నించుకుంది.

'మానసిక వ్యభిచారం' అనూరాధ వొప్పుకుంది.

ఈ సుడిగుండం నుండి తప్పించుకునేందుకు అనూరాధ శాయశక్తులా ప్రయత్నించింది. అయినా ఈ పాడు ఆలోచనలు వెంటాడుతూనే వున్నాయ్. అనూరాధకు తన మీద తనకు నమ్మకం పోతోంది. ఆత్మవిశ్వాసం సన్నగిలింది. చివరికి భగవంతుడి మీద భారం వేసింది. 'భగవంతుడా! నన్ను రక్షించు. ఏ పాపపు పనీచెయ్యకుండావుండే శక్తిని ప్రసాదించు. పున్నామ నరకానికిపోతే పోతాను. కాని ఈ నరకం నేను భరించలేను. పిల్లలు కలక్కపోతేపోయారు. నేను అవినీతికి పాల్పడలేను. నన్ను కడతేర్చు స్వామీ' ఔచిత్యం నశించకముందే అనూరాధ తేరుకుంది.

ఈ హాలాహలంలో కొద్దిపాటి పాషాణం చిలికినా చివరికి అమృతమే లభించింది అనూరాధకు.

భర్త అరటిమొక్క తేవడం, ఆర్తి తన కొచ్చినకలా, అమ్మలక్కలప్రోత్సాహం, ఈ సంఘటనలన్నీ అనూరాధలోని పిరికితనంపోయి తనమీద తనకు నమ్మకం చేకూర్చినవి. విరుద్ధశక్తుల్ని పోరాడే ధైర్యంవచ్చింది.

మనిషికి ఒక విషయంమీద ధ్యేయం వుండాలి. దాన్ని సాధించడానికి దీక్ష వుండాలి. అప్పుడు కర్తవ్యం తప్పక నెరవేరుతుంది. అనూరాధ ధ్యేయం సంతానం. దీక్షకు లోపంలేదు. ఆశయం సిద్ధించగలదని అనూరాధ నమ్మకం. ఈ నమ్మకం ఎలాగొచ్చిందో, ఏ గ్యారంటీతో అంత ఖచ్చితంగా నమ్ముతోందో అనూరాధకే తెలీదు. అంత నమ్మకంలోనూ ఒక్కొసారి అపనమ్మకంకూడా ధైర్యంగా యిముడ్చుకోగలిగింది అనూరాధ.

ఆ అపనమ్మకమే నిజమయితే?

'నేను జీవించను' తీర్మానించుకుంది అనూరాధ.

* * *

అనూరాధ పూర్తిగా మారిపోయిందని యిరుగుపొరుగువారి నమ్మకం. ఇదివరలో వయసు మళ్ళిన ముత్తయిదువులావుండేది. ఇప్పుడు అందంగా అలంకరించుకోవడం ఆనందంగావుండటం జరుగుతోంది. వయసులో పదేళ్ళు చిన్నదయిపోయినట్లు కనబడుతోంది. అంత వుత్సాహంగానూ వుంటోంది. భర్తకి పరిణామం అర్థం కాకపోయినా ఆ మార్పు ఎందుకో భయంవేసింది. పదిసంవత్సరాల కాపురం, తరువాత అనూరాధ యిప్పుడు క్రొత్తగా కనిపిస్తోంది. అనూరాధ ధోరణిచూస్తే 'జీవితం బుద్బుదప్రాయం. ఈక్షణకాలంలో

హాయిగా కులాసాగా కాలక్షేపంచేస్తే చాలని అన్పిస్తుంటోంది.

ఇదివరకెన్నడూ నోరుతెరిచి భర్తను ఫలానాదికావాలని అడిగెరగదు. ఇప్పుడు ప్రతీదీ డిమాండ్‌చేస్తోంది. సినిమాలకనీ, షికార్లకనీ భర్తను వూపిరాడనివ్వడం లేదు. ఇదివర్లో భర్తంటే భయం.

ఇప్పుడు ఫ్రీగా స్నేహితునితో మాట్లాడినట్లు మాట్లాడేస్తోంది. అరటి చెట్టు పోషణ అనూరాధ దినచర్య.

సుందరమ్మ మొగుడు అసలు గుర్తుకు రావడంలేదు సరిగదా కనబడ్డా బజార్లో కనబడే వందలమంది మగాళ్ళలో ఒకడు. చివరికి లెఖ్ఖ. హనుమంతుని పుట్టుక సంగతి ఎప్పుడన్నా గుర్తుకొచ్చినా భర్తను ఆట పట్టించడానికే పనికొస్తోంది.

పురాణం శాస్త్రులు అనూరాధ యింటికి రావడం జరిగింది.

'రండి శాస్త్రులుగారూ...కూర్చోండి.'

'ఏవిటమ్మాయ్ పురాణానికి రావడమే మానేశావు ?'

'అబ్బే తీరికుండడం లేదండి శాస్త్రిగారూ' అనూరాధ నవ్వుతూ.

'నీకు తీరిక లేకపోవడమేమిటి ? పిల్లా పీచూ ఎలాగూ లేరాయె ?'

'అందుకే అసలు తీరడంలేదు.' ఈ తర్కం శాస్త్రులుకి అర్థం కాలేదు.

ఇంకా ఏదో చిలిపిప్రసంగం చేయా లనుకున్న శాస్త్రులుకి అనూరాధ గంభీర వదనం జంకు పుట్టించింది.

'సరేగాని శాస్త్రులుగారూ! అంజన కదేం రోగమండీ ?'

'ఏ అంజనా ?'

'అదేనండీ మీ అంజనే హనుమంతుని తల్లి. మొగుడుండగా ఏమిటి చెప్పండి ఆ పాడుపని ?'

'అమ్మమ్మ...అలా అనగూడదు. అది దైవకార్యం సుమా. హనుమంతుడిలాటి బలవంతుడు పుట్టాలి. మా మూలు మార్గంలో అది సంభవమా ? తప్పెన్న డానికి మన మెంతటివాళ్ళం ?' శాస్త్రులు నసుగుతూ సమాధానం చెప్పాడు. అప్పటి కిరిటే శాస్త్రులుకి అర్థంగానిది అనూరాధ వాగ్ధోరణి. విరగబడి మాట్లాడేస్తో దేమిటి చెప్మా?' అని.

'పోనిద్దురూ! వెధవపురాణాలు. అంతా బూతులు' అనూరాధ

'అది సరేగాని నవరాత్రి దగ్గరవు తోంది. ఎవ్వరూ పలకడంలేదు. ఈ సంవత్సరం వుత్సవాలెలా జరుగుతాయో అంతు చిక్కడంలేదు. నీలాటి పడుచువాళ్ళు తప్పుకు తిరుగుతోంటే యిహపన్లెలా జరుగుతాయి ?' పద్యం చదివినట్లు చదివి చక్కా పోయాడు శాస్త్రులు.

'దురాత్ముడు' అనుకుంది అనూరాధ కసిగా.

అరటిచెట్టు ఏపుగా పెరుగుతోంది. పసుపు పిల్లలు పెటపెట లాడుతూ తొలి సారిగ స్వతంత్రంగా హాయిగా, గర్వంగా విస్తరిస్తోంది. ద్వారపాలకుల్లా రెండు వైపులా రెండు పిలకలు తలెత్తినయ్. అనూరాధ పిచ్చిగా అనురాగం పెంచుకుంది ఆత్మీయులని చెప్పుకోడానికి బోలెడుమంది

వున్నారు. ఒక్కరూ తనకు కావలసిన మనశ్శాంతి, ధైర్యం యివ్వలేక పోయారు. ఇదివరకు నోరులేని అరటిచెట్టు ఆత్మీయురాలైంది. దాపరికతనం లేకుండా నిర్మలంగా అరటిచెట్టుతో మాట్లాడేస్తుంది.

'త్వరగా గెలెయ్యవే !'

సరే నన్నట్లు తలూపింది అరటి.

'తలూపడం బాగా తెలుసు. నీకేమాత్రం తొందరలేదు' నిష్ఠూరంగా గాలి రివ్వున వీచడంతో ఒక ఆకు అనూ ఎదురొమ్మును తాకి గిలిగింతలు పెట్టింది. మరో ఆకు అనూ చెంపను మెత్తగా ముద్దుపెట్టుకుంది. అనూరాధ సిగ్గుతో పైట సర్దుకుంది. ఒళ్లు పులకరించి నట్లయింది. తియ్యటి కోరికలు విజృంభించగా మందగమనంతో యింటిలోపలికి వెళ్లింది.

రాత్రి భర్తతో 'ఏమండీ ! అరటిచెట్టుకు దిష్టిబొమ్మ పెడదామా ?' అనూరాధ అంది.

'ఎందుకూ ? నీ పిచ్చిగానీ'

'ఎందుకేమిటి దిష్టి తగలకుండా. ఒక్కొక్కరి కళ్లు పాపిష్టివి.'

'పిచ్చిదానా ! ఎదిగినచెట్టు కాయకాయకుండా ? కడుపుతో వున్నమ్మ కనక మానుతుందా ?' ఈ సామ్యం అనూరాధకు నచ్చలేదు.

'అదేమిటండీ గొడ్డుమోతు చెట్లుం కొమ్ముగా ?' ఈ మాట అనూరాధ ఎలా అందో అనూరాధకే తెలీదు. అనేసింది.

# గాలివాన

అంతే. అరటిచెట్లలో గొడ్డుమోతువీ, మగవీ వుంటవేమో మాధవరావుకి తెలియదు.

'పోనిద్దూ ! ఏం కొంప మునిగిపోతుంది గనుక ?' నిద్ర కుపక్రమించాడు.

అనూరాధకు కునుకు పట్టలేదు. ఈ అభిప్రాయం తనకెలా కలిగింది ? కాబోయే నిజాన్ని తన నోటివెంట యిలా పల్కరించలేదుగదా ? అయితే తన ఆశలు ? తన కడుపు పండదా ? కలే నిజం కాకపోతే దాని వ్యాఖ్యానం .నిజమెలా గవుతుంది ?

'దేనికయినా ప్రాప్తం వుండాలి.' నిర్లిప్తంగా అనుకుంది అనూరాధ.

రోజులు భారంగా గడుస్తున్నవి. అరటిచెట్టు వంక జాలిగా చూడటం కన్నా చేసేదేముంది గనుక ? తన చేతుల్లో ఏముంది గనుక?

'ఇహనేం? త్వరలోనే గెలేస్తుందమ్మోయ్?' పక్కింటి పద్మావతి చల్లటి కబురు చెప్పింది.

'ఎలా తెలుసు?'

'అదే పొట్టాకు కనబడ్డంలా?

పద్మావతికి అరటిచెట్ల సంగతి బాగా తెలుసు. పొట్టాకు వేసిన కొద్దిరోజులకు పువ్వు తప్పక బైటపడుతుందని చెప్పింది.

అవిడ చెప్పింది నిజమయింది. పువ్వు పూసింది. మరికొద్ది రోజులకే గెల బైటపడింది. అనూరాధ అంతులేని ఎక్కువంత సంతోష పడింది. పొరుగు వాళ్లందరికీ చెప్పింది. వాళ్లెవరికీ ఈ విషయం అంత ప్రాముఖ్యమయిందిగా కనిపించ లేదు. 'అలాగా' అని వూరుకోలేదు కూడాను.

'అనూరాధకేమైనా పిచ్చా?' అనుకున్నారు. అయితేనేం రోజులు సరదాగా గడుస్తున్నవి. అనూరాధ అరటిచెట్టు మీద ప్రత్యేక శ్రద్ధ తీసుకొంటోంది. బాలెంతరాలుకు చేసినంత అట్టహాసం చేస్తోంది.

గెల పెద్దదయింది ఇంకా వారం పది రోజుల్లో పళ్లు తయారుకావొచ్చు. పళ్లు నవనవలాడుతున్నవి. గెల బరువుకి చెట్టు వొంగిపోయింది. పద్మావతి సలహా మీద గెలకు పోటీ పెట్టింది. ఇహ తన కోరిక తీరినట్లే. కల నిజం కాబోతోంది.

* * *

రేడియోలో వాతావరణం చెబుతున్నాడు.

'రాబోయే యిరవైనాలుగ్గంటలకూ వాతావరణ సూచన ... కోస్తా జిల్లాలకు కుంభవృష్టి ... విశాఖపట్టణానికి వంద కిలోమీటర్ల దూరాన కేంద్రీకరించి వున్న తుపాను కోస్తా జిల్లాలకు వ్యాపించే అవకాశం వుంది...ప్రచండమైన గాలులతో ...జెస్తావారికి హెచ్చరిక...

అనూరాధ వులిక్కి పడింది. కంగారుగా 'ఏం చేద్దామండీ?' భర్తనుద్దేశించి.

'పడుకుందాము'

'నాఖర్మ! మీ కర్థంకాదు నా బాధ'

'ఏమిటాకంగారు అనూ?'

'ఫలితానికొస్తున్న అరటిచెట్టు పడిపోతుందండీ. ఎలా?'

'ఆవళ్లు మనకు దక్కేయోగముంటే పడిపోదు.'

'అంతేనా?' బాధగా అనూరాధ.

అర్థరాత్రి. అనూరాధకు కునుకుపట్టలేదు. భర్త ముసుగుతన్ని నిద్రపోతున్నాడు.

వర్షం తీవ్రతహెచ్చింది. హోరుగాలి భయంకరంగావుంది. ప్రకృతి విజృంభించింది. ఆకాశాన్ని మెరుపులు చీలుస్తున్నాయి. ఉరుములు ఐద్దలుకొడుతున్నాయి. కొండలు మొండెత్తి నిలుచున్నాయి. చెట్లు తిరగబడిపోతున్నవి. ఇదంతా బయటసందడి.

అనూరాధ ప్రశాంతంగావుంది. కర్తవ్యం ఏమిటో ముందే తెలిసినదానిలా చూస్తూ కూర్చుంది. కిటికీతీసి టార్చిలైటువేసి చూసింది. పోటీ పెట్టిన కర్రపడిపోయింది.






31—1—69

చెట్టు బాగా వొంగిపోయింది!

వానజల్లు విసిరికొట్టడంతో పక్కంతా తడిసిపోయి ఉలిక్కిపడి లేచాడు మాధవరావు.

'అనూ! ఏమిటా ఛాదస్తం? ఆ కిటికీ మూసెయ్' తిరిగి నిద్ర కుపక్రమించాడు.

దభాలున కిటికీ దానంతటదే మూసు కుంది.

అనూరాధ మెల్లగాలేచింది. భర్త మ లేపినా లేవడు. తన బాధ అర్థంకాదు. అరటిచెట్టుపడిపోగూడదు. అది పడిపోతే తమావడిపోతుంది.

అనూరాధ పెరట్లోకి నడిచింది. గాలి విసరికొడుతోంది. మెల్లగా, తూలుతూ అరటిచెట్టువద్దకు చేరింది. పడిపోతున్న అరటిచెట్టుని వాటేసుకుంది. పెళ్ళున కొరడాలో కొట్టినట్లు వురిమింది. పట్టు తప్పి అనూరాధ అంతదూరంలో పడి పోయింది. నిలబడే శక్తిలేదు. భయంకరంగా బుసకొడుతున్న గాలి మనిషినే ఎగరవేసే ట్లుగావుంది. అనూరాధ మోకాళ్లతో ప్రాక్కుంటూ చెట్టువద్దకుచేరింది. వంగి వున్న చెట్టుని గట్టిగా పట్టుకుంది. ఈసారి పట్టు విడవటం అనేదిలేదు. ప్రకృతితో పెనుగులాడింది. అనూరాధకు రాక్షసిబలంవచ్చింది. గాలికి అరటిచెట్టు వూగిపోతోంది అటూఇటూ. అరటిచెట్టుతో కలిసి అనూరాధకూడా.

చివరికి ప్రకృతి పశుబలమే నెగ్గింది. అరటిచెట్టు పడిపోయింది. అనూరాధ మాత్రం పట్టువిడువలేదు. స్పృహతప్పి పోయినా పట్టు వదల్లేదు.

మాధవరావు వులిక్కిపడి లేచాడు. అనూ ప్రక్కన లేకపోవడంతో కంగారుపడ్డాడు. దిగ్గున పెరట్లోకి వచ్చాడు.

'చూడు నా శక్తి' అన్నట్లుగా ఒక్క మెరుపు మెరిసింది. పడిపోయిన అరటి చెట్టు క్రింద అనూరాధ తడిసి ముద్దయి పోయింది. బిగుసుకు పోయింది.

* * *

'మిస్టర్ మాధరావ్! మీ భార్యకే ప్రమాదమూలేదు. నెలతప్పిన మనిషి కావడం వల్ల కొంచెం కంగారు పెట్టింది.' డాక్టర్ నవ్వుతూ.

'ఆఁ!' మాధవరావు మూర్ఛపోయినంత పని చేశాడు. అనూ చిరునవ్వు చిందిం చింది. ●

# అక్షరంలో మనిషి

శ్రీమతి శిష్టా వెంకటరమణి

## కొత్త సీరియల్ ప్రారంభం

[illegible]

ప్రవాహాలు ముత్యపుతాళ్ళై బ్రద్దలు చేస్తున్నాయి. తెల్లని దుప్పటిపరిచి మెత్తయిన మంచంమీద దంపతుల్ని కూర్చోబెట్టి దంపతుల తాంబూలాలు అందుకుంటున్నారు ముత్తయిదువులు. అరగంట గడిచేక తలుపులు వేసుకుని వెళ్లిపోయేరు ఆడవాళ్లు. బయట గోలగా, చాలా రభస చేస్తున్నారు పెళ్లికూతురికి వరుస అయినవాళ్లు. తలుపుదగ్గరగా నిలుచుని తలవాల్చుకుని నేల చూపులు చూస్తోంది దుర్గ. మంచంమీదనుంచి దిగి ఠీవిగా కదిలి ముందుకు వచ్చి భార్య భుజంమీద ప్రేమగా చేయివేసి ముఖం ఎత్తి మొహంలోకి చూస్తూ 'రా దుర్గా,' అన్నాడు భవానీశంకరం. అతని పిలుపులో కోటిజన్మలకి సరిపోయే అనురాగం స్రవంతిలా పొంగుకు వస్తోంది.

దుర్గ భర్త పాదాలచెంత వాలిపోయింది. ఇవాటి స్నేహంకాదు, భవానీ శంకరం తోట పంచుకున్న బ్రతుకు. తెల్లని పుల్లనంచెతో ఆరడుగుల ఎత్తులో ఠీవిగా, బలంగా, ఎదురు సుందర్ని లావణ్యం కురిపిస్తూ అలాగే చిరునవ్వుతో భార్య మొహంలోకి అత్యంత ఆత్మీయ ప్రేమగా చూస్తూండి పోయేడు అతను. ఎంతోకాలంగా నిరీక్షిస్తున్న ఘడియలు దగ్గర అవుతున్నకొద్దీ దుర్గ [illegible] భయంతో వూగిసలాడింది క్షణం. అతను స్నేహపూర్వకంగా చేయివేసి గదిలోవున్న ప్రతివస్తువుని చూపించేడు: 'ఇది తాజ్ మహల్. నీకు ప్రత్యేకం చెప్పవలసిన అవసరం లేదనుకో. అయినా చెబుతున్నాను. ఇది మైసూర్ ఫ్లవర్‌వాజ్. ఇవి యెడ్ల కొమ్ముతో తయారు చేసినవి. ఈ గదిలో వున్న ప్రతివస్తువూ చాలా విలువైనది. ఎలా చూసుకుంటావో. నువ్వు రానంత కాలం వీటితో కాలక్షేపం చేసేవాడిని. నువ్వువచ్చేవు. ఇంకనాకు కావలసినంత తీరిక'

[illegible] ఇదివరకు నీకు తీరికలేదన్నట్టు



# అడకత్తెరలో...

అమాయకంగా అడిగింది.

'నువ్వు దొరికిన తరువాత యింక తీరిక యెక్కడిది చెప్పు దుర్గా, చూడు ఆ వయొలిన్ అంటే నాకు ప్రాణం. నిన్నొక విద్వాంసురాల్ని చేయాలని తపన. నేర్చుకుంటావా ?' అతను ఆసక్తిగా అడిగేడు.

దుర్గ ఫక్కుమని నవ్వింది: 'ఈవయసులోనా', అంటూ. అతను చిన్నబుచ్చుకోలేదు. భార్య భుజంమీద చేయివేసి అనునయంగా అన్నాడు.

'చదువుకుందుకి వయసుతో నిమిత్తం వుంటుందనుకోకు దుర్గా. నువ్వు నా భార్యవి. నాకు తీరిక వున్నప్పుడు నేనే వయొలిన్ నేర్పిస్తాను. నువ్వు నేర్చుకోవాలి.'

'యెవరైనా వింటే నవ్వి పోతారు!'

'హుఁ' సన్నగా నవ్వాడు: 'ఈ మాట యెవరూ వినక్కర్లేదు. నవ్వే అవసరం అంతకన్నా లేదు. నా తృప్తి కోసం నేర్చుకోమన్నాను. బలవంత పెట్టి నిన్ను మిథ్యావస్థలో వడేయడం, నాకు యిష్టం లేదు. యిలారా దుర్గా! యిటొచ్చి నా ప్రక్కన కూర్చో.

దుర్గ మాట్లాడలేదు. అతన్ని చూస్తుంటే అపురూపంగా వుంది. పాత జ్ఞాపకాలు పుటలు తిరుగుతున్నాయి మెదడులో. యెవరో అన్నారు అప్పుడే. అదృష్టం తన్నింది దుర్గా నిన్ను. భవానీ ప్రసాద్ గారబ్బాయి నీ కోసం మద్రాసు నుంచి పని పెట్టుకుని చూసేందుకు వచ్చాడు. యెంత ఐశ్వర్యవంతులని. నీ గురించి వినే యింత దూరం శ్రమపడి వచ్చారు దొరగారు'

'పాదాలకి పాంజేబులూ, పట్టాలూ, జడగంటలూ, నాగరం వీటి మధ్య సింగారించిన గంగిరెద్దులా వుండేదాని వప్పుడు. అయినా ఆ అందం పాశ్చాత్య నాగరికతా ప్రభావానికి యెక్కడి నుంచి వస్తుంది? అందుకే నాన్నగారు మరీ మరీ చెప్పేరు వెళ్లి చూసి రమ్మని,' భవానీ శంకరం భార్యని గుర్తుకు తెచ్చుకుంటున్నాడు.

పల్లెటూర్లో పెరిగి వీధి బడిలో నాలుగు ముక్కలు నేర్చుకున్న కనకదుర్గ భర్త మాటల్ని శ్రద్ధగా ఆలకిస్తోంది. నవని చూసి వెళ్లేక కరణీకం చేస్తున్న తన తండ్రి పేర ప్రతినెలా భవానీశంకరం పంపించే లైబ్రరీ పుస్తకాలని చూసి భయపడి పోయేది. అంత లావు పుస్తకాలు, అంత సన్నటి అక్షరాలు యెప్పుడు చదివి యెప్పుడు అతనికి ఆ విషయాలు ఉత్తరాలు రాయగలదని? ఆ బెరుకులోనే బందీ అయిపోయినట్లుగా తోచి మథనపడేది. అయినా భర్తస్థానంలో అమాయకంగా పీఠం వేసుకున్న ఆ భర్తని సింహావలోకనం చేసుకున్నప్పుడల్లా నట్టింట్లో లైటు వొత్తి పెద్దది చేసి కిరసనాయిలు అయిపోయే క్షణంలో, వుత్తరోత్తరా కొడిగట్టుకు పోకుండా ప్రాణం నిలిపే నిమిత్తంలో, మరికొంత మానెని దోహదం చేసి ఈతచాయిల చాపమీద బోరగా కూర్చుని అక్షరం పొల్లు పోనీయకుండా ఆకళింపు చేసుకునే నియమంలో కఠోరమైన దీక్షతో చదువు సాగించేది.

కరణం అవధానిగారు కూతురి అచంచల భక్తి విశ్వాసాలకి ముగ్ధులై పోయేవారు. భార్యని పిలిచి మరీ చూపించేవారు పన్నెండేళ్ల బాలాకుమారి దుర్గని చూసి వెళ్లిన నాలుగు మాసాలకే ముహూర్తం పెట్టించమని కబురంపేరు భవానీప్రసాదు.

శ్రావణ మాసంలో ఓ శుభ ముహూర్తాన బ్రాహ్మణోత్తములచేత నిర్ణయించబడిన లగ్నసుడియల్లో కనకదుర్గ గౌరీదేవి ముందు మోకరిల్లి నిశ్చలమైన హృదయంతో చేతులు జతచేసి ప్రార్థించింది. పద్దెనిమిదేళ్ల భవానీ శంకరం తన చెలిమికాడు కావాలని కోరుకుంది. ఆ వయసులో వలపు తలపులేదు, ఐశ్వర్యపు



అత్యాశకు బలైపోయే అవకాశమేలేదు. హారతి పెళ్ళిముందు కూర్చుని 'రాధ వేణుగోపాబాలా' అన్నచరణం పాడుతూ తలెత్తింది. లయగా కాలుమీటుతూ రెప్ప వేయకుండా ఆపిల్ల మొహంలోకి చూశాడు. ఆక్షణంలోనే దుర్గ చూపుల్ని విగిడ్చింది. దృష్టిసారించి 'రానేస్తం' అన్నట్లు పిలుస్తున్న అతని కళ్లల్లోకి జారిపోయింది. గౌరీపూజ అయిపోయింది. పూరిపెద్దల సమక్షంలో జమీందారులైన మేనమామలు గంపలో తీసుకువచ్చి పసుపు పీటలమీద కూర్చొబెట్టినప్పుడు రెండు దోసిళ్లలో గంధపుచెక్క, అరటిపళ్ళు, కొబ్బరి బొండాలని అతని చేతిలోకి అందిస్తూ తనని తను సమర్పించుకుంది స్నేహభావంలో. తెరతొలిగింది. గుండెలమీద మంగళసూత్రాలు జారాయి. 'శుభం' అంటూ ఆకాశం ఝల్లు కురిపించింది. కనకదుర్గా, భవానీ శంకరులు ఒకటైపోయేరు. అతను చదువుకి విశాఖ వెళ్లిపోయేడు. పదేళ్ళతరువాత తొలిసారి ఆరాత్రి అతను రెండుచేతులూ చాపి నిండు హృదయంతో రమ్మని పిలచాడు. యిద్దరి హృదయాల్లోనూ జ్ఞాపకాలు క్షణకాలం కాపురం చేశాయి. చీలిపోతూ భార్యాభర్తల్ని యేకం చేశాయి. అతను కళారాధకుడు...గాయకుడు, డాక్టరు. మద్రాసులో హైకోర్టులో తండ్రి జడ్జికాగా కొడుకు డాక్టరుగా రెండు మూడేళ్లల్లోనే కావలసినంత పేరు సంపాదించుకున్నాడు. అతనితల్లి లలితాంబ కోడల్ని కూతుర్నీ యేకం చేసుకుని రెండునెలలు గడిపాక యీరాత్రే కోడలి భారాన్ని కొడుకుపైన మోపింది.

తూరుపు తెల్లవారకముందే మెట్లు దిగి వంటగదిలోకి మెల్లగా అడుగులో అడుగువేసుకుంటూ ప్రవేశించి పీటమీద గోడకి చేరగిలబడి కూర్చుండిపోయింది దుర్గ. సిగ్గు, భయం ముప్పెనగా అలుముకుని ఆ పిల్ల మనసులో కొత్తదనాన్ని రేపుతున్నాయి.

'అదేం వదినా అప్పుడే వచ్చేశారు. అన్నయ్య పంపేశాడా మిమ్మల్ని. యింత పొద్దుటే లేచి మీరేం చేయగలరు. నేను వున్నాను కదా' ఆరునెలలు చిన్నదైన ఆడబిడ్డ సంధ్య వదినగారి భుజంమీద చేయి వేసి సంప్రదాయ మన్ననలతో నెమ్మదిగా

తనువుగా మందలించింది.

అప్రయత్నంగా దుర్గ నిట్టూర్పు వేడి బయటికి వచ్చేసి సంధ్య శరీరాన్ని ఆ పొగలో ముచ్చేసి వూపిరి సలపనివ్వలేదు కాలి పోయిన స్పర్శలో లీలగా జ్ఞాపకపు తరంగాలు కొట్టుకు రావడం, తదాత్మలో క్షణం మునిగి మరుక్షణం తెప్పరిల్లి తేరుకోవడం జరుగుతూనే వుంది సంధ్య బ్రతుకున చీకట్లు క్రమ్ముకుని పోయాయి పదహారో యేటనే.

అతను రవి. యింజనీరింగు పాసయి శుభకార్యం జరుపుకునే నిమిత్తం అత్త వారింట అడుగుపెట్టాడు. అల్లుడికి జరగ వలసిన లాంఛనాలన్నీ క్రమబద్ధంగా జరిగాయి. విధి వోర్వలేక పోయింది. భవానీ ప్రసాద్‌ని అంతులేని దుఃఖసాగరంలో ముంచేసి కళ్లెం తెంచుకుని రవి అస్తమించేశాడు ప్రొద్దు పడమరకి చేరుకోక ముందే. సంధ్య జీవితంలో నిశీధి నిలయమై పోయి పటిష్ఠంగా స్థావరం చేసుకుంది. లలితాంబ కన్న కడుపు రంపపు కోతని భరించలేక పోయింది, భర్త రెండు కాళ్ల మీద వాలిపోయి అన్నది: 'మీరు యిన్నేళ్ల జీవితంలో యెన్నో చూశారు. మనతరం, ముందుతరం, వెనకటితరం యిలా బేరీజు వేసుకుంటూ వెడుతూంటే మీకు ఆ బిడ్డని యింత అన్యాయంగా వదిలేయాలనే వుందా! నా మీద మీరు పెట్టిన ఆపేక్షకీ, మీతో సైదోడుగా యిన్నాళ్లు నేను చేసిన కాపురానికీ మిమ్మల్ని వేడుకుంటున్నాను. దాని జీవితం అలా కాలి మసిబారి పోయి నుసై పోవలసిందేనా... ఒక్కసారి నా మొహంలోకి చూసి చెప్పండి...రవి టైఫాయిడ్‌లో కలవరిస్తున్నా దాని పీడని చూపించలేదు మనం, అభం శుభం తెలీని పసిదాన్ని...

'లలితా', కొండలు బ్రద్దలయ్యే స్వరంలో కేకపెట్టారాయన; 'నువ్వే', అతని కనుబొమ్మలు ముడిపడి పోయేయి. భార్య మీద అసహ్యం వేసిందనే వూహాకి చిహ్నంగా. 'మా నాన్న జమిందారు మా తాత జమిందారు. యిప్పటికి జమీకి లోటు లేనివాడిని నేను. న్యాయాన్యాయాలు నాకు తెలుసును. కర్మఫలాన్ని మహామహులే అనుభవించేరు. సంధ్య బ్రతుక్కి అర్థం నేను విడమరిచి చెప్పలేను...

'అంటే?' తల్లి ప్రాణం కువకువ







లా డిగింది.

'సంధ్యకి యే లోటూ జరగదు. అది యీ యింటి ఆడపిల్ల. ఒక్కగా నొక్క బిడ్డ పెళ్ళి మొదలుకుని పదికాలాల పాటు చెప్పుకునే విధంగా జరిపించాను. భగవంతుడు ఓర్చుకోలేక పోయాడు దానికి శిక్ష వేశాడు. తలితండ్రులం అయినందుకు యీ కడుపుకోత బ్రతికినన్నాళ్ళూ అనుభవించాలి'

లలితాంబ భర్తని నఖశిఖ పర్యంతం చూసింది: బారిష్టరు పరీక్ష విదేశాల్లో చదివి యిండియాకి వచ్చి కట్టు, బొట్టులో మార్పులేకుండా ఖద్దరు పంచెలో, నల్లటి కోటులో నొసట గంధపు బొట్టు మీద సూర్యుని కిరణంలా మిలమిలలాడే కుంకుమ రేఖతో భ్రుకుటి ముడితో ఫాలముఖిలా కనిపించారు, తనను తాను శల్యపరీక్ష చేసుకున్నా యే అవకాశమూ కనిపించడం లేదు.

ఒకటి లలితాంబ పుట్టింటివాళ్ళు ఏడు తరాల్లో పేరెన్నికగన్న మహావ్యక్తులు. మహోన్నత కుటుంబంలోంచి మెట్టినింటికి అడుగుపెట్టింది లలితాంబ. ప్రాచీన సంప్రదాయాల్ని నరనరాల్లోనూ జీర్ణించుకున్నప్పటికీ భర్త పాశ్చాత్యదేశాల్లో పెరిగిన కారణంగా తమ యింట్లో ఏ పాశ్చాత్య దురాచారాన్ని రూపుమాపుచేసే చిహ్నాలు కనిపించకపోరాయా అనే ధ్యాసతో అయన్ని ప్రోత్సహించింది. భవానీప్రసాద్ ముక్కుకు సూటిగాపోయి కుండలు బద్దలు చేసే స్వభావంతో తన వ్యక్తిత్వానికి మైల పడకుండా తాతతండ్రుల కీర్తి ప్రతిష్ఠలకి భంగం వాటిల్లకుండా సనాతనాచారాల్ని పురిమెడుతో పుణ్యదరిణవట్టి కనుమూపు మేరలో విజయనిష్ఠల్ని ధ్వజస్తంభాల్లా నిలబెట్టారు. కొంగుపట్టిన గుప్పు ఆశతో గుండెల్ని గొంతులోకి చేర్చుకుని మరోసారి భయంభయంగా అడిగింది: 'దాని బ్రతుకిలా అర్ధాంతరంగా ఆగిపోనివ్వకండి. మీరు చదువుకున్నారు. పూర్వపు ఆచారాల్ని ఇంకా నమ్ముకుని కుమిలిపోయేకాలం దొర్లి పోయింది. దానికి మళ్ళీ పెళ్ళిచేయండి. రవి తాలూకు తల్లిదండ్రులుకూడా లేరు ఈ విషయంలో అభ్యంతరం పలకేందుకు.

జడ్జీగారు నవ్వారు పెద్దపెట్టున శబ్దించేస్తూ. ఆయన నవ్వులకి గోడలు పునాదులతో పెగిలి పేలకూలాయేమో అన్న భ్రమ కలిగింది: 'బాగుంది లలితా. చాలా బావుంది. నీ తీర్పు వినవేడుకగావుంది. అది నా బిడ్డే. కాదనే ధైర్యం దానికివుంటే నీమాటని ఆచరణలో పెట్టేయి. ఒక్క విషయం. రేపు అది మరో పెళ్ళి చేసుకుంటుంది. నుదుటి వ్రాతల్ని తప్పించుకునే ప్రయత్నం చేయడం అవివేకం. ఒకవేళ ఆ వ్యక్తికి కూడా యేదైనా ఆపద సంభవించి వుపద్రవం ముంచుకువచ్చి కాలగర్భాన కలిసిపోతే చేయగలిగిందిలేదు' నిజాన్ని సూటిగా అనడంలో ఆయన జంకలేదు.

'మీరేనా...యెంతమాట అంటున్నారు. ఇలా అనేందుకు మీకు ప్రాణం యెలా వొప్పింది?'

'ఉన్నమాట యెప్పుడూ చేదు విషంలా వుంటుంది. యే అమ్మ కన్నబిడ్డనో మరోసారి విధికి బలిపెట్టటం నాకు యిష్టం లేదు. ప్రగతి ముందుకుపోతున్నదనే ధ్యాసలో కుప్పిగంతులు వేసేవారే అందరూ. ఆ యిరుసుల మధ్య యెన్ని అనర్థాలు వచ్చిపడ్డాయో వొక్కరైనా వూహించగలుగుతున్నారా. నా మేనత్త యింటికి చేరుకుంది పన్నెండేళ్ళకే తలచెడి. అయినా ఆవిడకు అన్నదమ్ములు లోటు రానీయలేదు. చచ్చిపోయేవరకూ మహారాణీమాదిరి దొర్లించుకున్నది రోజుల్ని. ఈ యింట అటువంటి అప్రాచ్యపు పనులు చేయడానికి వీల్లేదు. మరోసారి ఈ ప్రస్తావన తీసుకురాకు లలితా. ఇంతకుమించి విడమరిచి నేను చెప్పేందుకులేదు!' పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ మేడమెట్లు యెక్కుతున్న భర్తని రెప్ప వేయకుండా చూస్తూ నిలబడిపోయింది.

మేడ మెట్లమీద నిలుచుని హాల్లో తల్లితండ్రుల వాగ్వాదాన్ని పరికిస్తున్న సంధ్య తండ్రి మొహంలోకి క్షణం చూసి 'మీరు ఆవేశపడకండి నాన్నగారూ. కుటుంబానికి తలవొంపులు కలిగించే పనులు నేనేమీ చేయను. నాకు యిష్టంలేదు అలా బ్రతకడం!' అన్నది నిబ్బరంగా.

జడ్జిగారి కళ్ళు చెమర్చాయి. హృదయంలో చెలరేగే భావాలకి, చిలవలు పలవలుగా అల్లికం ప్రారంభించేయి ముఖభంగిమలు. ఆయన ఆవేదన మింటికెగసి పడుతోంది. మెట్లు యెక్కినాకగానీ తెలిసిరాలేదు గుండెల్లో ఆయన్ని నలిపివేస్తున్న బాధ తాలూకు రభస. కళ కళ లాడుతూ యిలవేలుపు అమ్మవారిలా కళ్ళముందు కదిలే ఒక్కగా నొక్క ముద్దుబిడ్డ మూల పడిందన్న రోజునుంచి ఆయన ఆ బాధని దావానలంలా కడుపులో దాచుకుని వీలు చిక్కినప్పుడు బీచ్‌రోడ్ మీదుగా కారు దొర్లిస్తూ కొన్ని కొన్ని సాయంకాలాలు అక్కడే గడిపేవారు, చల్లని మలయ సమీరంలో సేద తీర్చుకుంటూ.

తండ్రి చాటుగా కళ్ళు తుడుచుకోవడం సంధ్య గమనిస్తూనే వుంది. గరళంలాంటి బాధని జీర్ణం చేసుకుని నవ్వుముఖాన్ని చిదిపెట్టేది యింటిల్లపాదికీ.

దీర్ఘంగా ఆలోచిస్తున్న ఆడబిడ్డవంకే చూస్తూ దుర్గ చాలా సేపటికి అన్నది: 'మీరు చేసేపని నేను చేయడంలో తప్పేమీ లేదు. నేను దగ్గరుండి చూస్తాను వంటపని. మీరువెళ్ళి మరేదైనా చేయండి.'

నవ్వింది సంధ్య: 'యిన్నేళ్ళూ యీ పనులకి అలవాటుపడి పోయాను వదినా. మీరు నా మీద ఆపేక్షగా అంటున్నారు. వీటిల్లో బిగిసిపోతే నాకు యేమీ అనిపించదు. లేకపోతేనే యెన్నో ఆలోచనలు కలగాపులగం అయిపోయి తేరుకోనివ్వవు నన్ను'

ప్రొద్దంట సూర్యుడు వుదయించక ముందు వంటయింట్లో ప్రవేశించిన సంధ్య నాయర్‌కి అందించే పనుల్లో మునిగిపోయి రాత్రి అందరూ నిద్రకి వుపక్రమించాక గదిలో తలుపులు బిగించుకుని యెదురుగా



తనని వంచకరించే భర్తని తదేకంగా చూస్తూ భోరుమని యేడుస్తుంది. ఆ నిలువెత్తు ఫోటో ఆ పిల్లని వెన్నంటు తూనే వుంటుంది.

లలితాంబ వంటయింట్లోకి వచ్చేసరికి ఆరుగంటలు దాటింది. బిడ్డనో కంటిగా, కోడల్నో కంటిగా చూసుకుంటున్న ఆవిడకి మనసు చివుక్కుమన్నది. ఇంటికోడలు అపురూపంగా వుండి పనిపాటలు చేసుకునేందుకు సాయంకాలాలు మాత్రమే యేర్పాటుగా వుండే తన రోజుల్ని గుర్తుకు తెచ్చుకుని బాధపడేది. ఈ వయసులో ఆవిడ అనారోగ్యమే లేని మనిషి అయివుంటే లక్ష్యాన్ని సాధించే ప్రయత్నాలు చేసేది. కానీ ... ఆవిడ లేచి తిరిగేందుకు గాజు బొమ్మలా సృష్టించబడిపోయింది పొత్తిగా.

రాత్రి కాబోతూంటే చెల్లెల్ని పిలిచి 'వదిన యేది సంధ్యా' అని ప్రశ్నవేశాడు. సంధ్య ముసిముసి నవ్వులు కురిపిస్తూ కొంగుని వేలికి చుడుతూ నేల చూపులు చూసింది.

'మీ వదిన యేదీ...యింత రాత్రి యెక్కడికి వెళ్ళింది'

'మన యిళ్ళల్లో వెళ్ళడం యెప్పుడైనా జరిగిన సంగతేనా అన్నయ్యా. అమ్మ చెప్పలేదా'

'లేదు'

'అయితే ఆవిడ యీ మూడు రోజులూ నీకు కనిపించదు. నీకు వొచ్చిన పార్సెల్సు అక్కడ టేబిల్ మీద వున్నాయి. పాలు ఫ్లాస్కులో పోసి వుంచాను. ఫలహారం చేసి త్రాగమన్నారు నాన్నగారు'

'వూఁ యింతా,' భవానీశంకరం బ్రతిమాకుతో చిలికల్లై పోయింది, నిన్నరాత్రి తను పలికిన అప్పగింతలన్నీ వమ్ము అయి పోయినందుకు బాధ పడ్డాడు. భ్రుకుటి ముడివేసి చెల్లెల్ని సాగనంపి దిగాలుగా కూర్చుండి పోయాడు. రాత్రి ప్రపంచాన్ని అలుముకుంది. డాబా మీద నిరాశా నిస్పృహల మధ్య వేడి నిట్టూర్పులతో కాలాన్ని భారంగా దొర్లించాడు యెంతో సేపు. క్రింద హాల్లో సర్దుమణిగాక వెనుక గుమ్మం తలుపు తెరిచి మేడమీద ప్రత్యేకించి వుంచిన పాత గదిలోకి దారితీశాడు. వన్నని దీపపు కాంతిలో దుర్గ గోడకి చేరగిలబడి కూర్చుంది. భర్త హఠాత్తుగా గుమ్మం దగ్గర నిలుచోగానే దిమ్మెర పోయింది. అతను గడప మీద కాలువేసి దైన్యంగా భార్య మొహంలోకి చూస్తూ స్వరాన్ని తగ్గించి అన్నాడు.

'నువ్వెందుకిలా చేశావు. యింట్లో యెవరు చూడవచ్చేరు. స్నానం చేసి రాలేక పోయావా? నిన్నటిరోజు గుర్తుకు రావడం లేదూ'

దుర్గ గుండెలు గుబగుబ లాడేయి. బిక్క మొహం వేసుకుని భర్తవైపు చూస్తూ అడిగింది: 'యేమిటి మీరు అంటున్నది. నేనా? యింట్లోకి వచ్చే యడమా. యిలా యెక్కడైనా జరుగు తుందా?'

'యేం యెందుకు జరగదని,' భవానీ శంకరం వుద్రేకంగా అన్నాడు: 'ఈ సంప్రదాయాలు వురిత్రాళ్ళలా చుట్టు కుంటున్నాయి. యింతమంది మనుషులకు లేని ఆచారాలు మనకే వచ్చి పడ్డాయా? ఫారిన్‌లో చూడు'

దుర్గ నవ్వింది: 'ఫారిన్ సంగతి మన కేమిటి? మామగారు యెంత నియమ నిష్ఠలతో వుంటారో మీకు ప్రత్యేకించి నేను చెప్పాలా? సంధ్య బ్రతుకు చెడి యింట చేరినపుడు యీ వాదన ప్రవేశ పెట్టలేక పోయారా? సంఘంలో అభ్యుదయ వాదులు మిమ్మల్ని పొగడ్తలతో ముంచెత్తి వుండేవారు కద'

'నీకు నవ్వు వస్తోంది దుర్గా. నా బాధ నీకు అర్థంకాదు.'

'సంధ్య బ్రతుకు బాగుచేయాలని నాకు లేదనే అనుకున్నావా. అది హఠంవేసి నాన్న గారికి వాగ్దానం చేసింది.'




'ఇంతరాత్రి మీరు దర్శనమిక్కు కూర్చుంటే నేను అయోమయంలో కొట్టుకుపోతున్నాను. అత్తయ్యగారో సంధ్య పొరబాటున తలుపు తెరిస్తే యేమను కుంటారు?'

వాక్యం పూర్తికాకముందే చరచరా వెళ్ళిపోయేడు భవానీశంకరం.

* * *

శిశిరం, హేమంతం దొర్లిపోయాయి. వసంతంలో పువ్వుల పరుపులా కనకదుర్గ జీవన ప్రాంగణంలో కోటి విభిరులు తటిల్లుమన్నాయి. పేరు ప్రతిష్ఠలు పుష్కలంగా ఆర్జించి ప్రాక్టీసు పెట్టిన భర్తని నిలువెల్లా చూస్తూంటే ముప్పిరిగొన్న ఆశ్చర్యం చుట్టుముట్టేది. 'మీరేనా?' అనే ఆశ్చర్యంలో రెప్పవేయకుండా పరికించేది. కాంపౌరణమేలరా ... అనే భర్త తాలూకు రాగసరళి కర్ణేంద్రియాల్ని శోకుతూంటే పులకించిపోయేది. యిప్పుడు ఆ భవానీశంకరం మారిపోయేడు. అతనిలో కళాతృష్ణ ప్రక్కగా దర్పం తీవి పెత్తనపట్టాలు వేసుకుని నడక సాగించేయి. ప్రొద్దుటే కాలకృత్యాలు తీర్చుకుని డిస్పెన్సరీకివెళ్ళిన భవానీశంకరం సాయంకాలం కానీ యింటికి చేరుకోడు. ఒక్కోసారి రాత్రిళ్ళు క్లబ్బుల్లో గడిపేయడం భవానీప్రసాద్‌ని దిగులు ఆవరించుకుంది. భార్య ముందు యెన్నోసార్లు అన్నాడు: 'పిల్లల్ని చూసి అయినా యింటికి వచ్చివుండేవాడు. మన నట్టింట పాప కేరుమనే అదృష్టానికి నోచుకోలేదు. యేం దురదృష్టం అనుకోవాలి?'

'అందుకు మనం యేం చేయగలం?' లలితాంబ భర్తని యెదురుప్రశ్న వేసేది.

సాయంకాలం నీరెండతగ్గకముందు సిధిలో కారాపించి దిగిన భవానీశంకరం ప్రక్కగా అధునాతన పద్ధతుల్లో అలంకరించుకున్న వో అందమైన యిరవైయేళ్ళ పడుచు దిగగానే విస్ఫారిత నేత్రాలతో భార్యాభర్తలు మొహమొహాలు చూసుకున్నారు. ఆయన పక్కనేవున్న భార్యవైపు చూపులు తప్పించుకునే ప్రయత్నంలో ప్రయాసపడ్డారు. 'మన భవానియే ... ఒక ఆడపిల్లని యిలా వెంటపెట్టుకుని తిరుగుతున్నది?' ఆయన గొంతులోనే గరగరలాడుతున్నాయి మాటలు.

# అడకత్తెరలో...

'నాన్నగారూ, అమ్మా...' దగ్గరగా వచ్చాక పరిచయం చేశాడు భవానీశంకరం.

'విశాఖ పట్టణం నుంచి యీ మధ్య బదిలీ అయి వచ్చారు యీవిడ. ఆంధ్రా నుంచి వచ్చేరు నాన్నగారూ. వూరుకొత్త. ఇబ్బందిపడి పోతూంటే యిల్లు దొరికే వరకూ సంధ్యకి తోడుగా వుంటారని చెప్పి వొప్పించి తీసుకువచ్చేను,' భవానీ శంకరం అంటూంటే 'అలాగా' అన్నారాయన చేసేదిలేక.

క్షణంకూడా నిలవకుండా మేడమెట్లు యెక్కి తనగదిలోకి దారితీశాడు. వెనకే ఆవిడకూడా కదిలివెళ్ళింది. నిలువునా ఖూనీ చేసినట్లుగా అవుతే పాతికేళ్ళు వకీలుగా, జడ్జీగా న్యాయా న్యాయాల విషయంలో వాది ప్రతివాదుల్ని ప్రశ్నలో ముంచెత్తి చిత్తుచేసి న్యాయంముందు అచంచల విశ్వాసంతో నిలబడి న్యాయంకోసమే బ్రతుకుని వెళ్ళ మార్చుకుంటున్న భవానీ ప్రసాద్ కుప్పకూలి పోయారు కొడుకు ప్రశ్నకి. తన నోటినుండి అశుభంగా వెలువడిన మాటలు గుర్తుకురాగానే భీతిగా తల్లడిల్లిపోయేరు. విదుటరాలు కాలుమీద కాలువేసుకుని ఖర్చు పెట్టగలిగిన ధనరాసులు పరుల హస్తగతం అయిపోతుందేమో అన్న ఆయన వేదనా, కుమిలింపూ అర్థంకాలేదు లలితాంబకి. యిద్దరు బిడ్డలూ, కోడలు తరంవరకే ఆలోచించిన ఆవిడకి భర్త అంతరంగపు లోతుల్ని కొలబద్ధవేసే శక్తిలేక పోయింది. మెట్లమీదుగా నిష్క్రమిస్తున్న కొడుకునీ అవతలి వ్యక్తినీ చూస్తూంటే వుండబట్టలేని స్థితిలో ఆవేశారు. 'వీడు కొంప తీయడుకదా!'

'అంటే?' లలితాంబ వూహలకో పిదృశ్యం యేర్పడలేదు.

'మరేం లేదు. వీనోట్లో యేవిషయం దాగదు; కానివ్వు జరిగేది జరగక మానదు. మన చేతిలో యేంలేదు.' ఆయన కాలు కాలిన పిల్లిమాదిరిగా గదినిండా కలియతిరగడం పైనుంచి కిటికీగుండా చూస్తున్న సంధ్య తండ్రి ప్రవృత్తి గమనించక పోలేదు.

'సంధ్యా! మీ వదిన యేదీ?' భవానీ శంకరం కేకవిని వదినా మరదళ్ళు బయటికి వచ్చేరు.

'ఈవిడ డాక్టరు. విశాఖపట్టణంనుంచి వచ్చేరు కొన్నాళ్ళు మనయింట్లో వుంటారు. పేరు మీరే చెప్పండి,' భవానీ శంకరం భార్యనీ చెల్లెల్నీ పరిచయం చేశాడు.

'నా పేరు గోవింద!' నవ్వుతూ తనని తను పరిచయం చేసుకుంది ఆవిడ.

సంధ్య ఆవిడ చేతిని చనువుగా అందుకుని గదిలోకి తీసుకు వెళ్ళింది. భవానీ శంకరం కళ్ళతోనే భార్యని గదిలోకి చేరబిలిచాడు.

దుర్గ మంచం మీద వాలిపోయి తలగడని తల ఆన్చుకుని తల పక్కగా కూర్చున్న భర్త మొహంలోకి రెప్ప వేయకుండా చూసింది. భవానీశంకరం భార్య వీపుమీద చేయివేసి ప్రేమగా నిమురుతూ అన్నాడు: 'నువ్వు నన్నపార్థం చేసుకోకు. గోవింద మనింటికి చుట్టపు చూపుగా రాలేదు. నీకు ఆపరేషన్ చేయిస్తానని తెలుస్తే నాన్నగారు తుపాకీ పేలుస్తారు. ఈ సంగతి సంధ్యకి కూడా చెబుతాను. నీకు పిల్లలు పుట్టే అవకాశమే లేదనుకోను నేను. మన యిల్లు పిల్లాపాపతో కళకళలాడే రోజు రాకపోదు. గోవిందని వెంటబెట్టుకు వచ్చేనని డాక్టరనే పేరు సార్థకం చేసుకున్నానను కోను'

దుర్గ కళ్ళల్లో నీళ్ళు రెండు బొట్లుగా రాలి తప్పున పడ్డాయి చెంపల మీద.

భవానీ శంకరం కళ్ళు మెరుస్తున్నాయి. కిటికీలోంచి అస్తమిస్తున్న సూర్యుడు కాంతి పడీ పడకుండా తప్పించుకునే ప్రయత్నం చేస్తున్నాడు. పెళ్ళయి కాపురానికి కాలుమోపిన దుర్గ జీవితంలో చూస్తూండగానే యేడేళ్ళు కరిగిపోయేయి. తల్లితండ్రులు యెదురు చూసే తరుణం సుదూరంలో లేదని గ్రహించక పోలేదు. డాక్టర్లు యింటికి రావడం తన భార్యని శల్యపరీక్ష చేయడం తండ్రి వొప్పుకోడని భవానీశంకరం గమనించక పోలేదు. తాతల వంశ గౌరవాన్ని ఆయన వర్ణించడం పుగ్గాలతో ఆకళింపు చేసుకున్నాడు. ఆ యింటి గృహిణి గడపదాటి పక్కయింటి మొహం చూడరాదు. మావగారు, బావగారు మొదలైన పెద్దల సమక్షంలో శ్వాస పీల్చేందుకు సైతం జంకుతూండాలి. తన తల్లి ఆ కట్టుబాట్లలోనే నిర్విఘ్నంగా అత్తమామల తలలో నాలుక మాదిరి కాపురం చేసింది.

కనకదుర్గ హృదయం విపరీతంగా స్పందించింది: 'మీరెంత పని చేశేరు? కనీసం యీ విషయం అత్తగారికి చెప్పవలసింది. నా మాట వింటారా మీరు?'

'యేవిటి?' ఆసక్తిగా అడిగాడు.

'నాకు తెలుసును నా పరిస్థితి. మా కుటుంబంలో మేనత్తలెవరికీ పిల్లలే పుట్టలేదు. పెద్దత్త అదృష్టవంతురాలు తొమ్మిదిమంది సంతానాన్ని కని తనువు చాలించింది పసుపుకుంకుమలతో. కనీసం ఆవిడ పోలిక రాలేదు నాకు. ఐశ్వర్యాన్ని కౌగలించుకునే యీ పోలిక భగవంతుడు యెలా కల్పించాడో కానీ...నాకు...నాకింక పిల్లలు పుట్టరు. మీరు నన్ను అన్యాయం చేస్తే...' దుర్గ కన్నుల్లో నీరు ధారాపాతంగా ప్రవహిస్తూ చెంపల నుంచి మంచంమీదుగా భవానీశంకరం పాదాల్ని అభిషేకం చేస్తున్నాయి. అతను బింగారుగా అన్నాడు: 'నీకు నేనా? అన్యాయం చేసేది. యేవిటి దుర్గా నువ్వనేది. యెలా చేస్తాను? నాకేం అర్థం కావడం లేదు'

దుర్గ యెంతో సేపు నిశ్శబ్దంగా వుండిపోయింది.

సంధ్యా, గోవింద గదిలోకి ప్రవేశించగానే భవానీశంకరం కదిలి వెళ్ళిపోయాడు బయటికి.

యెదురుగా కుర్చీలో కూర్చుని దుర్గ వైపు పరీక్షగా చూసింది గోవింద. గుండ్రటి బొట్టుతో, వొళ్ళునిండిన ఆభరణాలతో మిసమిసలాడే మేలిమి ఛాయతో, కోలమొహంతో అందానికీ, ఐశ్వర్యానికీ ప్రతినిధిగావున్న దుర్గను చూస్తూంటే గిరిగీసిన బాధ తాలూకు విస్ఫారవ్యాలు మొహంలో పక్కపక్కగా కనిపిస్తూనే వున్నాయి. 'మిమ్మల్ని కొన్ని ప్రశ్నలడగాలి. యేం అనుకోరుకద' గోవింద మెల్లిగా అడిగింది.

మంచంమీద సరుదుకుని కూర్చుని నవ్వి 'అడగండి', అన్నది దుర్గ.

సంధ్య మొహాన అప్పటికే నీలినీడలు క్రమ్ముకుపోయాయి. డాక్టరుచేసిన పరీక్షకి ప్రతిఫలంగా తను యే కబురు వినవలసి వస్తుందోనని భయం ఆవహించుకుంది.

తామె మెల్లిగా గది బయటికి వెళ్ళిపోయింది.

'మిమ్మల్ని ఆయన ప్రేమగా చూస్తారు కదు' మొదటి ప్రశ్న మాటగా వేసింది గోవింద.

'అయ్యో యింతమాట! ఆయనకి నేనంటే యెంత అభిమానం?'

'ఆయనకి మరే వ్యసనాలూ లేవని మీరు నిశ్చితంగా చెప్పగలరా,'

దుర్గ నవ్వింది: 'ఆయన దృష్టిలో మరో ఆడది పడడం అంత సులభంకాదు. ఆయన నాకోసమే పుట్టారు,' దుర్గ మొహంలో గర్వపురేఖలు ప్రస్ఫుటిస్తూ కనిపిస్తున్నాయి.

'మీకెంత నమ్మకం. ఆయన డాక్టరు. ఆ విషయంలో మన యిళ్ళల్లో ఆడ వాళ్ళకి యెన్నో అవనమ్మకాలున్నాయి. డాక్టరీ చదివిన యే మనిషికీ కూడా శీలం వుంటుందని వొప్పుకోరు. మరి మీరు...'

'ఆయన సంగతి నాకు బాగా తెలుసును.'

'ఒకవేళ...'

'డాక్టరుగారూ,' దుర్గ కంఠంలో ఆవేదన పులుముకొంది: 'నా నమ్మకాన్ని వమ్ముచేయకండి. ఆయనమీద నాకున్న విశ్వాసంతో యిన్నేళ్ళుగా కాపురంచేస్తూ ఈ విషయంలో తప్పటడుగువేసి నన్ను నేను నాశనం చేసుకోను. నేనే ఈ ప్రపంచంలో లేని రోజున ఆయన తప్పుదారి పడతారేమో? చెప్పలేను. కానీ ... కానీ ఆయన దైవస్వరూపులు.'

గోవింద సిగ్గుగా తలదించుకుంది: 'క్షమించండి మిమ్మల్ని బాధ పెట్టేను. మీకు పిల్లలుపుట్టే అవకాశాలు లేకపోలేదు. నేను ఆపరేషన్ చేసిన యెన్నో కేసులు గెలిచాయి. ఆ నమ్మకం నాకుంది. మీరుకూడా పిల్లా పాపాతో ...

'కథ కథ లాడతానంటారు డాక్టర్...' దుర్గ నెమ్మదిగా అడిగింది: 'మీరు నిజాన్ని కప్పిపుచ్చకండి. నాకు పిల్లలు పుట్టరు అనే నిజాన్ని నేను సంతోషంగా భరిస్తాను. మీరు నాతో అబద్ధం చెప్పరు కదూ'

'లేదు. ననెంతవరకూ అటువంటి అబద్ధాలతో పేషంట్లని మురిపించలేదు. 'ముందు నన్ను పరీక్ష చేయనివ్వండి,' గోవింద పరీక్ష పూర్తిచేసి నవ్వి అన్నది: 'మీకు పిల్లలుపుట్టే అవకాశా లున్నాయి' సంధ్య గదిలోకి ప్రవేశిస్తూ ఈ వార్తవిని విభ్రాంతి చెందింది (ఇంకా ఉంది)

---

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# వనితాలోకం వ్యాసరచన పోటీ

## మొదటి బహుమతి రు. 200
## రెండవ బహుమతి రు. 150
## మూడవ బహుమతి రు. 100

**ఇంకా రు. 50 చొప్పున అయిదు ప్రత్యేకమైన కన్సొలేషన్ బహుమతులు!**

# 'నేడు వనితాలోకం ఎదుర్కొంటున్న ముఖ్య సమస్య ఏమిటి?'

సాంఘికంగా, ఆర్థికంగా, సాంకేతికంగా మనదేశంలో ఎన్నో మార్పులు జరుగుతున్నాయి. వాటివల్ల పాత సమస్యలు కొన్ని పరిష్కారం అవుతున్నాయి, కొత్తవి తయారవుతున్నాయి! అయితే 'నేడు వనితాలోకం ఎదుర్కొంటున్న ముఖ్య సమస్య' ఏమిటో వనితలే చెప్పగలరు. అందుచేతనే సంక్రాంతి సందర్భంలో ఒక వనితాలోకం వ్యాసరచన పోటీ నెలకొల్పుతున్నాము. రచయిత్రులందరూ సహకరించి 'నేడు వనితాలోకం ఎదుర్కొంటున్న ముఖ్య సమస్య'ని చర్చించే వ్యాసాలు పోటీకి పంపి వనితాలోకం వ్యాసరచన పోటీని జయప్రదం చెయ్యగలరని ఆశిస్తున్నాము.

## నిబంధనలు

1. వ్యాసాలు స్వంతముగా ఉండాలి. అనుకరణలుకాని, అనువాదాలు కాని కాకూడదు. వ్యాసాలు తమ స్వంత రచనలేనని, అనుకరణలుకాని, అనువాదాలుకాని కావని రచయిత్రులు తమ రచనలతోబాటు హామీ రాసి పంపాలి.
2. వ్యాసం మూడు అరఠావు పేజీలనిమించి ఉండరాదు. (ఒక అరఠావు పేజీ ఒక ఎక్సర్సయిజు నోట్‌బుక్ పేజీకి రెండు రెట్లు.)
3. కాగితానికి ఒక వయిపుననే సిరాతో రాయాలి.
4. వ్రాత ప్రతులు ఎట్టి పరిస్థితులలోనూ తిప్పి పంపబడవు. (అందుచేత రచయిత్రులు తపాలా బిళ్లలు, స్వంత చిరునామాగల కవర్లు పంపరాదు.)
5. వ్రాత ప్రతిమీద రచయిత్రి పూర్తి పేరు, చిరునామా తెలుగు లిపిలో రాసి ఉండాలి. (చిన్న కాగితాలమీద విడిగా రాసి వ్రాత ప్రతితో జతపరచరాదు.)
6. కవరుమీద 'వనితాలోకం పోటీకి' అని స్పష్టంగా రాయాలి. వ్యాసాలు 'సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, 7, తంబుచెట్టివీధి, మద్రాసు—1' కి పంపాలి.
7. పోటీ ముగింపు తేదీ జనవరి 31, 1969. వ్రాతప్రతులు ఆ తేదీకి ముందుగా కాని, ఆ తేదీనగాని మా కార్యాలయం చేరాలి.
8. పోటీ తుది నిర్ణయం సంపాదకునిదే. ఈ విషయములో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
9. పోటీ ఫలితాలు ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఉగాది ప్రత్యేక సంచికలో ప్రచురింపబడుతాయి.
10. ఈ పోటీలో వనితలు మాత్రమే పాల్గొనవచ్చు.

సంపాదకుడు, ఆంధ్రసచిత్రవారపత్రిక

# వారఫలం

## 31-1-1969 శుక్రవారం మొదలు 6-2-1969 గురువారం వరకు

**మేషం:** మీరు యెంతగానో ఆశించిన వ్యవహారాల్లో ఫలితం సామాన్యంగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. సాహసముతో కూడిన వ్యవహారాలు వారం ఆఖరులో లాభిస్తాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—బంధువులకు సహాయం చేస్తారు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృషభం:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ప్రయాణాలు కొంచెం శ్రమ మీద ఫలిస్తాయి.

స్త్రీలకు—సంతోషకరమైన వార్తలను వింటారు. దైవకార్యాలు నెరవేరతాయి.

**మిథునం:** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. నూతన వ్యవహారాలు లాభించగలవు. మిత్రులకు సహాయం చేయగలరు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం:** వృత్తివ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**సింహం:** కొన్నివ్యవహారాల్లో మీరు ప్రయోజనం లేని శ్రమకు గురి కాగలరు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు—అధికవ్యయం జరుగుతుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కన్య:** వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో మీకృషి రాణించగలదు. వారం మధ్యలో ఆకస్మికంగా చికాకులు యేర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోవచ్చును.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. [illegible] సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**తుల:** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన వ్యవహారాలు లాభించ గలవు. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు:—బంధువులకు సహాయం చేస్తారు. విలాస వస్తువులు కొంటారు.

**వృశ్చికం:** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. స్థిరాస్థి వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు:—ఆరోగ్యం బాగా ఉంటుంది. దైవకార్యాలు నెరవేరుతాయి.

**ధనుస్సు:** కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. ఉద్యోగంలో కార్యభారం పెరుగు తుంది. వారం మధ్యలో వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణిస్తుంది. అనుకూల వార్తలను వింటారు.

స్త్రీలకు:—అధిక వ్యయం జరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మకరం:** ఫలితం మాట యెలాగ ఉన్నా, ప్రయత్నించిన ప్రతి పని సులువుగా నెరవేరుతుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. మధ్యలో అనుకోని చికాకులకు గురికాగలరు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వృత్తిలో ప్రయాస పెరుగుతుంది.

స్త్రీలకు:—కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**కుంభం:** వ్యాపారంలో సాటివారితో పోటీ పెరుగుతుంది. రావలసిన డబ్బు మీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. ప్రయాణాలు శ్రమ మీద ఫలిస్తాయి.

స్త్రీలకు:—ఆరోగ్యం బాగా ఉంటుంది. అలంకార వస్తువులు కొంటారు.

**మీనం:** మీకు ముందు లాభించ గల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించ గలరు. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. సాటివారితో వాదప్రతివాదాలు తగవు. సాంఘిక కార్యక్రమాలకు మార్పులు వస్తాయి.

స్త్రీలకు—ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

—మహేష్

బస్సు వేగంగా పోతోంది. నేను రెండుప్రక్కలా చూస్తున్నాను. చుట్టుప్రక్కల వున్న ఆకుపచ్చని జనపచేలమంచి వచ్చే చల్లనిగాలి ఆహ్లాదకరంగావుంది. ఆకుపచ్చగా వున్న చేలల్లో అక్కడక్కడా పత్తుగా వున్న పసుపు రంగు జనప పూలు ఆచేలకింకా ఎక్కువ అందాన్నిస్తున్నాయి.... యింతవరకూ నెమ్మదిగా వీస్తున్న గాలి కొంచెం తీవ్రంగా రావటం మొదలెట్టింది. మరింత చల్లగాకూడా వుంది. తలబయటకుపెట్టి ఆకాశంవంక చూశాను. వాయుగ్యైదు వల్లని మబ్బులు దగ్గరకు చేరుకుంటున్నాయి. యింతవరకూ యీ వాతావరణాన్ని చూస్తూ ఎంతో సంతోషిస్తున్ననాకు 'వానకురిసేటట్లుంది' అన్నఆలోచన రాగానే కొంచెం కంగారు పుట్టింది. కారణం నేనా ప్రాంతానికి పూర్తిగా క్రొత్తవాణ్ణి కావటమే. మామూలు సమయంలోనే పల్లెటూళ్లలో ఒకవూరి నుంచి యింకొక వూరికి దారులు కనుక్కుంటూ పోవటం కష్టం. అలాంటిది వాన కురుస్తున్నప్పుడు తెలిసిన వాళ్లెవ్వరూ లేని యీ ప్రాంతంలో ఒక్కణ్ణీ వుండటం కొంచెం కష్టం. అదీగాక మా శాస్త్రి వూరు నేను బస్సుదిగే వూరి నుంచి రెండు మైళ్ల దూరంలోవుంది. అక్కడికి వెళ్లేందుకు రోడ్డుకూడా లేదు, చేలగట్లవెంట వెళ్లాలిట. కాలవగట్టువెంట వెళ్లొచ్చుటగానీ అలావెడితేనాలుగు మైళ్ల దూరంట. అందుకే యీ బస్సు ఆగే వూరు తనేవస్తానన్నాడు శాస్త్రి. వర్షం పడేటట్లయితే శాస్త్రి వస్తాడో, రాడో అనే అనుమానం కూడా నాకుంది. శాస్త్రికి 'ఎడ్వంచెరస్'గా వుండటం అంటే గొప్ప సరదా. వాడి వుద్దేశ్యం ప్రకారం అలాంటి పన్ను చేసినతర్వాత వచ్చే సంతృప్తి చాల ఎక్కువట. నాకా సంతృప్తి నివ్వాలనే వుద్దేశ్యంతో వుద్దేశ్య పూర్వకంగానే రావటం మానుకున్నా ఆశ్చర్య పడనక్కర్లేదు.

మెల్లగా చినుకులు పడటం ప్రారంభించినయ్. దూరంగా మెరుపులు కూడా మెరుస్తున్నాయ్. బండరాళ్లు దొర్లిపడుతున్నట్లు ఉరుములు కూడా మొదలయినయ్. ఉరుము వురిమినప్పుడల్లా నా ముందు సీట్లో కూర్చున ఒక పడివయస్సు రైతు 'అర్జునా! ఫల్గుణా' అంటున్నాడు..... వాన కొంచెం పెద్దదవ్వంగానే వెనక సీట్లో కూర్చున్న కండక్టరు టవలు తీసి చెవుల మీదుగా కప్పుకుంటూ 'సుబ్బారావ్! కొంచెం స్పీడెట్టు........ యీవాన తొరెక్కువయ్యే తలికి కూసిపూడి సేరుకోవాలి" అని అరుచుకుంటూ డ్రైవరు వేపు వెళ్లేడు. అలా వెడుతూ 'మీరు దిగాల్సింది ముందొచ్చే వూరేనండి' అన్నాడునావంకచూసి. నేను ఎదటి సీటు క్రింద పెట్టిన సూట్ కేసు పైకి తీశాను. యీ కండక్టర్తో నేను బెజవాడలో బస్సు ఎక్కినప్పుడే నేను దిగాల్సిన వూరు వచ్చినప్పుడు నాతో చెప్పమని చెప్పాను. సూట్ కేసు నా ప్రక్కగా వున్నసీటుమీద పెట్టుకుని టైము చూసుకున్నాను అయిదున్నరయ్యింది. అయినా మబ్బులు దట్టంగా పట్టటంతో చీకటి పడినట్లుంది. యిలాంటి సమయంలో ఎవ్వరూ తెలియని యీ క్రొత్తవూళ్లో దిగటం నాకంతగా నచ్చలేదు. అందుకే కండక్టరు దగ్గరకెళ్లి—

'ఈ బస్సు రాత్రికి ఎక్కడ ఆగుతుంది?' అని అడిగాను.

'కూసిపూడండి' అన్నాడు.

'కూచిపూడిలో హోటళ్లూ, అవీ వుంటయ్యా?' అన్నాను. హోటళ్లు వుంటే అంతవరకూ టికెట్టు తీసికొని రాత్రికి అక్కడవుండి మర్రోజు ప్రొద్దున వెనక్కి తిరిగొచ్చి మా శాస్త్రి వూరు వెళ్లొచ్చుని నా వుద్దేశ్యం. యీ వర్షంలో శాస్త్రి రాకపోతే యిక్కడ వుండటం చాలా కష్టం. కండక్టరు నవ్వుతూ—

'అంటే లాడ్జింగులా ? I..... అయేం వుండవండి'అన్నాడు. యింతలోకే కారు ఒక వూరు మొదట్లో ఆగింది. చుట్టూ చీకటిగా వుంది.

'యిదేసార్! మీరు దిగాల్సిన చోటు' అన్నాడు కండక్టరు.

నేను సీట్లోంచి లేచినిలబడి ప్రక్కనున్న పాకలోంచి చుట్టూచూశాను. చీకటిగావుంది. 'గీజు, గీజు'మంటూ కీచురాళ్ల చప్పుడు వినిపిస్తోంది. ఏం చెయ్యాలో తోచక సూట్ కేసుని మాత్రం యాంత్రికంగా చేతిలోకి తీసుకున్నాను. మళ్లీ ప్రక్కనున్న చువ్వల్లోంచి చూశాను. అంతా చీకటిగా వుంది. కారులోవున్న దీపాలకాంతి బయట అయిదారడుగుల వరకూ ప్రసరిస్తోంది. ఆపైన వున్న వస్తువులన్నీ పిలిపీడల్లా కనిపిస్తున్నయ్..'.. యింతలో ప్రక్కనున్న చెట్టుక్రిందనుంచి మాబస్సు వైపుకి గొడుగువేసుకుని ఒకవ్యక్తి రావటం కనుపించింది. నా కెందుకో ఆ వచ్చేది శాస్త్రిఅనే అనిపించింది. బహుశః అది నాలోవున్న ఆశవల్లనే కావచ్చు. ఆ వచ్చింది శాస్త్రే.



# ఊరు వూరుకుంది

'మూర్తి! దిగరా' అన్న కేకవిని వుత్సాహంతో సూట్‌కేసు తీసుకుని బస్సులోంచి దిగాను. రొద చేసుకుంటూ బస్సు వెళ్ళిపోయింది.

'బతికించావ్ !..... నువ్వొస్తావో రావోనని కొంచెం కంగారుపడ్డాను' అంటూ మా శాస్త్రి నేను వడిచి వాడి గొడుగు క్రిందకు వెళ్ళాను.

'మధ్యాహ్నం మూడింటి కొచ్చాను...... పదే..... వర్షం కాస్త తగ్గేవరకూ ఆ గుడిమంటపం మీద కూర్చుందాం పద' అంటూ కొంచెం దూరంలోవున్న గుడివైపు దారి తీశాడు.

గుడి దగ్గరకు చేరుకున్నాం. అదొక పాడుపడిన గుడి. ధ్వజస్థంబం దగ్గర గడ్డి, పిచ్చి మొక్కలు మొలిచినయ్.... మబ్బులు పూర్తిగా విడిపోలేదు. అందుకని చీకటిగానే వుంది. అయినా గుడి స్వరూపం మాత్రం కన్పిస్తోంది. ముందుగా వున్న మండపం పైకి వెడ్తూ ప్రక్కకి చూశాను. గుడి తలుపులు విరిగిపోయినయ్. కీచురాళ్ళ శబ్దాలు చేస్తున్నాయ్. పక్షులేవో గూళ్ళల్లో రెక్కలు విదిలించుకుంటున్నయ్—గబ్బగూబలు కాబోలు......ఆ మండపం మీద నాలుగైదు బండరాళ్ళున్నాయ్. గొడుగు మడిచి ప్రక్కనపెట్టి అందులో ఒక బండరాయి మీద కూర్చున్నాడు శాస్త్రి. నేను కూడా సూట్ కేస్ క్రింద పెట్టి ఒకరాయిమీద కూర్చున్నాను. జేబులోంచి సిగరెట్టు తీసి వెలిగించాడు శాస్త్రి. నాకూ ఒకటిచ్చాడు. అగ్గిపెట్టె అందుకుంటూ అనుమానంగా అడిగాను:

'వరేయ్! యిది గుడికదా?...... పైగా కల్యాణ మండపంలో కూర్చుని సిగరెట్టు కాల్చొచ్చా?'

'నేనేదో నాస్తికుణ్నయ్యి యిలాంటి పన్లు గుళ్ళోనే చేస్తున్నాననుకోకు. యీ గుళ్ళో దేవుడు లేడు. యీ వూరివాళ్ళంతా చేరి ఆదేవుణ్ణి గుళ్ళోంచి తరిమివేశారు. సరిగ్గా యిరవయ్యేళ్ళకో, యిరవై అయిదేళ్ళకో పూర్వం యీ గుళ్ళోంచి దేవుడు వెళ్ళిపోయాడు.' అన్నాడు శాస్త్రి పొగవదల్తూ.

'అదేవిటి?! ఏదో కథ చెపుదామనుకున్నావా!' అన్నాను నవ్వుతూ.

'కథ కాదు రామూర్తీ! అప్పటికి నాకు చిన్నతనం అయినా యీ విషయం మా నాన్నగారికి బాగా తెల్సు. యీచుట్టు ప్రక్కల ఆయన వయస్సు వాళ్ళందరికీ తెల్సు' అన్నాడు శాస్త్రి.

'ఏవిటది?' అన్నాను కుతూహలంగా.

శాస్త్రి చెప్పటం మొదలు పెట్టాడు.

* * *

అదా వూరి పేరు రామవరం. యీచుట్టు ప్రక్కల వున్న వూళ్ళన్నిటిలోనూ యిదే చిన్న వూరు. మొత్తం పాతిక యిళ్ళు కూడా లేవు. యిరవయ్యేళ్ళ క్రితం ఎన్ని యిళ్ళున్నాయో యిప్పుడు కూడా అన్ని యిళ్ళేవున్నాయే. యీ యిరవయ్యేళ్ళల్లోనూ వూళ్ళో ఏం మార్పులేదు. గుళ్ళోంచి దేవుడు వెళ్ళిపోతూ యీ వూరికిచ్చిన శాపం అది అని యీ ప్రాంతంవాళ్ళ నమ్మకం

వూరు చిన్నదయినా వూరికి గుడి ముఖ్యం అనే వుద్దేశ్యంతో లక్ష్మీదేవి గారనే ఒకావిడ యీ రామాలయం కట్టించింది. ఆవిడ గొప్ప భక్తురాలు. బాల్యంలోనే భర్తను పోగొట్టుకున్న దురదృష్టవంతురాలు. భర్త చనిపోయిన దగ్గర్నుంచి దైవచింతనతోనే కాలంవెళ్ళబుచ్చేది. ఆవిడ సంపన్న కుటుంబంనుంచి వచ్చిన వ్యక్తిగాదు. యీ చుట్టు ప్రక్కల వూళ్ళన్నీ తిరిగి చందాలు ప్రోగుచేసి యీ రామాలయాన్ని కట్టించింది. చందాలతోనే యీ దేవాలయానికి రెండెకరాల పొలం ఏర్పాటు చేసింది. గుడికి దగ్గర్లోనే ఒక చిన్న 'మఠం' కట్టించింది. దేవుడికి నిత్యనైవేద్యాది విషయాలు చూసే పూజారి ఆ మఠంలో వుంటూ యీపొలంమీదవచ్చే ఆదాయంతో జీవించేందుకు వీలుగా యివన్నీ ఆవిడ ఏర్పాటు చేసింది. దేవాలయాన్ని యీ స్థితికి తీసుకు రావటానికి ఆవిడ ఎన్నో ఏళ్ళు పాటుపడింది. కానీ ఏనాడూ తను యీ గుడికి 'ధర్మకర్త'ననే అహంకారం ఆమెకుండేదికాదు.

'యీ దేవాలయం యీ వూళ్ళోని, యీ ప్రక్క వూళ్ళల్లోని ప్రజల దైవభక్తికి నిదర్శనం. యిదంతా వాళ్ళ సహాయం వల్లనే జరిగింది. నేను నిమిత్తమాత్రురాల్ని' అనే నిరాడంబరురాలు ఆవిడ. తనుకూడా ఆ మఠంలోనే ఒక చిన్నగదిలో వుంటూ దేవుడికి పూజలూ, నైవేద్యాలూ తనే స్వయంగా దగ్గరవుండి చేయిస్తూ వుండేది. గుడి కట్టించిన మరుసటి సంవత్సరమే కృష్ణమాచార్యులు 'యీ వూరి అర్చకుడుగా వచ్చాడు.

కృష్ణమాచారికి ముప్పయ్యేళ్ళలోపు వయస్సుంటుంది. మనిషి చాలా అమాయకుడు. కొంచెం నల్లగా వుంటాడు. నుదుటికి పైన రెండు మూడంగుళాలవరకు అర్ధవృత్తాకారంలో నున్నగా క్షవరం చేయబడి, గుండా? క్రాపింగా? అన్న సందేహాన్ని కలుగజేస్తూ వుండేది అతనితల. వెనుక నుంచి చూస్తే క్రాపింగు తలగాను, ముందు నుంచి చూస్తే గుండుగానూ కనిపిస్తూ వుండేది. కనుబొమలమధ్యనుంచి తలమీద వున్న నున్నటి ప్రదేశం చివరిదాకా మూడు పొడవైన నిలువు బొట్లు పెట్టుకునేవాడు. రెండు తెల్లబొట్లమధ్య ఎర్రటి బొట్టువుండేది. యీ నిలువు బొట్లతో కృష్ణమాచారి మొహంలో నిండుతనం వుట్టిపడ్తూవుండేది. అమాయకమైన అతని ముఖం, ఆ ముఖంలో ఎల్లప్పుడూ కన్పించే నిష్కల్మషమైన నవ్వు ఎవ్వరినైనా యిట్టే ఆకర్షించేవి. 'ఆచారి చాలా అమాయకుడు. చాల యోగ్యుడు'అనే వాళ్ళు వూళ్ళోని పెద్దలు. 'ఆచారి చాలా మంచి వాడు' అనేవాళ్ళందరూ. వూళ్ళోవాళ్ళందరికీ తలలో నాల్కలా వుండేవాడు. కృష్ణమాచారి భార్యపేరు గాయత్రి. గాయత్రికి యిరవయ్యేళ్ళ వయస్సుండేది. బంగారురంగు ఛాయ. ఎవరినైనా వకటికి రెండుసార్లు ఆమెవంక చూసేట్లు చేసే అందం ఆమెది. గాయత్రి సుగుణాల రాశి. సదాచారాలపట్ల అమితమైన గౌరవం ఆమెకు. దైవభక్తి చాల ఎక్కువ. మడి, ఆచారాల్తో వ్యవహరిస్తూ భర్తే సర్వస్వంగా భావిస్తూ వుండే సాధ్వి గాయత్రి.

కృష్ణమాచారి ప్రొద్దున ఏడుగంటలకే స్నానం చేసి గుళ్ళోకి వెళ్ళి పూజ మొదలు పెట్టేవాడు. యీవూళ్ళో యిద్దరు ముగ్గురు సంపన్నుల గృహాల్లో తప్ప మిగతా యిళ్ళల్లో బావులు లేవు. అందరూ యీ గుళ్ళోవున్న బావినుంచే మంచి నీళ్ళు తీసుకువెళ్ళేవారు. ఉదయం ఏడు గంటలకే యీ గుడికి వచ్చి స్నానం చేసి, దోవతి, ఉత్తరీయం ప్రక్కనున్న పచ్చగన్నేరు చెట్టుమీద ఆరవేసి 'ధావళి'కట్టుకుని పూజకుపక్రమించేవాడు కృష్ణమాచారి. తెల్లగన్నేరు పూలు, పచ్చగన్నేరు పూలు, శంఖు పూలు కోసి విగ్రహాన్ని వివిధ రీతుల్లో అలంకరిస్తూ వుండేవాడు. ఆ విధంగా అలంకరించి ఎంతో సంతృప్తితో విగ్రహం వంక చూస్తూ మంత్రాలు చదివేవాడు. పది గంటలదాకా పూజ చేసి పదింటికి 'అవసరనైవేద్యం' పెట్టి, గుడి తలుపులు దగ్గరగా వేసి, తనొచ్చి గుడిమంటపంమీద కూర్చుని విస్తళ్ళు కుట్టుకుంటూ ఏవో కీర్తనలు పాడుకుంటూ వుండేవాడు.

యింట్లో పనంతా ముగించుకొని ఓండె చంకన పెట్టుకుని పదింటికిగాయత్రి గుడికొచ్చేది. గుడి దగ్గరే స్నానం చేసి నీళ్ళు తీసుకుని తడిబట్టలతో 'మఠం' చేరుకునేది. పన్నెండు గంటలయ్యేసరికి వంట పని పూర్తి చేసి 'మఠం' బయటకొచ్చి, బయటవున్న చింతచెట్టుక్రింద నిలబడేది. 'మహానైవేద్యం' సిద్ధంగా వున్నదన్న దానికది గుర్తు. మండపం మీద కూర్చున్న కృష్ణమాచారి ఆమెను చూసి గుడికి తాళం వేసి మహానైవేద్యం తీసుకు వచ్చేందుకు మఠానికి వెళ్ళేవాడు. తళతళలాడే యిత్తడిపళ్ళెంలో పదార్థాలన్నీ వడ్డించిన విస్తరి వుంచి, దానిమీద యింకొక విస్తరి వేసి, పళ్ళెం చుట్టూ తడిగుడ్డ చుట్టి సిద్ధంగా వుంచేది గాయత్రి. కృష్ణమాచారి పళ్ళెం ఒక చేత్తో పుచ్చుకుని, రెండవ చేత్తో నీళ్ళగ్లాసు పుచ్చుకుని గుడికి బయల్దేరేవాడు. యింటికి తాళంవేసి, గుడితాళం చెవిపుచ్చుకుని గాయత్రి భర్తవెనకాల గుడికి వెళ్ళేది. కృష్ణమాచారి మహానైవేద్యం చేసేటప్పుడు గాయత్రి, అయిదారునిముషాలవరకూ గుడిగంట మ్రోగిస్తూ వుండేది. యీ గుడిగంట విన్న తర్వాతకాని వూళ్ళో వున్న పెద్దలు భోజనాలు చేసేవారుకాదు. మహానైవేద్యం అవుతోందని తెలియజేయటానికే ఆగంట కొట్టటం జరిగేది. ఆ గంట మ్రోత యీ వూరంతటికీ వినిపించేది. మహానైవేద్యం అయిన తర్వాత యిద్దరూ తిరిగి మఠానికి వెళ్ళిపోయేవారు.

సాయంత్రం ఆరు గంటలకు మళ్ళీ గుడి తలుపులు తెరచి దీపారాధనచేసి గుడిమండపం మీద పిల్లలందర్నీ చేర్చి భజన కీర్తనలు చెప్పిస్తూ వుండేవాడు కృష్ణమాచారి. పిల్లలందర్నీ రెండు వరసల్లో ఎదురెదురుగా కూర్చోబెట్టి తను మధ్యలో తిరుగుతూ కీర్తనలు చెప్పి, అవివాళ్ళచేత అనిపిస్తూ వుండేవాడు. యీలా ఒకగంటసేపు భజనలు చేయించి, వాళ్ళందరికీ కొబ్బరి ముక్కలు పంచిపెట్టి యిళ్ళకు పంపించేవాడు. యిదీ కృష్ణమాచారి నిత్యకృత్యం.

అది ధనుర్మాసం రోజులు. వూళ్ళోవున్న కుటుం

జాలన్నీ రోజుకొక కుటుంబంగా దేవుడికి 'భోగాలు' చేయిస్తున్నారు. ఒకరోజు పులిహోర, యింకొక రోజు చక్రపొంగలి...... యిలా వివిధ పదార్థాలు దేవుడికి ప్రొద్దున్నే చేయిస్తూ వుండేవారు. పిల్లలందరూ ప్రొద్దున్నే గొబ్బిళ్లు పెట్టుకుని గుళ్లో గంట వినబడంగానే ప్రసాదం కోసం గుడివైపుకు పరుగులెత్తేవాళ్ళు.

ఆరోజు ప్రసాదం పెట్టి కృష్ణమాచారి మండపం మీదకు చేరి కీర్తనలు పాడుకుంటున్నాడు. అటువేపునుంచి వెడుతున్న సుబ్బావధాని—

'ఏం ఆచారిగారూ! ఏవిటి ఖబుర్లు?' అంటూ తను కూడా మంటపంమీదకొచ్చాడు.

సుబ్బావధానికి ముప్ఫయ్యేళ్ల వయస్సుంది. వూళ్లోకంతకూ సంపన్నుడైన కృష్ణశాస్త్రి గారి కుమారుడు సుబ్బావధాని. కృష్ణశాస్త్రిగారు అన్ని వేదాలు చదివారు. వారి తండ్రిగారైన సుబ్బావధాని గారు గొప్ప పండితుడు. వారిపేరే కుమారుడికి పెట్టారు కృష్ణశాస్త్రిగారు. కానీ సుబ్బావధానిలో తాతగారి గుణాల్లో ఏవక్క గుణంలేదు. 'అగ్రహారీకపు' కుటుంబంలో పుట్టి బాధ్యతా రహితంగా పెరిగిన కుర్రవాళ్లలో వుండే లక్షణాలన్నీ వున్నాయ్ సుబ్బావధానికి. కాలానుగుణ్యంగా యింగ్లీషు చదువులు చెప్పిద్దామని కృష్ణశాస్త్రిగారు బందరులో ప్రత్యేకంగా ఒక యిల్లు తీసుకుని తన మేనత్త అయిన సోమిదేవమ్మగార్ని అక్కడుంచి సుబ్బావధానిని హైస్కూలులో చేర్పించారు. సుబ్బావధానికి చదువు మాత్రం అలవడలేదు. గానీ, పట్టణవాసంతో అనేక చెడు అలవాట్లు పట్టుబడ్డయ్. స్కూలు ఫైనలు రెండు మూడుసార్లు తప్పి సుబ్బావధాని తిరిగి రామవరం చేరుకున్నాడు. ఆ సంవత్సరమే అతనికి పెళ్లయ్యింది. అతనికిద్దరు పిల్లలు. తాత ఆర్జించిన ఆస్తితోపాటు, వాళ్ళు సంపాదించిన కుటుంబ గౌరవం కూడా ఖర్చుపెడుతూ తిరిగే వ్యక్తి సుబ్బావధాని.

సుబ్బావధానికి మంచి 'పర్సనాలిటీ' వుంది. దానికితోడు కృత్రిమ సౌందర్య సాధనాల్తో మెరిసిపోతూ వుంటాడు. అతనెప్పుడూ కట్టేవి మల్లెపూవుల్లాంటి బట్టలే. తన అందంతో ఏ ఆడదానినైనా యిట్టే వశం చేసుకోవచ్చనే వుద్దేశ్యం సుబ్బావధానిలో బలంగా వుంది. పట్టణంలో అలాంటి అనుభవాలు అతనికి చాలా వున్నయి. యీ పల్లెటూళ్లో కూడ అలాంటి అనుభవాలు దొరకవచ్చనే 'ధీమా' అతనికుంది. అలాకొన్ని అనుభూవాలతనికున్నయ్ కూడాను. గాయత్రి యీ వూరు కొచ్చిన క్రొత్తలోనే ఆమెమీద ఒకకన్నుంచాడు. ఆమె అందం అతనిలోని కోరిక బలాన్నించ్చింది. అతని అందం, హోదా అతనిలో ఆశల్ని రేపినయ్. కృష్ణమాచారి ఆకారం ఆ ఆశలకు బలిష్ఠమైన రెక్కల్ని కట్టింది. 'యిలాంటి చిన్నది యీ వెధవతో కాపురం చెయ్యటం ఏమిటి?' అనుకునే వాడు సుబ్బావధాని. అంతటితో ఆగలేదు. గాయత్రికూడా ఎప్పుడూ కాకపోయినా కొన్ని సమయాల్లోనైనా తప్పకుండా అట్లా అనుకోవచ్చని అతని వూహ. అతని సిద్ధాంతంకూడా అదే. ముఖ్యంగా తనని చూసినప్పుడట్లా అనుకుని తీరుతుందని అతని నమ్మకం. అలా అనుకునే ఆడదాన్ని వశపర్చుకోవటం క్షణాల్లో పని అని కూడా అతని నమ్మకం. అలాంటి అవకాశం కోసం నిరీక్షిస్తున్నాడు సుబ్బావధాని. ప్రతిరోజూ గాయత్రి స్నానం చేసే వేళ్టికి గుడి దగ్గరకు వచ్చి కృష్ణమాచారితో కబుర్లు చెప్తుతూ కూర్చునేవాడు. మండపం మీద కూర్చుని బావి దగ్గర స్నానం చేస్తున్న గాయత్రినే చూస్తూ ఉండేవాడు. ఒంటికి అతుక్కుపోయిన తడి చీరలోంచి కనిపించే గాయత్రి అవయవ సౌష్ఠవం సుబ్బావధానిని పిచ్చివాణ్ణి చేసేది. కానీ సుబ్బావధానిలోని యీ వికారం గాయిత్రికిగానీ, కృష్ణమాచారికిగానీ తెలియదు. యిద్దరూ అమాయకులే. మనుష్యుల మంచితనంలో నమ్మకంవున్న మంచి మనుష్యులువాళ్లు. అందువల్లే సుబ్బావధాని రోజూ ఆవేళ్టి కొచ్చి కూర్చోవటం వాళ్లల్లో అనుమానం కల్గించలేదు.

సుబ్బావధానిని మండపం మీదకు సాదరంగా అహ్వానించాడు కృష్ణమాచారి. 'రండి, అవధాని గారూ!' అంటూ. సుబ్బావధానికి 'అవధాని' అని పిలిపించుకోవటం సిగ్గు. అట్లా ఎవరైనా పిలిస్తే తనని అవమానించినట్టు భావించేవాడు. నాగరికత పేరుతో అంతగా పతనమైన వాడు సుబ్బావధాని అతని స్నేహితులందరూ అతని 'సుబ్బారావ్' అని పిలుస్తారు. అలా పిలవమని అతనే చెప్పాడు వాళ్లకి. కృష్ణమాచారికి కూడా 'సుబ్బారావు'అని పిలవమని చాలాసార్లు చెప్పాడు. కాని కృష్ణమాచారి అప్పుడప్పుడూ 'అవధానిగారూ!' అనే పిల్చేవాడు, అతనికి అలాపిలవటంతోనే ఎక్కువ గౌరవం యిస్తున్నట్లనిపించేది.

సుబ్బావధాని మండపంమీద కూర్చుంటూ 'ఏవిటి ఆచార్లూ! ..... నన్ను సుబ్బారావని పిలవమని చెప్పాలా?........ ఏం పేర్లివి?..... 'ఆచారి', 'అవధాని'...... అన్నాడు.

కృష్ణమాచారి నవ్వుతూ 'కూర్చోండి' అన్నాడు తను గోడ ప్రక్కకి జరుగుతూ. సుబ్బావధాని కూర్చుని బావివేపు చూశాడు. గాయత్రి ముఖానికి పసుపు రాసుకుని, పైటకిందనుంచి మంగళసూత్రం పైకి తీసి దానికి పసుపురాసి కళ్లకద్దుకుని బొక్కెనతో నీళ్లు తలమీద పోసుకుంది. గిలకమీదనుంచి త్రాడు లాగుతున్నప్పుడు ఆమెవంకే రెప్పవాల్చకుండా చూస్తున్నాడు సుబ్బావధాని......

'నీపేరు కూడా మార్చుకోరాదు?!' 'కృష్ణమాచారి' ఏవిటి? అందమైన పేరన్నా పెట్టుకో!! (నువ్వెలాగూ అందంగాలేవు!) ....'కృష్ణమూర్తి' అని పేరుపెట్టుకో' అని గాయత్రికి వినబడేటట్లు బిగ్గరగా అన్నాడు సుబ్బావధాని. అనినవ్వాడు. కృష్ణమాచారి కూడా నవ్వాడు. గాయత్రికూడా యీ మాటలువిని యిటువైపు తిరిగి నవ్వింది. ఆ నవ్వులో ఎన్నో సందేశాలు వినిపించినట్లు సుబ్బావధానికి. కామెర్లవాడికి లోకంఅంతా పచ్చగానే కన్పిస్తుంది. కళ్లకు 'కామం' పొరకప్పిన వాడికి లోకం అంతా 'కామం'తో నిండినట్లు కనిపిస్తుంది. సుబ్బావధాని పరిస్థితి కూడా అట్లాగే వుంది...... కాస్సేపాగి కృష్ణమాచారి అన్నాడు:

"మా ఆవిడ పేరు మార్చుకోమంటే మార్చుకోవాల్సిందే....... ఏం గాయత్రీ! నేను కూడా పేరు మార్చుకోనా ఏవిటి!?"

గాయత్రి స్నానం చెయ్యటం పూర్తి చేసి ఓందె నడుముపై పెట్టుకుని 'వద్దు లేద్దురూ' అని యింటికి బయల్దేరింది. వెడుతున్న గాయత్రి నుద్దేసించి సుబ్బావధాని—

'ఏవంకోయ్! రేప్పొద్దున దేవుడికి భోగం ఏవిటి?' అన్నాడు.

'పులిహోరండి' అంది గాయత్రి.

'అయితే రేప్పొద్దున్నే నే నిక్కడ వాల్తాను. నాకు పులిహోర చాలా యిష్టం....నాకు కొంచెం ఎక్కువగా ప్రసాదం పెట్టమని ఆచార్యులగారితో చెప్పండి' అన్నాడు సుబ్బావధాని తడి గుడ్డలో



తలుపుదీసి గాయత్రి వంక చూస్తూ. గాయత్రి నవ్వింది. మామూలుగానే నవ్వింది. గాయత్రి నవ్విన ఒక్కొక్క నవ్వుకీ కొన్ని వేల అర్థాలు కల్పించు కుంటూ సుబ్బావధాని మనస్సు ఉత్సాహంతో వూగిపోతోంది.

'మా ఆవిడ పులిహోర శేష్ఠంగా చేస్తుం దండి......రేపు రండి మీకే తెలుస్తుంది' అన్నాడు. కృష్ణమాచారి నవ్వుతూ, నవ్వుతూ కృష్ణమాచారి వంక చూసి వెళ్ళిపోయింది గాయత్రి.

'ఆ......చూశారా! నేను పేరు మార్చుకోవటం మా ఆవిడ కిష్టంలేదు' అని గలగలా నవ్వాడు కృష్ణమాచారి. నవ్వాలిగదా మరి అన్నట్లు నవ్వాడు సుబ్బావధాని. నీలాంటి వాడికి పేరు మార్చినంత మాత్రాన వచ్చే లాభం ఏమిటని నీ పెళ్ళాం ఉద్దే శ్యంరా, నైదవాయ్! అని నవ్వుకుంటూ మనస్సులో అనుకున్నాడు సుబ్బావధాని.

కాస్సేపు ఏవో కబుర్లు చెప్పుకున్న తర్వాత కృష్ణమాచారి—

'ఆ......మీ యింటికి దక్షిణంవేపు ప్రహరీ గోడ కట్టిస్తున్నారల్లేవుంది కదూ?' అన్నాడు.

'ఆ!.....' అన్నాడు సుబ్బావధాని.

'వన్నో పనిగా యీ గుడి సంగతి కొంచెంచేయించి పెట్టాలి......గర్భ గుళ్ళో సరిగ్గా విగ్రహం పైన కొంచెం పగిలింది. పైనుంచి రాళ్ళు ఏ క్షణంలో విరిగి పడ వస్తాయోనని భయంగావుంది. పైగా ఆ పగుళ్ళలోకి పాములు వచ్చి పడుకుం టోంది.

......ఎంత? రెండు మూడు గంటల పని...... లక్ష్మీదేవిగారికి ఒంట్లో బాగాలేదు. లేకపోతే ఆవిడే యీ పని చేసేవారు.

'అలాగే......చూద్దాం. తాపీమేస్త్రీ ఖాళీగా వున్నప్పుడు పంపిస్తాను' అని లేచి దూరంగా ఆడుకుంటున్న రామగోపాల్‌ని 'రాడ్డీ!' అంటూ చప్పట్లు కొట్టి పిలిచి 'యింటికి పోదాం' అంటూ వెళ్ళి పోయాడు సుబ్బావధాని.

సుబ్బావధానికి ఆ రాత్రంతా నిద్ర పట్టలేదు. గదిలో అన్ని వైపులా గాయత్రే కనిపించింది. ఒక నిశ్చయానికొచ్చి రాత్రి రెండు గంటలకు నిద్రపోయాడు.

కోళ్ళు కన్నించుకుంటున్నట్లు కూస్తున్నాయ్. చలి ఎక్కువగా వేస్తోంది. కోమటి సుబ్బయ్య లేచి చలిమంట వెయ్యటం మొదలెట్టాడు. గాళ్ళ కు అనసేడ తెచ్చేందుకు పిల్లలు చిన్న చిన్న డబ్బాలు పుచ్చుకుని బయల్దేరి కాస్సేపు సుబ్బయ్య చలిమంట దగ్గరకూర్చుని వెడుతున్నారు.... గాయత్రి నిద్రనుంచి లేచింది. ధనుర్మాసంలో. రెండుసార్లు నైవేద్యానికి వంట చెయ్యాలి. మొదటి వంట సూర్యోదయంనుండే చెయ్యాలి. అప్పుడు పులిహోరగానీ, చక్రపొంగలిగానీ, చిట్టిగారెలుగానీ లేదా ఆరోజు 'భోగం' చేయించే వాళ్ళు చెప్పిన యింకే పదార్థమో చేస్తుంది. తర్వాత మధ్యాహ్నం మహానైవేద్యానికి మామూలుగా వంట చేస్తుంది. అందుకే తెల్లవారజామునే లేస్తుంది.

యిళ్ళల్లో మరుగుదొడ్లు లేవు. అందుకని

# ఊరు వూరుకుంది

స్త్రీలకు ప్రత్యేకంగా వూరిచివరనున్న 'బీడు'ను మరుగుదొడ్డిగా కేటాయించారు.

'తలుపు దగ్గరకు వేసెడుతున్నాను..... చూస్తూ వుండండి' అని కృష్ణమాచారితో చెప్పి బయటకు నడిచిందిగాయత్రి.

సుబ్బయ్య సెట్టి చలిమంటవేస్తూ ఏదో పాడు కుంటున్నాడు. పిల్లలందరూ చలిమంట చుట్టూకు కూర్చున్నారు. తర్వాత వచ్చినవాళ్లకు కూర్చునేందు దుకు చోటుచాలక నిలబడి కూర్చున్న వాళ్లతలలు మీదుగా, పైకొచ్చే మంటలమీద, చేతులుంచు తున్నారు. యిదిచూసిన సుబ్బయ్యసెట్టి మంట కొంచెం ఎక్కువ చేస్తూ దగ్గరగా కూర్చున్నవాళ్లని దూరంగా జరిగేటట్లు చేసి అందరూ కూర్చునేం దుకు చోటు చూపిస్తున్నాడు..... అక్కడక్కడ కాకులు 'కావ్, కావ్' మంటున్నాయ్ ... గాయత్రి పరుగెత్తుతోందా అన్నట్లు వూరిబయట నుంచి వస్తోంది. అంత చలిలోకూడా ముఖమంతా చెమ టలు పట్టినయ్. ముఖమంతా భయం ఆవరించింది. కళ్ళల్లో నీళ్ళు నిండినయ్. పెదవులు దుఃఖం తోనూ, కోపంతోనూ కంపిస్తున్నయ్. ముడిగా వేసుకున్న జడవూడిపోయింది..... 'మఠం' దగ్గరకు చేరుకున్న తర్వాతగానీ గాయత్రి నడకవేగం తగ్గించ లేదు. కాళ్ళు కడుక్కోకుండానే యింట్లోకి వెళ్ళి తలుపు గడియవేసి కళ్ళుమూసుకుని ఒక్కక్షణం తలుపు కానుకుని నిలబడింది. తలుపుచప్పుడు విని కృష్ణమాచారి మంచం మీదనుంచిలేచి, తలుపు కానుకుని బెదరిన లేడిమాదిరున్న భార్యనుచూసి 'ఏమిటి, గాయత్రీ!' అంటూ దగ్గర కెళ్ళాడు. వెక్కి వెక్కి ఏడుస్తూ దగ్గరకొస్తున్న భర్తను తప్పించుకుని లోపలి గదిలోవున్న లక్ష్మీదేవిగారి దగ్గర కెళ్ళింది గాయత్రి. 'ఏం జరిగింది, గాయత్రీ!' అంటూ కంగారుగా ఆమె వెంటలోపలికి వెళ్ళాడు కృష్ణమాచారి......

అంతావిన్న లక్ష్మీదేవిగారు 'ఛీ, దుర్మార్గుడు' అంది ఆవేశంగా. జబ్బుమనిషి అయినా మంచం మీదనుంచి లేచి గాయత్రిని దగ్గరకు తీసు కుంది. ఆవిడఒడిలో తలపెట్టుకుని భోరున ఏడ్చింది గాయత్రి. కృష్ణమాచారి ప్రళయకాలరుద్రు డయ్యాడు. 'వాడి రక్తం కళ్ళచూస్తాను' అన్నాడు ఆవేశంగా పికిడిలిబిగిస్తూ, గాయత్రి భయంగా భర్తవంక చూసింది..... లక్ష్మీదేవిగారు కాస్సేపాలో చించి—

'ఆవేశపడకబ్బాయ్.... యిదంతా నలుగురికీ తెలియచెయ్యటం ఎందుకు? నేనేవెళ్ళి వాళ్ళమ్మ చేత వాడికి బుద్ధి చెప్పిస్తాను..... నువ్వు తొందర పడకు' అంది...... కొంతసేపైన తర్వాత కృష్ణ మాచారి శాంతించాడు.

యిద్దరూ లక్ష్మీదేవిగారి గదిలోంచి బయట కొచ్చారు. బయటకు వచ్చి భర్తను గట్టిగా కౌగ లించుకుని వణికే కంఠంతో 'మనల్ని భగవంతుడు చల్లగా చూశాడు' అంది గాయత్రి. ఆమె కళ్ల నీళ్ళు తుడుస్తూ ఆమెను మరింత దగ్గరకు తీసు కున్నాడు కృష్ణమాచారి.

* * *

సుబ్బావధాని దెబ్బతిన్న పులి మాదిరున్నాడు. తను కోరింది తనకు దక్కలేదు. చేతికందిందనుకున్న గాయత్రి అందకుండా పారిపోయింది. చెయ్యికొరికి తప్పించుకుని పారిపోయింది. అందని వస్తువు మీద అయిష్టం ఏర్పడుతుంది. అది పిరికివాళ్ల లక్షణం. సుబ్బావధాని పిరికివాడుకాదు. వూరిలో కెల్లా ఆస్తి పరుడు. తలచుకుంటే ఏమైనా చెయ్యగలడు. గాయత్రి తనకు చిక్కకుండా పోయిననాటి మధ్యా హ్నం యింకా ఏ వుపాయంతో ఆమెను లోబర్చు కోవాలో ఆలోచిస్తూ గాయత్రి కొరికిన తన చేతి వంక చూసుకుంటున్నాడు. గాయత్రి యింటికివెళ్ళి సంగతంతా చెప్పితే ఏం ముప్పువస్తుందో అన్న భయం భయమే రాలేదు సుబ్బావధానికి. కారణం— ఆచారి హీనుడు. వూళ్ళో సామాన్యంగా జీవించే ఒక ఒక అర్చకుడు. అతనికి తనను ఏమైనా చెయ్యగల స్తోమతలేదు.... డబ్బు మనిషికి అంతులేనిధైర్యాన్ని అధికారాన్ని యిస్తుంది. డబ్బుమనిషికి నీతి, నియమాలతో పనిలేదు. అతడి విషయంలో వాటికి నిర్వచనాలు వేరు..... గాయత్రిని అనుభవించలేక పోయానని విచారిస్తున్న సుబ్బావధానికి వీధి వాకిలి లోంచి వస్తున్న కృష్ణమాచారి, లక్ష్మీదేవి గారు కనుపించారు. సుబ్బావధాని కొంచెం కంగారు పడ్డాడు. అయినా అది కనిపించకుండా సిగరెట్టు వెలిగించాడు.....లక్ష్మీదేవిగారు ఒక్క క్షణం ఆగి సుబ్బావధానివేపు అసహ్యంగా చూసి లోపలికి వెళ్ళింది. కృష్ణమాచారి కోపంగా సుబ్బావ ధాని వంక చూస్తూ లోపలి కెళ్ళాడు. కృష్ణమాచారి చూపు సుబ్బావధానిలో అహంభావాన్ని రెచ్చ గొట్టింది. 'యీ క్షుద్రుడికి తన వంక అట్లా చూడ గలిగే ధైర్యమా?' అని పళ్ళు నూరాడు సుబ్బావధాని....లోపలి గదిలో సుబ్బావధాని తల్లి నరసమ్మగారుంది...... కొంత సేపటికి గదిలోంచి 'సుబ్బయ్యా!...యిటురా' అన్న నరసమ్మగారి గర్జన వినిపించి పిల్లిలా లోపలికి వెళ్ళాడు సుబ్బావ ధాని. సుబ్బావధానికి తల్లి అంటె కొంచెం భయం. యిప్పటికీ బయట ఎన్ని వేషాలు వేసినా యింట్లో జాగ్రత్తగానే ఉంటాడు. అదీగాక కొంత ఆస్తి నరసమ్మగారిపేర వుంది.....

నరసమ్మగారు కోపావేశంతో సుబ్బావధానిని నోటికొచ్చిన తిట్లల్లా తిట్టింది. 'వంశ ప్రతిష్ఠ నాశనం చేశావ్ గదరా..... యింకెందుకీ బ్రతుకు? ఛీ, నీ ముఖం చూస్తేనే పాపం.....చండాలుడా' అని ఆయాసంతో గోడ కానుకుని కూర్చుంది.పోయింది. సుబ్బావధాని తల వంచుకుని నిలబడ్డాడు. 'యీ ఆచారి వెధవ ఎదుట యిట్లా నిలబడటమా?' అని మనస్సులోనే బుసలు కొట్టాడు....చివరికి నరసమ్మగారు కృష్ణమాచారి చేతులు పట్టుకుని—

'నాయనా! యివి చేతులుకావు. నీకూ, నీభార్యకూ జరిగిన అవమానానికి క్షమించమని అడిగే అర్హత ఎవ్వరికీలేదు.....కానీ నిన్ను చూసి యీ చండాలుణ్ణి క్షమించు.....మా వంశ ప్రతిష్ఠని కాపాడు' అంటూ

వేసుకుంది.

పేదవాడి మాన మార్యాదలకంటె ధనవంతుడి పరువు ప్రతిష్ఠలు ఎక్కువ. పేదవాడి మాన మర్యాదలు శమగాలంగా నాశనం అయినా ధనవం తుడి పేరు ప్రతిష్ఠలు మాత్రం చెక్కు చెదర కూడదు. యిది న్యాయం! ..... యిదేం న్యాయం! ? .... యిదే న్యాయం!? ..... కానీ నరసమ్మగారు ఆ ఉద్దేశ్యంతో అడగలేదు. ఆవిడ పశ్చాత్తాపంతో కుమిలిపోతోంది. చేతులు పట్టు కున్న నరసమ్మగారికి నమస్కరిస్తూ—

'అమ్మా! అంత మాటనకండి. మీరు నాకు తల్లి వంటివారు. మీ పరువు ప్రతిష్ఠల్ని కళంకితం చెయ్యాలనే ఉద్దేశ్యంతో నే నిక్కడకు రాలేదు. అది నా ఉద్దేశ్యం కూడా కాదు. నేను పరువుగా బ్రతకాలన్నదే నా లక్ష్యం' అని సుబ్బావధాని వంక చూశాడు కృష్ణమాచారి.

'మీ ముఖం చూసి విడిచిపెడుతున్నాను. కపోతే యీ నీచుణ్ణి బజారుకి యీడ్చించి పెద్ద మను ష్యుల్తో చెప్పు దెబ్బలు కొట్టించేవాణ్ణి. అనే శంతో వూగిపోతూ అన్నాడు కృష్ణమాచారి. సుబ్బావ ధాని పిడికిళ్లు బిగిస్తూ కృష్ణమాచారి వంక చూశాడు. కానీ, తల్లి ఎదట ఏమీ మాట్లాడలేక గది బయటకు విసురుగా వచ్చేశాడు. 'యీ నాటికి యీ ఆచారి వెధవ నన్ను చెప్పు దెబ్బలు కొట్టిస్తా నంటాడా?...వరేయ్, ఆ చారీ! నీ అంతుచూస్తాను.' అంటూ యింట్లోంచి బయటకు వెళ్ళిపోయాడు సుబ్బావధాని.....గాయత్రి తనకు దక్కలేదు. పైగా ఒక అనామకుడిముందు అపరాధిలా నిలబడవలసి రావటం—యీ రెండూ సుబ్బావధానిలో ప్రతీ కార వాంఛను రేకెత్తించినయ్.

* *

మధ్యాహ్న సమయం— రెండు గంటలయ్యింది. మంచం చింతచెట్టు క్రింద వేసుకొని చిన్న కత్తితో కొబ్బరి ముక్కలు తరుగు తున్నాడు కృష్ణమా చారి. సాయంత్రం గుడికొచ్చే పిల్లలకు పంచి పెట్టే ప్రసాదం అది..... సుబ్బరామయ్యగారి పాలేరు వీరన్న వచ్చి 'దండాలండీ, ఆచార్లుగోరూ' అంటూ క్రింద కూర్చున్నాడు.

'ఏమిటి వీరన్నా?' అన్నాడు కృష్ణమాచారి ముక్కలు తరగటం ఆపి.

మా చిన్నయ్యగారికి కొడుకు పుట్టారండి..... యిప్పుడే కృష్ణాపురం నుంచి కబురొచ్చింది... అన్నాడు వీరన్న.

'ఆహా ..... సుబ్బరామయ్యగారికి మనవడన్న మాట..... బాగుంది' అన్నాడు సంతోషంతో కృష్ణమాచారి. వీరన్న లేచి 'పాల వెడుతున్నానండి..... పురుడొచ్చింది కదూ.... అందుకని రేపు దేవుడికి...' అంటూ ఆగాడు వీరన్న.

'హోహో....అదా.... నేనింకో యింట్లో ఏర్పాటు చేస్తానని సుబ్బరామయ్యగారికి చెప్పు' అని వీర న్నను పంపించి వేశాడు కృష్ణమాచారి.

ఆ మర్నాడు 'భోగం' చేయించాల్సింది. సుబ్బ రామయ్యగారు. కానీ పురుడు రావటం వల్ల, వారు చేయించ కూడదు. యిలాంటి అడ్డంకులు ఏవన్నా వచ్చినప్పుడు గానీ, 'భోగం' చేయించటానికి ఎవ్వరూ ముందుకు రాకపోయినప్పుడు గానీ కృష్ణ శాస్త్రి గారి యింటి వాళ్ళు ఆ రోజు 'భోగం' చేయించ టం అలవాటు. తాము చేయించే రోజుల్లోనే గాక యిలాంటి రోజుల్లో కూడా కృష్ణశాస్త్రి గారింటి వాళ్లే చేయిస్తూ వుండేవారు. అది కృష్ణ శాస్త్రి గారు బ్రతికి వున్న రోజుల్నించీ వస్తున్న ఆచారం. సుబ్బరామయ్యగారు పురుడు విషయం చెప్పి రమ్మనటంతో యీ విషయం చెప్పటానికి కృష్ణమాచారి కృష్ణశాస్త్రి గారింటికి బయల్దేరాడు.

'నేను నరసమ్మ గారింటికి వెళ్ళొస్తాను' అని గాయత్రితో చెప్పి బయల్దేరాడు. గాయ త్రికి కుడికన్ను అదిరింది. మనస్సులో ఏదో శంక బయల్దేరింది.

'మీరే వెడతారా?.... సూరమ్మను పంపి తెప్పిస్తే సరిపోతుందేమో' అంది గాయత్రి.

'అబ్బే, అదేం బాగుంటుంది. నరసమ్మ గారే మన్నా అనుకుంటుంది. అదీగాక ఎవరి పేర చేయించ మంటారో కనుక్కోవాలి.... వాళ్ల గోత్రం కూడా సరిగ్గా గుర్తు లేదు నాకు' అంటూ బయలుదేరి వెళ్ళాడు కృష్ణమాచారి. భయాందోళనల్తో భర్త వెళ్లిన వైపే చూస్తూ నిలబడింది గాయత్రి.

కృష్ణశాస్త్రి గారిది పెద్ద మండువా యిల్లు. మధ్య వసారాలో సుబ్బావధాని, రామిరెడ్డి సిగరెట్లు కాల్చుకుంటూ పేకాట ఆడుతున్నారు. వీళ్లని దాటి వెడితే గానీ నరసమ్మ గారి గది రాదు. కృష్ణమా చారి వీళ్ల ప్రక్కనుంచి నడచి లోపలి గదిలోకి వెళ్ళాడు. కృష్ణమాచారి వెళ్ళిన వైపు చూసి కనుబొమలు ముడిచాడు సుబ్బావధాని. గట్టిగా పొగ పీల్చి ఒక్క క్షణం ఆలోచించి చేతిలో పేక ముక్కలు తీసి బల్లమీద పారేసి రామిరెడ్డిని తీసుకుని తన పడక గదిలోకి వెళ్ళాడు.

కొంతసేపైన తర్వాత ఒక పెద్ద పళ్లెం నిండా కావాల్సిన పదార్థాలన్నీ తీసుకుని కృష్ణమా చారి నరసమ్మగారి గది గుమ్మం దాటాడు. అతడు గది గుమ్మం దాటుతుండగా నరసమ్మగారు మళ్ళీ—

'నాయనా! కృష్ణుడూ!.... సాయంత్రం నేను నెయ్యి పంపిస్తాను. సుబ్బరావు నక్కర్లేదులే మళ్ళీ ..' చిట్టి గారెలు నేతితో చేయించు' అంది.

'అలాగే నండి...... యీ పళ్లెం రేపు ప్రొద్దున్నే ప్రసాదంతో పాటు తెచ్చి నేనే యిస్తాను.... వస్తా నండి' అంటూ బయట కొచ్చాడు. రెండు చేతుల్లో పళ్లెం పట్టుకుని మధ్య వసారాలోంచి వెళ్తుండగా ప్రక్క గదిలోంచి సుబ్బావధాని పరు గెత్తుకుంటూ వచ్చి కృష్ణమాచారి బనీనుకున్న జేబులో రూపాయల కట్ట క్రుక్కాడు. వెంటనే 'పట్టుకో రెడ్డీ! దొంగముండా కొడుకుని' అంటూ అరిచాడు. యిద్దరూ కలసి కృష్ణమాచారిని చేతులు వెనక్కి విరచి పట్టుకున్నారు. అతని చేతిలో పళ్లెం క్రింద పడి దాంట్లోవన్నీ చెల్లా చెదురుగా పడి పోయినయి. సుబ్బావధాని తన కాలి చెప్పుడిసి కృష్ణమాచారి తలమీద 'టప, టప' బాదటం మొదలు పెట్టాడు.

'బాబోయి, చంపేస్తున్నారు' అంటూ అరిచి తల్లి కొగ్గి వాళ్ళిద్దరి విడిపించుకుని బజార్లోకి పరుగెత్తాడు కృష్ణమాచారి. వీధి గుమ్మం దాటుతుం డగా ధోవతి కాలికి అడ్డం పడి ముందుకు పడి పోయాడు. క్రింద పడ్డ కృష్ణమాచారిని కాలితో తన్ని సాగారు రెడ్డి, సుబ్బావధాని. కృష్ణమా చారి వెన్నుముక 'ఫటుక్కు' మంది. 'అమ్మో!' అంటూ బాధతో అరిచాడు. రచ్చబండ మీద కూర్చున్న అయిదారుగురు పరుగెత్తుకొచ్చి రెడ్డిని,



సుబ్బావధానిని అవతలకు లాగారు. సుబ్బావధాని వాళ్లని విదిలించుకుని,

'వదలండయ్యా.... లం—కొడుకు, ఓబిలు మీదున డబ్బెత్తు కొస్తున్నాడు., దొంగ లం....' అన్నాడు. కృష్ణమాచారి మెల్లగా కూర్చున్నాడు. నిలబడలేక పోయాడు. 'అబద్ధం' అంటూ చెప్ప బోతూండగా సుబ్బావధాని వలుగుర్ని విదిలించుకుని కృష్ణమాచారి జేబులోంచి నోట్ల కట్టతీసి—

'చూశారా..... గాడిద కొడుకుని కొట్టాలా? చంపి పాతెయ్యాలా?' అంటూ చెప్పుతీసి మళ్లీ బాదటం మొదలెట్టాడు. కృష్ణమాచారి ముఖం మీద చేతులు అడ్డుపెట్టుకుంటుంటె చేతులు లాగి మరీ కొట్టసాగాడు సుబ్బావధాని. రెడ్డి వెనక నుంచి కృష్ణమాచారిని ఒక్క తన్ను తన్నాడు. కృష్ణమాచారి నేల మీద పడిపోయాడు. పడిపోయిన వాణ్ణి రాళ్ల మీద యీడ్చారు. కృష్ణమాచారి జేబులో నోట్ల కట్ట చూసిన తర్వాత యింతదాక వచ్చి అడ్డుపడ్డ వాళ్లు కూడాయేమీ మాట్లాడటం లేదు. కృష్ణమాచారి జేబులోని డబ్బు అతనిపై అపాదింపబడిన నేరానికి ప్రత్యక్ష సాక్ష్యంగా యిప్పుడందరికీ కనిపిస్తోంది...... చుట్టూ యిరవై మందిదాకా చేరారు. అందులో పెద్దలున్నారు., పెద్ద మనుష్యులున్నారు., సామాన్యమైన మనుష్యులున్నారు. కానీ ఎవ్వరూ ఏమీ మాట్లాడటం లేదు. యీ పెద్ద మనుష్యుల నిజాయితీ పట్ల నమ్మకంతో ఒకప్పుడు వాళ్ల చేత సుబ్బావధానిని చెప్పుతో కొట్టిస్తానన్నాడు కృష్ణమాచారి. కానీ ఆ పెద్ద మనుష్యుల మధ్యే సుబ్బావధాని కృష్ణమాచారినే చెప్పుతో కొడ్తున్నాడు. పెద్ద మనుష్యులు 'పెద్ద' మనుష్యులకే సహాయం చేస్తారని కృష్ణమాచారికి తెలియదు. అతడు 'చిన్న' మనిషి., అమాయకుడు....

సుబ్బావధాని చేతి కొచ్చినట్లు కొడ్తూనే

# ఊరు వూరుకుంది

వున్నాడు. కృష్ణమాచారి కన్నుపైన గీరుకుపోయి రక్తం కారింది. పెదివి చిట్లి నెత్తురొచ్చింది. వళ్లంతా గీరుకు పోయింది. అయినా అన్నివిధాలా బలవంతులయిన యిద్దరు ఒక్కణ్ణి చేసి చావ బాదుతున్నారు. కానీ చుట్టూ చేరిన్నవాళ్లు ఏం మాట్లాడటం లేదు. వూరు వూరుకుంది. చుట్టూ చేరిన వాళ్లకి ఏ ఒక్కరికీ కృష్ణమాచారి నిజాయితీ పట్ల అపనమ్మకం లేదు. కానీ అలా బయటకు చెప్పే ధైర్యం లేక కొందరు, 'మనకెందుకు' అని కొందరు వూరుకున్నారు. ఫలితం?..... కామాంధుడూ, సంపన్నుడూ అయిన ఒక రాక్షసుడి చేతిలో ఒక అమాయకుడు బలి అయిపోతున్నాడు. పులి కాపువేసి లేడి పిల్ల మెడ నోటిలో చిక్కించుకుని పరుగు తీసింది. లేడి పిల్ల గిల గిల కొట్టుకుంటూ అరుస్తోంది. క్షుద్ర జంతువులన్నీ పులి దారిలోంచి తప్పుకుని తొంగి తొంగి చూస్తున్నయి. లేడి పిల్ల విషాదంగా అరుస్తోంది. ప్రక్కనే పోతున్న ఏనుగులు తమకేమీ పట్టనట్లు నడిచిపోతున్నయి. పులిని ఎదుర్కొనే శక్తి వాటి కుంది. కానీ లేడి పిల్ల కొరకు ఆ పని చెయ్యటం వాటి కంత అవసరం కాదు. లేడిపిల్ల గిలగిల కొట్టుకుని పులి నోట్లో వ్రేలాడిపోయింది.. అది అడవి. యిది వూరు. అయినా పరిస్థితుల్లో ఏం భేదం లేదు. మనస్తత్వాలన్నీ ఒక్కటే. సుబ్బావధానిని ఎదిరించగల అండదండలున్న వాళ్లున్నారు. కానీ ఒక పూజారి కోసం ఆ పని చెయ్యటం అనవసరం. మానవత్వం మరిగిపోయింది. న్యాయ ధర్మం ఆవిరయినై. నీతినియమాలు ఎగిరిపోయినై రాక్షసత్వం నగ్నంగా నర్తిస్తోంది. యిదీ ప్రపంచం యిదేం ప్రపంచం?! ఇదే ప్రపంచం!!

గాయత్రి పరుగుపరుగున వచ్చి కృష్ణమాచారి మీద వ్రాలింది. సుబ్బావధాని ఆమెను జుట్టు పట్టుకుని దూరంగా లాగాడు. కృష్ణమాచారి తల నేలకేసి బలంగా కొట్టాడు రామిరెడ్డి. తల చిట్లి ముఖం మీదకు రక్తం కారింది. రక్తం కంటి మీద నుంచి కారుతుంటె జుట్టు పట్టుకుని గాయత్రిని అవతలకు లాగుతున్న సుబ్బావధానిని చూశాడు కృష్ణమాచారి. అతడిలో కొన్ని వేల అగ్ని పర్వతాలు బ్రద్దలయినయ్. అవి ఎన్నటికీ చల్లారవ్. ఒక మంచివాడి హృదయం అందులో మాడిపోయింది...... వరసమ్మగారు, లక్ష్మిదేవిగారు రావటంతో ఆ పైశాచికం అంతటితో ఆగింది. పెద్ద మనుష్యులందరూ యిళ్లకు వెడుతూ 'డబ్బు గడ్డి తినిపిస్తుంది' అన్నారు. గడ్డితిని డబ్బు గడించిన పెద్ద మనుష్యులు.!

కృష్ణమాచారి ఎవరితోనూ మాట్లాడ లేదు. గాయత్రిని ఆధారంగా చేసుకుని 'మఠా'నికి వెళ్లాడు. ముఖమంతా వాచింది. ఒళ్లంతా రక్తపు మరకలు. వేడి నీళ్లతో గాయత్రి తుడుస్తూ వుంటే శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు. కన్నీళ్లు ధారలు కట్టినయి.....

సాయంత్రం గుడికి వెళ్లి దీపారాధన చేశాడు. ఒళ్లంతా నెప్పులుగా వుంది. విగ్రహం వంకచూస్తూ కూర్చున్నాడు. విగ్రహం నవ్వింది. దేవుడు నవ్వుతున్నాడు....గాయత్రి కూడా ప్రక్కనే వుంది. కృష్ణమాచారి మధ్యాహ్నం నుంచి యింతవరకూ ఒక్క మాట కూడా మాట్లాడ లేదు. గాయత్రికి భయంగా వుంది. దేవుడికి నమస్కారం చేసి,

'గాయత్రీ పోదాం పద.... యీ వూరి నుంచి వెళ్లిపోదాం' అంటూ లేచాడు కృష్ణమాచారి.

మర్నాడు ప్రొద్దున 'మఠం'లో గాయత్రి, కృష్ణమాచారి కన్పించలేదు. లక్ష్మిదేవిగారు ఏడుస్తూ సుబ్బావధాని వాళ్లిద్దరికీ చేసిన అన్యాయం వూళ్లో అందరకూ చెప్పింది. ఆ వుదయమే గర్భగుడిపై భాగం విరిగి విగ్రహం మీద పడింది. విగ్రహం విరిగి పోయింది.... తర్వాత పునఃప్రతిష్ఠ చేయించాలని లక్ష్మిదేవిగారు ప్రయత్నించింది. కాని ప్రయత్నాలు ఫలించ కుండానే ఆవిడ కన్ను మూసింది..... కృష్ణమాచారికి యీ అవమానం జరిగిన ఆరు నెలలలోపలే వున్న మనిషి వున్నట్లు రక్తం కక్కుకుని చనిపోయాడు సుబ్బావధాని.

దేవాలయంలో దేవుడుంటాడో లేదో తెలియదు. కానీ ఒక మంచి మనిషి మనస్సు దేవాలయం కంటె పవిత్రమైంది. అందులో కోట్ల కొలది దేవుళ్లుంటారు. మంచి మనిషి మనస్సుని బాధ పెడితే ఆ పాపం వూరికే పోదు. ఆ బాధలో కోటి శాపాలుంటాయి. ఇది నిజం. ఇదే నిజం.

* * *

వర్షం తగ్గింది. యిద్దరం గుడి మండపం మీద నుంచి లేచాం. ●



# కాన్వెంటు చదువులే క్రమబద్ధమైనవి!

[illegible] ప్రాథమిక విద్యగురించి, బోధనా విధా[illegible] వ్యాసం చదివాను. కొన్ని సంవత్సరాలు మాత్రం పరిశీలించి, అంత మాత్రాన ఒక నిర్ణయానికి రావటం సముచితం కాదు. నాకు (పూర్వాశ్రమంలో) విద్యారంగంలో ఎడ్మినిస్ట్రేటివ్, టీచింగ్, ఈ రెండుశాఖలతో సంబంధం వుండివుండటం మూలాన అనేక సంస్థలతో, బోధనా పద్ధతులతో, విషయాలతో పరిచయం వుంది. అందుచేతే, నాకు తెలిసిన విషయాలను ఈ వ్యాసరూపంగా మీ అందరి ముందు వుంచుతున్నాను.

ఈ రోజుల్లో ప్రతి గ్రామంలోనూ కనీసం సింగిల్ టీచర్ స్కూలైనా వుంటుంది. విద్యార్థుల సంఖ్యనిబట్టి, టీచర్లను వెయ్యటం జరుగుతుంది. అంతేగాని, ఒకే ఒక గ్రామంలో జానకీదేవిగారన్నట్టు ఎలిమెంటరీ స్కూలూ, కాన్వెంటూ, ఒకేసారి, లేదా ఒకదాని తర్వాత ఒకటైనా 'లేవటం' జరుగదు. ఒక విద్యాసంస్థ ఏ స్థలంలోనైనా స్థాపించేముందు అధికారులు ముందుగావచ్చి, ఆ స్థలంలోని (గ్రామంలోని) 'స్కూల్ గోయింగ్ ఏజ్' వున్న పిల్లలసంఖ్య సేకరించి, లొకేషన్, తదితర సౌకర్యాలు, యితర ఉపయోగాలు వున్నదీ లేనిదీ పరిశీలించి ఆ తర్వాతనే పైకి రిపోర్టు పంపుతారు. కాబట్టి గ్రామాల్లో ఎలిమెంటరీ స్కూలూ, కాన్వెంటూ ఈ రెండూ వుండవు. ఎలిమెంటరీ స్కూలే వుంటుంది.

సాధారణంగా ఎలిమెంటరీ స్కూలు లెవెల్‌లో విద్యాబోధన సరిగా వుండదు. ఒకటి, ఏమిటంటే ఉపాధ్యాయులకి వేతనాలు సరిగా యివ్వరు. అధికారులుకూడా మరెందుచేతనో ఈ పాఠశాలలని సరిగాతనిఖీ చెయ్యరు. కాబట్టి ఈ స్కూళ్లలో ఉపాధ్యాయులకి పిల్లలు ఎంతవరకు నేర్చుకున్నారు, ఏమిటి నేర్చుకున్నారన్నది కాదు ముఖ్యం. ఇలాంటి స్కూళ్లలో ఎటెండెన్సు రిజిష్టరుకూడా సరిగ్గా మెయింటెయిన్ చెయ్యరు. ఇన్స్పెక్టర్ [illegible] ఆ నెల ఎటెండెన్సు అంతా వేసేస్తారు. పైగా ఈ స్కూళ్లలో పిల్లలు కూచోటానికి సరైన బెంచీలుగానీ, ఆట సామగ్రికానీ, ప్లేగ్రౌండ్‌కానీ వుండవు. కొన్ని స్థలాల్లో బ్లాక్‌బోర్డుకూడా వుండదు. ఇలాంటి చోట్లలో పిల్లలు ఏమీ నేర్చుకోలేరు. ఏదో కొంత నేర్చుకున్నా అదొక గొప్పవిషయం కిందే జమకట్టాలి. స్కూలు, విద్యార్థియొక్క శారీరక, మానసికాభివృద్ధికి (ఆల్ రౌండ్ డెవలెప్‌మెంట్) దోహదకారిగా వున్నప్పుడే అది నిజమైన 'స్కూలు' అనిపించుకుంటుంది.

ఇక కాన్వెంటు చదువుగూర్చి: కాకా హోటల్లో (చా) టీ పదిపైసలే. కానీ అదే టీ పెద్ద రెస్టారెంటులో యాభైపైసలేమిటి రూపాయైనా అవవచ్చు. ఇంతటి తేడా ఎందుకో, మనఅందరికీ బాగాతెలుసు.

ఏ కాన్వెంటులోనైనా, ఏ టీచరైనా బెత్తం పట్టుకుని పాఠంచెప్పిన వైనం విన్నారా? చూశారా? ఏ కాన్వెంటు విద్యార్థి బండబూతులు మాట్లాడటం విన్నారా? అదే ఎలిమెంటరీ స్కూల్లో చదివే పిల్లలు చూడండి ఎలా బూతులు తిట్టుకుంటూంటారో! చదువులో వెనుకపడి వున్నా ఒక నాలుగు నెలలు కష్టపడి చెప్పించ వచ్చును కానీ, ఈ బూతులు మాట్లాడటం మాన్పించాలంటే ఎన్నాళ్ళు ఎంత, కష్టపడాలి? పైగా కాన్వెంట్లలో విద్యాబోధన [illegible] సకల సామగ్రి (నల్లబల్ల, ఫ్లానల్‌బోర్డులు పూసల చట్రాలు) ఆడుకునే టందుకు సామగ్రి, స్థలమూ, పుష్కలంగా వుంటాయి. హాయిగా కూచోటానికి బెంచీలూ, స్థలమూ వుంటుంది. పరిసరాలు కూడా పరిశుభ్రంగా వుంటాయి.

ఈ మధ్యనే ఒకసారి నేను ఒక కాన్వెంటుకి స్పోర్ట్సుడేకి వెళ్లటం పడింది. అన్ని ఆటలు నేను జన్మలో చూడలేదంటే అతిశయోక్తి కాదు. రకరకాల ఆటలు ఆ పిల్లలు అంత నిశ్శబ్దంగా, అంత క్రమబద్ధంగా ఆడుతూంటే నిజంగా ముచ్చటేసింది చూడటానికి. సంవత్సరం పొడుగునా తర్ఫీదు లేనిదే వాళ్ళలా ఆడగలిగారు అంత బాగా?

ఒసేయ్, అమ్మా అని తల్లిని పిలవటంలో లేని తప్పు 'మమ్మీ' అని పిలవటంలో వుందా?

మన ఎలిమెంటరీ, హైస్కూళ్లల్లో చదువుకునే పిల్లలు, (క్రైస్తవులు) రామాయణాన్ని, భారతాన్ని ఆసక్తితో చదువుకోటంలేదూ? అలాగే మన పిల్లలు క్రిస్మస్ సమయంలో, క్రీస్తును గూర్చిన విషయాలని వింటే, విన్నంత మాత్రాన్నే మైలపడిపోరు. మత విషయంలో విశాల దృక్పథం చిన్నప్పటి నుంచి పిల్లలలో అలవడాలి. బుద్ధుడి గూర్చి మన పిల్లలు చదువుకుంటున్నారే మరి వాళ్ళంతా బౌద్ధులుగా, భిక్షువులుగా మారిపోతున్నారా? మంచి ఎక్కడున్నా, ఏరూపంలో వున్నా, గ్రహించటంలో తప్పులేదు.

కాన్వెంటు ఎస్టాబ్లిష్‌మెంటుకయే ఖర్చు కొంతవరకూ విద్యార్థులు భరించాలి. అందుకే ట్యూషన్‌ఫీజు ఎక్కువ. కాకా హోటలుకీ, రెస్టారెంటుకీవున్న తేడాయే యిదీ!

— ఇందుమతి పట్నాయక్






**జ రి గి న క థ**

సురేఖ తాయరు రమణమూర్తిగారమ్మాయి. సురేఖ కంటె తర్వాత ఇద్దరు ఆడపిల్లలూ చూడ ముచ్చటగా వుంటారు. ఆమె కంటె మూడేళ్ళు చిన్నది ఉమ. సురేఖ మాత్రం చామన చాయగా సామాన్యంగా వుంటుంది. రామకృష్ణ ఆమెకు మేనత్త కొడుకు. చిన్నప్పటి నుంచి అతని మీద ఆశలు పెంచుకున్నది సురేఖ. రుక్మిణమ్మగారు అందంగా వున్న ఉమని కోడలుగా చేసుకోవాలనుకుంటుంది. రామకృష్ణకీ ఉమనే చేసుకోవాలని వుంటుంది. అందుకు తలిదండ్రులు కూడా సమ్మతించడంతో సురేఖ చాలా బాధపడుతుంది. పెళ్ళికంటె ఉద్యోగం చేసుకోవడం సుఖమనిపించిన సురేఖ ఎలాగో కష్టపడి ఉద్యోగం సంపాదించుకుంటుంది. ఆమె స్నేహితురాలు శ్యామల.

# 6

రిక్షాలో కూర్చున్న దగ్గరమంచీ ఆవిడకొడుకు ఉద్యోగం గురించీ, నెలకి ఏనిమిదివందలు తెచ్చే అతను బుద్ధిగా ఆ డబ్బంతా తనచేతిలో పోయడం గురించీ చెప్పటం మొదలుపెట్టింది — ఆ పొలం ఇల్లూ అమ్మేస్తే పాతికవేలయినా వస్తాయిట. మామయ్య సంపాదన మరో పాతిక వేలు బ్యాంకిలో వుందిట — ఆ రెండూ కలిపి ఓ పెద్ద ఇల్లు కొనాలనుకుంటున్నారుట—

అవన్నీ నాకెందుకో అనుకుంది సురేఖ. ఊరుల్లు చెప్తూనే రోడ్డుమీద ఓ కన్ను వేసివుంచిన ఆవిడ 'ఆ ఇటు కుడిప్రక్కకి తిప్పు—ఆ మూడో ఇల్లే' అంటూ రిక్షా అబ్బికి గుర్తుచెప్పింది.

అదో చిన్నడాబా — గేటు దగ్గర్నించి ముందు వరండాదాకా కొంత జాగా వదిలి పెట్టి, మిగతా ఖాళీ స్థలంలో రకరకాల పూలమొక్కలు క్రోటను మొక్కలు వేశారు— బాటకి రెండువైపులా దీర్ఘచతురస్రాకారంలోవున్న చామంతి మళ్ళు మరి మనుషులని అకట్టేసుకుని అడుగు ముందుకు పడనివ్వకుండా చేస్తున్నాయి. ఎక్కడా ఆకు అనేది కనిపించకుండా పచ్చగా పసుపు ఆరబోస్సినట్లు మడి అంతా అల్లుకుపోయిన చామంతులని చూసి పరవశించిపోయింది సురేఖ — అప్పటికే తాళంతీసి రంగమ్మ లోపలికి వెళ్ళిపోవటం వల్ల బాగుండదన్నట్లు తనూ లోపలికి వెళ్ళింది. ముందు చిన్న వరండా రెండు గదులు, ఓ హాలు, వంటగది — ఇల్లు పొందికగా చాలా సౌకర్యంగావుంది. వెనక వున్న కొంత జాగాలో కూడా గులాబీలు వేశారు. అవీ విరగబూశాయి అన్ని రంగుల్లోనూ.

'పూలతోట బాగా పెంచారు' అంది సురేఖ ఆవిడ పరచిన చాపమీద కూర్చుంటూ.

'వాడికన్నీ సరదాలు— విన్నివుంటే ఏం చెప్పు అనుభవించే యోగం దాని నుదుట లేకపోయాక—ఇప్పుడిప్పుడు వాడికీ శ్రద్ధ తగ్గిపోయింది మనస్సు బాగుండక' అంటూ నిట్టూర్చింది రంగమ్మ.

అదివరకు ఆ ఇంట్లోవుండి ట్రాన్స్ఫరు అయి వెళ్ళిపోయినవాళ్ళు ఆ చెట్లన్నీ వేశారనీ, తను వచ్చిందగ్గరనుంచి అవి చచ్చిపోకుండా కాసిని నీళ్ళుపోసి సంరక్షణ చేస్తున్నాననీ ఆవిడకిచెప్ప బుద్ధికాలేదు.

ఓ నాలుగు గులాబీలూ, చామంతి పువ్వులూ కోసుకువచ్చి సురేఖ ముందుపోసి మాలకట్టిపెట్టుకో అంటూ దారం తెచ్చి ఇచ్చింది.

'నాకు రెండు చాలు—ఇవి తీసుకువెళ్ళి శ్యామలకిస్తాను' అంటూ రుమాలులో చుట్టిపెట్టింది.

'ఇక్కడే కూర్చుందువుగాని రా,' పీట వాలుస్తూ వంటింట్లోంచి పిలిచింది రంగమ్మ.

చేతిలోకి తీసుకున్న పత్రిక మళ్ళీ ప్రక్కన పడేసి లేచివెళ్ళింది సురేఖ.

'వాడికి సరిగ్గా ముప్ఫైనిండాయి— ఈ వయస్సులో ఎలా వుండాలి, మనస్సు పాడుచేసుకుని దాని ప్రాణానికి పుసూరుమని ఏడుస్తూ కూర్చోటం ఏం ఖర్మ చెప్పు—వాడి పాస్థితిలో చూస్తూ భరించటం తల్లిగా నాకెంత రంపపుకోతగా వుంటుందో ఆలోచించు—ఏమిటో చమవు కొదీ నా బాధంతా వెళ్ళబోసుకుంటున్నాను.' బియ్యం కడుగుతూ మధ్య మధ్య వెనక్కి తిరిగి సురేఖ ముఖకవళికలు గమనిస్తూ చెప్పుకుపోతోంది.

'అయిందేదో అయిపోయింది—ఎన్నాళ్ళ వాడిలా బైరాగిలా బతుకుతాడు — ఇదేం మన ఒక్క ఇంట్లోనూ జరిగిన విడ్డూరం కాదు...లోకం అంతటా వున్నాయి—రోజూ వింటున్నాం, చూస్తున్నాం—హాయిగా మరో పెళ్ళిచేసుకో అని నేను రోజూ మొత్తుకుంటూనే వున్నాను,' బియ్యం పొయ్యిమీద పడేసి కూరలబుట్టా కత్తిపీటా ముందు వేసుకు కూర్చుంది.

'చూడు స్వతంత్రంగా అడిగేస్తున్నాను ఏమీ అనుకోకు — నీ కిష్టం అయితే మీ నాన్నకి నేను రాసి ఒప్పిస్తాను.'

మధ్యాహ్నంనుంచీ ఆవిడ ధోరణి అలాంటి ప్రస్తావనకి దారితీస్తుందేమోనన్న అనుమానం కొస్తంతవచ్చినా, నిజంగా ఆవిడ అదే విషయం మాట్లాడేసరికి సురేఖకి వళ్ళంతా కంపరం పెట్టినట్లయింది. చూచాయగా తనకి విషయం చెప్పి తండ్రి ద్వారా ఉత్తరం వ్రాయిస్తుందేమో ననుకుంది కాని ఈవిడ ఇలా నిస్సంకోచంగా అడిగేస్తుందని గట్టిగా అనుకోలేక పోయింది.

భోజనం వద్దు ఏమీ వద్దు — కడుపు నొప్పిగా వుందని వంకపెట్టి తక్షణం హాస్టల్‌కి పారిపోదామా అనిపించింది.

'ఉన్నమాట చెప్పాను — ఆలోచించుకోటానికి 'వ్యవధి నిస్తున్నాను.' అన్నట్టు

రంగమ్మ మరి ఆ విషయం కదపలేదు.

సురేఖ ఆలోచనలు నాలుగైదు సంవత్సరాల గతంలోకి చొచ్చుకుపోయాయి — అప్పుడు ఈ రంగమ్మ కోడల్ని గురించి ఏవో వింతగా విడ్డూరంగా చెప్పుకునేవారు— పెళ్ళయి అత్తవారింటికి వచ్చి ఓ ఏడాది అతనితో సంసారం చేసిన ఆ అమ్మాయి ఓ సారి పుట్టింటికి వెళ్ళి మరి తిరిగి రాలేదు— నాకు మొగుడూ వద్దు సంసారమూ వద్దు — ఆ ఇంట్లో బ్రతికే బదులు పదిళ్ళల్లో పాచిపని చేసి బ్రతకవచ్చు అని పుట్టింట్లోనే వుండి పోయిందిట— ఆ అమ్మాయి అప్పటికే బియ్యే ప్యాసయింది. హాయిగా ఉద్యోగం చేసుకుంటోంది—తల్లీ కొడుకూ కలిసి ఆ పిల్లని కాల్చుకు తినేవారనీ ఆ బాధలు పడలేకనే ఆ పిల్ల వెళ్ళిపోయిందనీ—అంటారు—ఆ పిల్ల ఒట్టి పొగరుమోతు రకం అనీ, మొగుడంటే కాస్తయినా లక్ష్యం లేదనీ కొందరన్నారు. ఏదైతేనేం ఆ పిల్ల మళ్ళీ రాలేదన్నమాట — ఇప్పుడు కొడుక్కి మరో పెళ్ళి చెయ్యాలని ఈవిడ తాపత్రయం అన్న మాట అనుకుంది.

వంట అయిపోయి ఇద్దరూ వచ్చి హాల్లో కూర్చున్నారు— బయట స్కూటరు చప్పుడయింది.

'బావొచ్చాడు' అంటూ తలుపు తీయటానికి వెళ్ళింది రంగమ్మ.

'అసలు ఎందుకు వచ్చావా ఇక్కడికి' అనుకుంటూ విసుగూ కోపమూ ముంచుకు వస్తూంటే ఇబ్బందిగా ఓ కుర్చీ నానుకుని నిలబడి పోయింది సురేఖ.

'చిన్నప్పుడు అంత చనువుగా వుండేదా, ఇప్పుడెంత మొహమాటమో చెప్పలేం— ఎంతో బలవంతం చేస్తే ఈ పూట భోజనం చేసి వెళ్ళటానికి ఒప్పుకుంది.' అంటూ ముందు రంగమ్మ ఆ వెనక కామేశ్వరరావు లోపలికి వచ్చారు.

నల్లగా, లావుగా, లావుకి తగ్గ పొడుగులో సినిమాల్లో విలన్ జ్ఞాపకం వచ్చాడు అతని చూడగానే — మనిషిలో ఏకోశానా దయా, జాలి మంచితనం అనేవి వుండవేమోననిపించింది. యదార్థం ఏదైనా కాని, ఆ అభిప్రాయాన్ని మాత్రం మార్చుకోలేనంత అయిష్టత ఏర్పడి పోయింది— సినిమానూ సిగరెట్లూ కాల్చటం వల్ల నల్లగా వున్న మోటు పెదవులూ, ఎప్పుడూ తాంబూలం నములుతూండటం వల్ల గారకట్టిన పళ్ళూ అతను నవ్వినా రుఢుసుకునే లాగే వుంది అనుకుంది — ఇవన్నీ అతను అంతదూరంలో వుండగా ఏర్పడిన అభిప్రాయాలు—

'అలా నిలబడి పోయావేం, కూర్చో' అంటూ అతను మరో కుర్చీలో కూర్చునేసరికి మాత్రం సురేఖకి కడుపులో తిప్పి వాంతి అయిపోతుందేమో ననిపించింది.

పది మందితోపాటు కంపెనీకి తీసుకోక పోతే మర్యాదగా వుండదు అనే ఉద్దేశ్యంతో నయితేనేం ఈ నాటి నాగరికతలో అదీ ఒక లక్షణం అనే వుద్దేశ్యం



తోనయితేనేం దాన్ని కాస్త రుచి చూస్తున్న వాళ్ళు చాలా మందే వున్నారు. కాని తమ ఇంట్లో నాగరికత అంత పెరగలేదు— అసలు సిగరెట్లు కాల్చే అల వాటుకూడ లేదు నాన్నగారికి వాళ్ళకి —

సినిమాలల్లో చూడటం నవలల్లో చద వటం తప్పితే ఇలా ఫ్యాషనుగానయినా కాస్త పుచ్చుకున్న వాడిని చూడటం తన జీవితం లో అదే మొదటిసారి — ఇతని ప్రవర్తన ఎలా వుంటుంది—నడవలేక తూలిపడతాడా, వాలిక-మొద్దుబారి పోయి మాట ముద్దగా వస్తుందా— అత్తయ్యకివన్నీ అలవాటయి పోయాయా — బాబోయ్ — ఇవాళ ఈ ఇంట్లోంచి నేను ఎలా బయటపడతాను అనుకుంటూ గడ్డకట్టి పోయినట్లు నిలు చుండిపోయిన సురేఖని—

'ఇక్కడ కూర్చుందాం రా' అంటూ చెయ్యి పట్టుకు తీసుకు వెళ్లి ఓ సోఫాలో కూర్చోపెట్టి తనూ ప్రక్కనే కూర్చుంది రంగమ్మ;

సురేఖకి కాళ్ళూ చేతులూ వణకటం తగ్గలేదు అయితే కామేశ్వరరావు ఆమె భయపడినట్లు ప్రవర్తించ లేదు — కాకపోతే అవసరానికి మించిన వుత్సాహంతో తన ఆఫీసు విష యాలు క్లబ్బు సంగతులూ ఇంకా ఇవీ అవీ ఎడాపెడా మాట్లాడేశాడు.

కాస్సేపటి తరువాత భోజనాలు యాయి. అప్పటిదాకా ఎలాగో గుట్టుకు

# సురేఖాపరిణయం

వడి కూర్చున్న సురేఖ 'ఇంక నేను వెళ్లి పోతాను.' అంది చేతి వాచీకేసి చూసు కుంటూ.

'వెళ్దువుగానిలే తొందరేమిటి—ఇంకా తొమ్మిదేగా అయింది.' అంది రంగమ్మ.

'అవును. తొందరేమిటి ?' తల్లికివంత పాడాడు కామేశ్వరరావు గుప్పుగుప్పున సిగరెట్టు పొగవదులుతూ.

'లేదండి వెళ్లిపోతాను.' నన్ను ఎవ్వరూ ఆపలేరు అన్నట్లువుంది సురేఖ గొంతు.

'సరే అబ్బాయి, స్కూటరుమీద దిగ బెడతాడులే.' అని రంగమ్మ అంటూంటే ఆ స్కూటరేదో తన గుండెలమీదనుంచి వెళ్లినట్లే అయింది సురేఖకి.

'నాకుభయం వేస్తుంది — రిక్షాలో వెళ్లిపోతాను.' అంది.

'మా అమ్మ ఎంచక్కా ఎక్కికూర్చుం టుంది—నీకు భయం ఏమిటీ.' అన్నాడు కామేశ్వరరావు పళ్ళన్నీ బయటపెట్టి ఇకిలిస్తూ. 'నువ్వే శతాబ్దానికి చెందిన దానివి ?' అని వెక్కిరిస్తున్నట్లున్నాయి అతనినవ్వూ, చూపులూ.

'నేను ఇలాగే అనుకున్నాను కాని ఎక్కి కూర్చుంటే బాగనేవుంది—భయంవెయ్యదు— ఈ రిక్షావాళ్ళతో బేరాలు చేసేబదులూ, బస్సుకోసం గంటలతరబడీ క్యూలోనిలబడే బదులూ, నాప్రాణానికిదే హాయిగావుంది.'

అని ఆవిడ చెప్తూంటే,

'ఏమోబాబూ, నాకుభయం; అలా వెనక కూర్చున్న వాళ్ళని చూస్తేనే నాకు కళ్ళు తిరిగినట్లుంటుంది.' అంది సురేఖ.

'సరే. రిక్షా ఎక్కించి వస్తాను.' అని ముందుకు నడిచాడు కామేశ్వరరావు.

వెనకగా నడుస్తున్న రంగమ్మ, 'మిమ్మ ల్నిద్దర్నీ ఇలా చూస్తూంటే నా ప్రాణం ఎంతో హాయిగా వుందే అమ్మాయి— నేను చెప్పింది ఆలోచించు—నువ్వు కాదనవు నాకు తెలుసు—చూస్తున్నావుగా బావ ఎలా అయిపోయాడో—బాధ మరిచిపోవటానికి వాడివన్నీ అలవాటు చేసుకోటం—ఇవన్నీ చూస్తూ నేనింకా ఎందుకు బ్రతికి వున్నానురా భగవంతుడా అని నేను ఏడవని రోజు లేదనుకో— ఈ సంసారాన్ని గురించి తలుచుకుంటూంటే బాధతప్ప మరేమీ వుండటంలేదు నాకు—వాడికింక మంచి రోజులు వచ్చాయేమో ననిపిస్తుంది.' గొంతులో ఏడుపూ, రవంత ఆశా జోడించి సురేఖ చెవిలో చెప్పినట్లే మెల్లిగాఅంది.

సురేఖకి వంటినిండా కారం రాసు కున్నట్లేవుంది పైకి ఏమీ అనలేక, 'ఛ, ఏమిటిదీ.' అనుకుంటూ ముందుకు చూసింది. అతనికి వినిపించి వుండదులే అని మరోసారి ధైర్యం చెప్పుకుని, అస లావిడ ధోరణిని వినిపించుకోనట్లే తల వంచుకు ముందుకు నడిచింది.

గేటుదగ్గరే ఎదురయింది ఓ ఖాళీరిక్షా.

'ఎంత, ఏమిటి?' అని అడుగుతూ అక్కడ మరోక్షణం అయినా నిలవబుద్ధి కాలేదు.

'హిమాయత్‌నగర్, ఉమెన్సుహాస్టలుకి,' అని చెప్పి ఎక్కి కూర్చుంది.

'తరుచు వస్తూండు.' తల్లీ కొడుకులు మరోసారి హెచ్చరించారు.

రిక్షా నాలుగడుగులు వెళ్ళాక హమ్మయ్య అని వూపిరి పీల్చుకుంది సురేఖ. 'ఇప్పటి దాకా ఎంతభయం వేసిందని. అబ్బ ఏం మనుష్యులు బాబూ.' అనుకుంటూ గుండెల మీద చెయ్యి వేసుకుంది. రంగమ్మగారు బ్రతిమాలి, నవ్వుతూ కేకలేసి, కంచం చుట్టూ వడ్డించినవన్నీ తినిపించినా నాలుగు లంఖణాలు చేసినంత నిస్రాణగా వుంది.

'తాగరాతాగూ,' అంటూ రిక్షా అబ్బి కపక నవ్వటంతో. సురేఖపై ప్రాణాలు



పైనే పోయాయి.

'వచ్చి, వచ్చి, పీడరిక్షా ఎక్కాను—ఇవాళ నేను లేచినవేళ మంచిదికాదు.' అనుకుంది వూపిరి బిగపట్టుకుని.

కాని రిక్షా అబ్బి మాటల ధోరణి చూస్తుంటే అతను ఎవరినో వుద్దేశించి అంటున్నట్లనిపించి చుట్టూ పరికించి చూసింది—కొస్త దూరంలో అటు పేవ్ మెంటు ప్రక్కన లైటు వెలుగులో కని పించిన దృశ్యాన్ని చూసి స్థంభించి పోయింది. రిక్షా ముందుకు వెళ్లిపోయినా ఆ దృశ్యం కళ్లకి కట్టినట్లు కనిపిస్తూనే వుంది

'నాకు వద్దు బాబూ, పదండి పోదాం,' అని బ్రతిమాలుకుంటున్నాడు ఆ రిక్షా అబ్బి.

'ఊ—తాగమంటూంటే...' నాలుక మొద్దుబారిపోయి మాట తడబడుతోంది అందులో వున్న వ్యక్తిది—ప్యాంటూ బుష్ షర్టూ వేసుకున్నాడు—చదువూ ఉద్యోగం వున్నవాడిలాగే వున్నాడు—అయితేనేం, అసలు తన పరిస్థితినే గుర్తించలేని స్థితిలో—సీటుమీద సరిగ్గా కూర్చోటంకూడ చేత కాకుండా సగంసగం క్రిందకి జారిపోతూ చేతిలో వున్నసీసా రిక్షా అబ్బికి చూపించి తాగమని బలవంతం చేస్తున్నాడు—అంతా ఆ మందు ప్రభావం—అది చాలాసేపు వుండదు—తరువాత తెలివి వచ్చాక తను మైకంలో ఎలా ప్రవర్తించాడో ఎప్పుడైనా తెలుసుకుంటే అతనికి సిగ్గు వెయ్యదా—అది తాగి తను పొందిన ఆనందం అసలు ఏమైనా వుంటే అది కాస్తా తన పరిస్థితిని సంస్కారాన్ని మరిచిపోయేలా చేసిందీ అని తెలుసుకుంటే అతనికి దుఃఖం కలగదా—అయినా ఇంకా తాగుతూనే వుంటాడా—ఇదంతా నాగరికతలో ఒక భాగమేనా...'

హాస్టల్ముందు రిక్షాదిగి డబ్బు ఇచ్చేసి తనగదిలోకి వెళ్లిందాకా సురేఖ గుండెలు కుదుటపడలేదు—ఇవాల్టి తన అనుభవం శ్యామలకి చెప్పాలని ఓసారి అని పించినా మళ్లీ ఆ ఉద్దేశ్యం మార్చుకుని బట్టలు మార్చుకుని, కాళ్లు కడుక్కు వచ్చి ప్రక్కమీద ఒరిగింది'

*    *    *

లోపలికి వస్తూనే పూలపొట్లం సురేఖ ఒడిలో విసరి, 'చూడు ఏం తెచ్చానో' అంది శ్యామల.

సురేఖ పొట్లం విప్పిచూసి, 'ఓ—మల్లెమొగ్గలు, థ్యాంక్సు—ఎక్కడకొన్నావు' తృప్తిదీరా వాటి సౌరభాన్ని ఆఘ్రాణించి పొట్లం అక్కడపెట్టి దారంకోసం లేచింది.

'మా రమ ఏదో కొనాలంటే సుల్తాన్ బజారు వెళ్లాంలే—ఇప్పుడిప్పుడే వస్తున్న ట్లున్నాయి, మొగ్గ పీలగావుంది' అని బట్టలు తీసుకుని స్నానానికి వెళ్లింది.

ఆ అమ్మాయి తిరిగి వచ్చేసరికి సురేఖ మాల కట్టటం పూర్తయింది. రెండు ముక్కలుచేసి ఓదండ శ్యామలకిచ్చి మరోటి తన జడలో ముడుచుకుంది—శ్యామల తల దువ్వుకోటం అదీ అయాక—

'ఇక్కడ వుడకపోస్తోంది. డాబామీదకి పోదాం పద' అంది ట్రాన్సిస్టరు చేతిలోకి తీసుకుంటూ.

'మరి కాఫీ తాగవ్?'

'షాపింగు కని బయలుదేరినవాళ్లం మధ్యలో హోటల్లో దూరాంలే—బాసుందీ కట్లెట్టూ ఐస్క్రీమూ పీకమొయ్యా పట్టించాం. ఇప్పుడేం వద్దు' అంది శ్యామల ఆయాసపడుతూ.

మూలనున్న చాప తీసుకుంది సురేఖ. డాబా రోజూ తుడిపించమని చెప్పినా నౌకర్లు ఒకోనాడు బద్ధకం చేస్తూంటారు—మల్లె పువ్వులాంటి ఇస్త్రీ చీరలు కట్టుకున్న

# సురేఖాపరిణయం

అక్కడే కూర్చోవాలంటే మనస్సు ఒప్పదు ఎవరికీ. ఇద్దరూ పిట్టగోడ వార నిలబడి కబుర్లు చెప్పుకుంటున్నారు.

'మామయ్య కారు హారన్‌లా వుంది.' అంది శ్యామల రోడ్డుమీదికి దృష్టి తిప్పుకుని.

ఆ పిల్ల అంచనా తప్పలేదు. మాధవ రావు కారు గేట్లోంచి లోపలికి వచ్చి ఆగింది.

'కార్లో ఎవరో వున్నట్లున్నారు,' సురేఖ మాటలు పూర్తి కాకుండానే తలుపులు తెరుచుకుని దిగిన వాళ్లని చూస్తూ.

'అరే మా దొడ్డమ్మొచ్చింది — అది సరోజ — దొడ్డమ్మ కూతురు.' అనేసి గబ గబ క్రిందికి వెళ్లిపోయింది శ్యామల.

సురేఖ చాప వాల్చుకుని కూర్చుని ట్రాన్సిస్టర్ ఆన్ చేసింది.

అయిదు నిమిషాల్లో శ్యామల ఆ చుట్టాలని కూడ వెంటపెట్టుకుని పైకి వచ్చింది.

'మా రూమ్మేటు సురేఖ.' అని వాళ్లకి, 'చెప్పానుగా దొడ్డమ్మా వాళ్లనీ, ఈ ఉదయమే వూరు నించి వచ్చారుట,' అని సురేఖకి చెప్పింది.

'కూర్చోండి,' అంది సురేఖ చాప చూపిస్తూ.

'ఏదో సినీమాకని బయలుదేరాం — తయారుగా వుండమని శ్యామలకి ఫోను చేస్తానన్నాడు — సరే ఎలాగూ వస్తున్నాం కదా అని చెయ్యలేదు —' అని 'త్వరగా చీర మార్చుకురా — అసలిదీ బాగనే వుంది,' అంది శ్యామలతో శకుంతలమ్మ.

'నేను అన్నం తినేసే వస్తా — భోజనం వుంచొద్దు; అని సురేఖకి చెప్పి వాళ్లని వెంట తీసుకుని వెళ్లిపోయింది శ్యామల. మర్నాడు సాయంకాలం కూడ వాళ్లంతా వచ్చి శ్యామలని తీసుకువెళ్లి మళ్లీ రాత్రి తొమ్మిదిగంటలకి హాస్టల్లో దించేశారు.

మూడోరోజు ఆదివారం — శలవరోజు వస్తే ఏడుగంటలదాకా లేవదు శ్యామల — అసలా అమ్మాయి అదృష్టం ఏమిటో అలా ఎంతసేపయినా నిద్రపోగలదు — మధ్యాహ్నం కాస్త టైము దొరికిందంటే చాలు హాయిగా పడకేసేస్తుంది — ఒక్కోసారి ఆలోచనలతో తల బరువెక్కి రాత్రికూడ నిద్రకి దూరం అయిపోయే సురేఖకి శ్యామల నిద్రచూస్తే కూడ ఇదిగానే వుండేది, 'ఈ పిల్ల చేసుకున్న పుణ్యం ఏమిటో' అని —

మామూలువేళకే మెళుకవ రావటంవల్ల సురేఖ మొహం కడుక్కుని కాఫీ తెప్పించుకు తాగింది. జడ విప్పుకుంటూంటే నరసమ్మ తలుపుతోసి, 'శ్యామలమ్మకి టెలిఫోను వచ్చింది' అంది.

'ఓయ్ — నీకే — వినిపించలే — ఫోన్‌కాలుట' తట్టిలేపింది సురేఖ.

'మామయ్యో అనుకుంటా' అంటూ గబ గబ క్రిందికి పరుగెత్తింది శ్యామల — అయిదునిమిషాల్లో తిరిగివచ్చి. 'వాళ్లంతా నేను హాస్టల్లో వుండను — గోల్కొండ గండిపేట — నెహ్రూపార్కు అన్నీ తిరిగి వస్తాం — ఇప్పుడే కాస్సేపటిలో వస్తారు వాళ్లంతా.' ఉత్సాహంగా చెపుతూ బ్రష్ మీద పేస్టు వేసుకుంది.

'మరయితే త్వరగా తెములు.' శ్యామల జాగు సంగతి తెలిసే హెచ్చరించింది సురేఖ.

అన్నట్లుగానే అరగంట తరువాత వాళ్లు వచ్చేసరికి శ్యామల యింకా తలకి నూనె రాచుకోటంలోనే వుంది — సురేఖ పేపరు చూస్తూ కూర్చుంది.

'ఇంకా ఇలాగే వున్నావుటే,' అంటూ లోపలికి వస్తున్న పెత్తల్లినీ సరోజనీ కూర్చోమన్నట్లు మంచం చూపించి, 'ఒక్క అయిదు నిమిషాలు;' అంటూ హడావిడిగా జడ అల్లేసుకుని స్నానానికి వెళ్లిపోయింది శ్యామల.

వాళ్లతో ఏదైనా మాట్లాడక పోతే బాగుండదన్నట్లు పేపరు ప్రక్కన పెట్టేసి కుదురుగా కూర్చుంది సురేఖ మాటల కోసం వెతుక్కుంటున్నట్లు.

'మా తమ్ముడు రోజూ వస్తాడా,' యధాలాపంగా అడిగినట్లే అడిగింది శకుంతలమ్మ సంభాషణకి వుపక్రమిస్తూ — సరోజ తల వంచుకుని దుప్పటి కొసలు మెలిపెడుతోంది. సురేఖ తెల్లబోయింది. ఆవిడ ధోరణికి. అయినా సమాధానం చెప్పాలి కదా అనిపించి,

'అబ్బే — ఏ నాలుగు రోజులకో ఓసారి వస్తారు' అంది.

'శ్యామలకి ఫ్యాషన్లు మరీ ఎక్కువ — లోపల బాడీల్లాగ ఆజాకెట్లూ, అది సుబ్బరంగా కనిపించేలా ఉల్లిపొరలాంటి చీరలు — అసలా పమిట బుజం మీద నిలవనే నిలవదు కదా — నా పిల్లలే ఇలాంటి వెర్రి వేషాలేస్తే వెన్ను చీరేసేదాన్ని.' ఛీత్కారం చేసింది శకుంతలమ్మ.

'ఏమిటి బాబూ ఈవిడ ధోరణి — శ్యామల వింటే ఏమనుకుంటుందీ.' అని భయపడుతూ గుడ్లప్పగించి చూస్తూ కూర్చుంది సమాధానం చెప్పకుండా — 'అయినా శ్యామల కాస్త ఫ్యాషనుగా తయారయేమాట నిజమే కాని ఈవిడ చెప్పేనంత అన్యాయంగామాత్రం వుండదు — ఈవిడకి తనంటే మంచి అభిప్రాయం లేనట్లుంది — పెద్ద కుటుంబాల్లో ఈ పోల్చి చూసుకోడాలూ, అసూయపడటాలు తప్పవులావుంది' అనుకుంది.

శ్యామల ఏ నిముషంలోనయినా రావచ్చునని ఆవిడకే అనిపించిందేమో 'మీరు వూరంతా చూశారా ?' అంది టాపిక్ మార్చి.

'ఆ ఏదో — ఇంకా గండిపేట వెళ్లనే లేదు — మా కాలేజీవాళ్లం అందరం కలిసి గోల్కొండ వెళ్లొచ్చాం —'

'ఇక్కడే వుంటాం కదా అని అశ్రద్ధ — మాలావున్న నాలుగురోజుల్లో అన్నీ చూసేయాలనే ఆత్రం వుండదు.' మధ్యలోనే అంది సరోజ.

శ్యామల తయారయి వాళ్లు బయలుదేరేసరికి మరో పదినిముషాలు పట్టింది.

'మీరూరండి — కారులో చోటువుంది' అంది శకుంతలమ్మ వెళ్లబోతూ.

'అబ్బే వద్దండీ — నాకసలివాళ లేచిందగ్గరనుంచీ తలనొప్పిగావుంది' అంది సురేఖ.

మరి బలవంతం చెయ్యకుండా వాళ్లంతా వెళ్లిపోయారు.

(ఇంకా ఉంది)



# వీణావాణి

విజయ లలిత

పి. హెచ్. రాజేశ్వరరావు, కొవ్వూరు

ప్ర: ప్రతి సినిమాలోను మీరు చూసే మత్తు చూపులకు ఈనాటి యువతరం తట్టుకోలేకపోతుంది. మీ కళ్లల్లోకి అంత 'మత్తు' ఎట్లా వచ్చిందబ్బా?

జ: **అబ్బ! ఎంత ఆశ; అది దేవ రహస్యం; మీకు యెలా చెప్పడం?**

జువ్వాది నరసింహారావు, పాలకొల్లు

ప్ర: మీరు కొన్ని చిత్రాలలో హీరోయిన్‌గా నటిస్తున్నారని చదివాను; ఏయే చిత్రాల్లో నటిస్తున్నారు?

జ: సురేష్ కంబైన్స్ 'బొమ్మలు చెప్పిన కథ'; 'హేమా మూవీస్' సప్త స్వరాలు', శ్రీ సరస్వతీచిత్ర 'పంచ కళ్యాణి దొంగలరాణి' చిత్రాలు.

పి. వర్షసమ్మ, బైతూరు

ప్ర: పునర్జన్మలో మీకు నమ్మకముంటే, వచ్చేజన్మలో మీరు యేం కావాలని కోరుకుంటారు ?

జ: వచ్చే జన్మంటూవుంటే నేను మగవాడ్నిగా పుట్టి హీరోగా మీ మనస్సును దోచుకోవాలనుకుంటాను. సరేనా !

ఆర్. అప్పలరాజు, అలహాబాదు

ప్ర: మన పెద్దలు 'అందం ఆడదానికి శత్రువు' అంటారు. దానితో మీరు ఏకీభవిస్తారా?

జ: అందం 'స్త్రీ లక్షణం' అనేదే నా అభిప్రాయం.

ఎం. ఎస్. శంకర్రావు, గుంటూరు

ప్ర: మనిషిమీద, మాటమీద నమ్మకం లేకపోతే మనిషిగా బ్రతకడం వ్యర్థమంటాను. మరి తమరేమంటారు?

జ: **మనమీద మనకు నమ్మకం వుంటే జీవితం ధన్యమయి తీరుతుంది అని నమ్ముతున్నాను.**

ముత్యాల వెంకటరమణ, గూడూరు

ప్ర: మీరు ఒక చిత్రానికి దర్శకత్వం వహించి, చిత్రాన్ని నిర్మిస్తే, ఆ చిత్రం బాక్సాఫీస్‌వద్ద 'హిట్' కాగలదని నా అభిప్రాయం?

జ: మీరు పెట్టుబడిపెట్టి చిత్రం నిర్మించి, నన్ను డైరెక్టు చెయ్యమంటే నిరభ్యంతరంగా చేస్తాను.

టి. సుబ్రహ్మణ్యం, గూడూరు

ప్ర : మనుషులు మరణించిన తర్వాత వాళ్లు మిగుల్చుకో గలిగింది మంచి మాత్రమే; అలాంటి మంచిని చేయటానికి ఈ మనుషులు యెప్పవరూ [illegible]?

జ: **ప్రతివాడు కోరి చెడు చెయ్యాలనుకోడు.** పరిస్థితుల ప్రాబల్యంవల్ల కొందరు అలా చెడుదారిని పట్టాల్సి వస్తుంది; ఈ రోజుల్లో 'మంచికి' కాలం యెక్కడిదండి?

యు. రామలక్ష్మి, వెంకటగిరి

ప్ర : ఉత్సాహపరిచే మీ నటన చూసి ఎగిరిపడే మగవాళ్లను, ఏదో ఒకనాడు అన్యాయం చేసి వెళ్తారేమో నన్న భయం...?

జ: ఇప్పట్లో వెళ్లను. ఇప్పటి మగవాళ్లను రాబోయే మగవాళ్లను కూడ అంత తేలిగ్గా వదలను. ●

## —బహుమతి పొందిన ప్రశ్న—

ప్ర. సినీ తారల కోసం కూడా ఒక అందాల పోటీ నిర్వహిస్తే బావుంటుందా!




జ. సినీ తారలు కూడా మనుషులే... గా, పోటీ ఎందుకు పెట్టినా మంచిదే

ఎ. శ్రావణకుమార్... హైదరాబాదు



"అదృష్టవంతులు"లో నాగేశ్వరరావు, జయలలిత, బేబిరాణి.

**చిత్రసమీక్ష:**

# అదృష్టవంతులు

హాలీవుడ్‌స్థాయి తెలుగు చిత్రాల నందించడంలో ప్రథమస్థానం జగపతి పిక్చర్స్ వారికి దక్కుతుంది. తాజా 'అదృష్టవంతులు' చిత్రంలో కొన్ని కొన్ని సన్నివేశాలు, చిత్రీకరణ తెలుగుచలనచిత్ర రంగానికి తలమానికాలై నిలుస్తాయని నిర్మొహమాటంగా చెప్పొచ్చు!

బాండ్ చిత్రాలమాదిరి విలన్‌ని ప్రవేశపెట్టి చిత్రానికి చలనచిత్ర చరిత్రకే కొత్తదనాన్ని సంతరింపజేసింది జగపతి సంస్థ. అలానే, నాగేశ్వరరావు స్వయంగా రైలుమీద పోరాడటం—నటనావైదుష్యానికే కాకుండా ఆయన ధైర్యస్థైర్యాలకి కూడా మచ్చుతునక అయింది. అడుగడుగునా సస్పెన్సుతో ఆఖరి క్లయిమాక్సువరకు ప్రేక్షకులని ఆకట్టుకునే చిత్రమిది.

కథ ఒక నేరస్థుని చరిత్ర. ఒకసారి నేరంచేస్తే పోలీసుల దృష్టిలో అతను ఎల్లప్పుడూ నేరస్థుడుగానే పరిగణింపబడుతున్నాడు. తత్ఫలితంగా నరకయాతన అనుభవిస్తున్నాడు. మానసికంగా చైతన్యం వచ్చినా అతనినంటివున్న 'మచ్చ' భౌతికంగా పతనం చేస్తున్నది. నేరము—శిక్ష — దాని పరిణామము ఈ చిత్రంలో సోదాహరణంగా చూపించాలనే లక్ష్యాన్ని నిర్మాతలు నెరవేర్చుకున్నారు. సమాజంలో నేరస్థునికి గల స్థానాన్ని, అతని మానవత్వానికి గల విలువని ప్రస్ఫుటంచేసి 'నేరస్థుడూ మనిషే' అని నిరూపించ గలిగారు.

ఈ నియమాలు గల చిత్రాలు మనకు కావాలి. అందుకు జగపతి సంస్థ పూనుకుని ప్రయోజనాత్మకంగా రూపించినందుకు అభినందనీయులు. బాక్సాఫీసు దృష్ట్యా మూలసూత్రం కొంత మరుగు పడిపోయినా, ఉత్తమ సంస్కారం చిత్రం ఆద్యంతమూ కనిపిస్తుంది.

కథానాయకుడికి ఎక్కువ ప్రాతినిధ్యమున్న ఈ చిత్రంలో నాగేశ్వరరావు నటన అద్వితీయం. నాగేశ్వరరావులో నిజమైన 'హీరో'ను ఈ చిత్రంలో చూడగల అదృష్టం ప్రేక్షకులకు కల్గుతుంది. కథానాయికగా జయలలిత ఎంత మురిపెంగా, నటిస్తుందో అంతకంటె ముచ్చటగా నటించి ప్రేక్షకులకి ఉత్సాహం కలిగిస్తారు నాగేశ్వరరావు. సూర్యకాంతం, పద్మనాభం, గీతాంజలి, ఛాయాదేవి అందించిన హాస్యం తలుచుకున్నప్పుడల్లా నవ్వు పుట్టించేదిగా నిలుస్తుంది. విలన్‌గా జగ్గయ్య పాత్రోచితంగా నటించి కొత్తదనాన్ని పోషించారు. పోలీసు అధికారిగా గుమ్మడి పాత్రకున్న తక్కువ అవధుల్లోనే చక్కని నటన ప్రదర్శించారు. మిగతా ముఖ్య పాత్రలని రేలంగి, ప్రభాకరరెడ్డి, సత్యనారాయణ, విజయలలిత , సరసంగా పోషించారు.

'ముద్దుముద్దంటే చేదా...' అనే పాట సాహిత్యంలోనూ బాణీలోనూ నేటి పాటల్ని తలదన్నే పాట. మహదేవన్ పసందైన సంగీతానికి ఈ ఒక్క ఉదాహరణ చాలు. వి. మధుసూదనరావు దర్శకత్వంలో ఉత్తమంగా చిత్రీకరించిన 'అదృష్టవంతులు' నిర్మాత వి. రాజేంద్రప్రసాద్. —పీతరాజు

# సినిమా డైరీ

● ఫల్గుణా పిక్చర్స్ 'జగత్కిలాడీలు' ఔట్‌డోర్ షూటింగు జనవరి 15, 16 తేదీలలో మహాబలిపురం సమీపంలో జరిగింది. అయ్యన్‌మూర్తి దర్శకత్వంలో కృష్ణ, వాణిశ్రీ పాల్గొన్నారు. రంగారావు నాయకుడి పాత్రను ధరించే యీ చిత్రాన్ని ఏకామ్రేశ్వరరావు నిర్మిస్తున్నాడు.

● సురేష్ కంబైన్స్ 'బొమ్మలు చెప్పినకథ' యూనిట్ కొడైకెనాల్‌లో అవుట్‌డోర్ షూటింగు ముగించుకుని జనవరి 17 కు మద్రాసుకు చేరుకున్నారు.

● శ్రీరాజ్ ఆర్ట్సు ఫిలింస్ చిత్రానికి సంబంధించిన కొన్ని ముఖ్య సన్నివేశాలను జనవరి 16 నుండి 20 వరకు హంపిలో కె. ఎస్. ప్రకాశరావు చిత్రీకరించారు.

● విఠల్ కంబైన్స్ నిర్మించే జానపద చిత్రానికి సంబంధించిన తొమ్మిదిపాటలు విజయకృష్ణమూర్తి సంగీత దర్శకత్వంలో విజయా గార్డెన్స్‌లో రికార్డు చెయ్యబడ్డాయి. బి. వి. శ్రీనివాస్ డైరెక్టుచేసే ఈ చిత్రంలో జయలలిత ఎన్. టి ఆర్. నాయకీనాయకులు.

● విజయభట్ మూవీస్ నిర్మించే సాంఘికచిత్రంయొక్క షూటింగు జనవరి 18 నుండి సారధి స్టూడియోలో ప్రారంభమైంది. ఈ చిత్రానికి తాతినేని రామారావు దర్శకుడు, నాగేశ్వరరావు నాయకుడు.

● సారధి స్టుడియోస్ నిర్మిస్తున్న చిత్రానికి సంబంధించిన యుగళగీతాన్ని కేరళవద్దనున్న ఒక అందమయిన డామ్ పరిసరాల్లో వి. మధుసూదనరావు చిత్రీకరించారు. నాగేశ్వరరావు వాణిశ్రీ పాల్గొన్నారు. డి. మధుసూదనరావు నిర్మించే ఈ చిత్రానికి రాజేశ్వరరావు సంగీత దర్శకుడు.

# సినిమా

ఈ వారం నా సంచారం ప్రసాద్ స్టుడియోతో ప్రారంభమైంది. నేనువెళ్ళిన స్టుడియోలు. అక్కడ నేను చూచిన షూటింగులను మీకూ తెల్పుతున్నాను.

రామచంద్రరావు పద్మనాభాన్ని రావి కొండలరావు యింటికి పెళ్ళిచూపులకని తీసుకొస్తాడు. పద్మనాభాన్ని కొండలరావు చూస్తాడు.

పద్మనాభం : నమస్కారమండి.

కొండ : కూర్చోండి బాబూ! నీపేరు?

పద్మ : ఎ. బి సి డి. ఎఫ్...అండి.

కొండ : అదేం పేరోయ్; ఏదన్నా ఫైవ్ కంపెనీలో పనిచేస్తున్నావా ఏమిటి?

పద్మ : లేదండి, పూర్తిపేరు అయ్యగారి బాలచంద్ర దిగంబర ఈశ్వర పల్గుణ...

కొండ : బాగుంది బాబు !

కొండలరావు సహధర్మచారిణి రాధా కుమారి మరికొన్ని ప్రశ్నలు వెయ్యసాగింది.

రాధ : ఏం చదువుకున్నావు నాయనా.

పద్మ : కాలేజిలో చేరి మానేసానండి.

రాధ : మానేసి యిప్పుడేం చేస్తున్నావ్ ?

పద్మ : ఉద్యోగం పురుష లక్షణం. అందుకని లక్షణంగా వుద్యోగం చేసుకుంటున్నా.

కొండ : భేష్; బాగా చెప్పావ్! ఓసారి మా అత్తగారు చెప్పినట్లు.

రాధ : అయితే అమ్మా, నాన్న, తోబుట్టువులు.

పద్మ : ఎవ్వరూ లేరండి; ఏకాకిని.

కొండ : ఏకాకి ఏమిటోయ్, మేమంతా లేమూ,

రాధ తన కూతురు రమను పిలుస్తుంది. (ఆ పిలుపుకు కుక్కపిల్ల వస్తుంది) దాని వెనకాలే రమాప్రభ వస్తుంది. పద్మనాభం, రమాప్రభ ఒకర్నొకరు' చూసుకుంటారు.

పద్మనాభం : అత్తగారూ, మామగారూ! ఓ చిన్న విషయం, ఎంతైనా మేము ఆధునికాలం వాళ్ళం గదండి. అందుకని మారుచులు, అభిరుచులు మావి; ఓసారి నేను రమతో ఏకాంతంగా మాట్లాడాలి. అందుకని'... ఈ సన్నివేశం గోపాల క్రిష్ణా పిక్చర్స్ నిర్మిస్తున్న 'కథానాయకుడు' చిత్రంలో మీరూ చూస్తారుగా, పద్మనాభం కోరికను కాబోయే మామయ్య రావికొండలరావు మన్నించాడా; రమాప్రభ, పద్మనాభం యేం మాట్లాడుకున్నారు అనేది విషయాల్ని పైవారం తెల్పుకుందాం. కె. హేమాంబధరరావు దర్శకత్వం వహిస్తున్న యీ చిత్రంలో జయలలిత, రామారావు నాయకీనాయకులు. ముళ్ళపూడి కథకు భమిడిపాటి సంభాషణలు కాఫీకి చక్కెరలా కుదిరాయి; అర్జును కృష్ణ. సంగీతాన్ని రాజా, కెమెరాను స్వామి నిర్వహిస్తున్న యీ చిత్రాన్ని గోపాల క్రిష్ణ నిర్మిస్తున్నాడు. ఈ చిత్రం ఫిబ్రవరినెలలో పూర్ణాపిక్చర్స్ద్వారా విడుదల కాగలదని వూహించ బడుతుంది.

* * *

ప్రసాద్నుండి ఎ. వి ఎం.కు వెళ్ళాను. మొదటిఫ్లోర్లో బాలాజీఫిలింస్ షూటింగు జరుగుతున్నట్టు తెలిసి లోపలికెళ్ళాను. నేను వెళ్ళిన సమయానికి రాజసులోచన, శోభన్బాబులు పరస్పరం మాట్లాడుకోవడాన్ని చూచాను. శోభన్ ముఖంలో నిరాశ, నిస్పృహలు, రాజసులోచన వదనంలో అమాయకత్వంతో కూడిన వినయం, వివేకం గోచరించింది: వీళ్ళిద్దరూ యిలా చర్చించుకునే సమస్యను తెల్సుకుందామని కాస్తదగ్గరగా వెళ్ళాను, నా ప్రక్కనేవున్న బి. ఎల్. ఎన్. ఆచార్యను ఏమిటిది అని అడిగాను. ఆయన చెప్పినదాన్ని మీకు తెల్పుతున్నా.

ఎస్. వి. రంగారావు, రాజసులోచన అన్నా, చెల్లెళ్ళు; తన చెల్లెల్ని అల్లారుముద్దుగా చూచుకుంటూ వుంటాడు రంగారావు: ఆమె యేం కోరినా కాదనలేడు రంగారావు; వాళ్ళ ఎస్టేటు మేనేజరు శోభన్బాబు; చురుకయినవాడు; అందగాడు అయిన శోభన్కు రాజసులోచన మనసిచ్చింది; ఇద్దరూ తియ్యటికలలు కంటారు: ఇలా యెన్నాళ్ళు వుండడం, మన పెళ్లి వెంటనే జరగడం మంచిదని యిద్దరూ భావిస్తారు, నేను యేం చేసినా మా అన్నయ్య మెచ్చుకుంటాడు, నా మనస్సును వుల్లాస పరచడమే మా అన్నయ్యకు ముఖ్యం; 'బాగా చదువుకున్నవాడు, అందగాడు, మన అంతస్తుకు తగ్గవాడు యెవడయినా సరే నీ మనస్సును దోచుకుంటే నీ యిష్టానికి అడ్డం వుండదమ్మా' అని మా అన్నయ్య నాతో చాలాసార్లు అన్నాడు అని శోభన్తో రాజసులోచన అంటుంది. ఏమిటి, అంతస్తా, నీ వెక్కడ ? నే నెక్కడ ? నాగలోకానికి,



'అన్నదమ్ములు'లో కొత్తనటుడు నాగరాజు, కొత్తనటి సుమ.



'భలేఅబ్బాయిలు'లో గీతాంజలి, రామ్మోహన్.

నక్కకు సామ్యం యెలా కుదురుతుంది; ఈ విషయం మీ అన్నయ్యకు తెలిస్తే పెళ్ళి కాదుగదా తగిన శాస్తి జరుగుతుంది; ఇక మనిద్దరం భగ్న ప్రేమికులుగా విడిపోవల్సిందే అంటాడు శోభన్.

ఈ సన్నివేశంలో దర్శకుడు సి. ఎస్. రావు ఆర్టిస్టుల వద్దనుండి చక్కటి ఫలితాన్ని పొందగల్గాడు. ఈ చిత్రానికి మూలం తిరుమారన్ వ్రాసిన 'కిల్లర్ నరసింహన్', తెలుగులో సంభాషణలను చక్కటి శైలిలో బి. ఎల్. ఎన్. ఆచార్య వ్రాసాడు. సంగీతాన్ని రాజేశ్వరరావు నిస్తున్న యీ చిత్రంలోని ముఖ్య పాత్రలను రంగారావు, శోభన్‌బాబు, రాజసులో

## సినిమా

చన, విజయనిర్మల, చలం, రమాప్రభ, బాలకిష్ణ, విజయలలిత పోషిస్తున్నారు. సి. ఎస్. రావ్ దర్శకత్వం వహిస్తున్న యీ చిత్రాన్ని కోటపాటి మునయ్య, పి. కె. రామయ్య, జె. ఎస్. హుసేన్ నిర్మిస్తున్నారు. 'ఆటబొమ్మలు' నిర్మాతల్లో ఒకరయిన టి. నరసింహారెడ్డి సమర్పించే యీ చిత్రం ఎ. వి. ఎం. స్టుడియోలో శరవేగంతో తయారౌతుంది.

* * *

ఎ. వి. ఎం. నుండి వస్తుంటే నేపథ్య గాయిని సుశీల కారు విజయా గార్డెన్స్‌లోకి వెళ్ళడాన్ని చూచాను. నేనుకూడా గార్డెన్స్‌లోకి వెళ్ళాను. అప్పుడే టి. వి రాజా తన సహాయకుడు విజయా కృష్ణమూర్తితో పాటకు వుపయోగించవలసిన వాయిద్యాలను గురించి మాట్లాడుతూ వున్నాడు; నన్ను చూడగానే యిద్దరూ 'రండి రండి మీరు రాకపోతే యివాళ మిమ్మల్ని యెలాగయినా రప్పించాలనుకున్నాం' అన్నారు. ఏమిటి విశేషం అని అడిగాను. 'ఈ రోజు సుశీల పాడబోయేపాటను మీరు వినితీరాలి' అన్నారు. ఇలా ఒక ప్రక్క మా సంభాషణ కొనసాగుతూ వుంటే, వాయిద్యాల విజృంభణ



'దేవుడిచ్చిన భర్త'లో జ్యోతిలక్ష్మి.

మరో ప్రక్క మనస్సును యెక్కడికో తీసికెళ్ళింది. టి. వి. రాజా 'రెడీ' అనడం, సుశీల తన కోమలకంఠాన్ని విప్పి పాడడం ప్రారంభమైంది. ఆమె యేం పాడిందో మీకూ తెలుసుకోవాలని వుంటుందిగా.

నలుగురు నవ్వేరురా! గోపాలా
నడివీధిలో నాకడ కొంగులాగిన...
చల్ల చిలికేవేళ చక్కిలిగిలిచేసి
దండలల్లేవేళ రెండు కళ్ళామూసి
ఒంటిగ యేమన్న ఊరకుంటినిగాని
రచ్చపట్టున నన్ను రవ్వచేయ పాడి
కాదు లేరా! ...నలుగురు

ఈ పాట శ్రీ రాజ్ ఆర్టుఫిలింస్ నిర్మి



'బంగారుపంజరం'లో వాణిశ్రీ, శోభన్ బాబు.

స్తున్న తొలి చిత్రంలో మీకు విన్పిస్తుంది. ఈ పాట చిత్రీకరణకు షుమారు సలభై వేల రూపాయలు ఖర్చు గావచ్చునని అంచనా వెయ్యబడ్డావుంది. కె. ఎస్. ప్రకాశరావు దర్శకత్వంలో తయారౌతున్న ఈ చిత్రాన్ని సుంకువల్లి నిర్మిస్తున్నాడు.

* * *

గార్డెన్సులో పాటవిని వచ్చేసరికి సరిగ్గా ఒంటిగంట అయింది. కడుపు 'క్యావ్ క్యావ్' అనేసరికి గీతాలో భోజనం ముగించుకున్నాను. ఒక అరగంట విశ్రమించి ఆ పైన నా కాళ్లను వీనస్ స్టూడియోకి పోనిచ్చాను. ఆ రోజు అక్కడ 'భలే అబ్బాయిలు' షూటింగు మాత్రమే జరుగుతూ వుంది. సెట్టునుండి కమ్మటిపాట విన్పించింది. ఆ పాట మీనోట విన్పడేందుకు యింకా టైం పడుతుంది గదా. ఇప్పటికి ఆ పాటయొక్క సాహిత్యాన్నిమాత్రం తెల్పుతున్నాను.

పదవే పోదాము
పల్లెటూరికి మనము
బస్తీకి తెచ్చి నన్ను
బాధల పాల్జేశావు.

వదరా మామయ్యా
పల్లెల్లో ఏముంది
ప్రతిరోజు తన్నుకోను
పార్టీల గొడవుంది.

సుశీల, ఘంటసాల పాడిన యీ పాటకు రేణు, రాములు తమ అభినయ కౌశలంతో పాటయొక్క ఔచిత్యాన్ని కళ్లకుకట్టినట్లు చూపించారు. ఒకరికి బస్తీ జీవితంపై అనక్తి, మరొకరికి పల్లెవాసంలో అనురక్తి. ఇక్కడ (బస్తీలో) వుండే కలిగే సదుపాయాలను రేణు విడమర్చి చెపితే, పల్లె జీవితపు సౌఖ్యాన్ని రాము విశదపరుస్తాడు. ఈ పాట 'భలే అబ్బాయిలు' చిత్రంలో యే సందర్భంలో వినిపిస్తుందో మీకు చెప్పాలిగా. గుమ్మడి వెంకటేశ్వరరావు కుమారుల జన్మదినోత్సవ సందర్భంగా యీ నృత్యనాటిక యేర్పాటు చెయ్యబడుతుంది. పేకేటి శివరాం దర్శకత్వంలో సర్వజనరంజకంగా తయారౌతున్న యీ చిత్రాన్ని తోట సుబ్బారావు నిర్మిస్తున్నాడు. పినిసెట్టి రచన, ఘంటసాల సంగీతం, చిట్టిబాబు కెమరా నిర్వహిస్తున్న యీ సాంఘిక చిత్రంలో విజయ, గీతాంజలి. కృష్ణ, కృష్ణంరాజు, రాంమోహన్, గుమ్మడి, ధూళిపాళ, సత్యనారాయణ. ఛాయాదేవి ముఖ్య పాత్రలను ధరిస్తున్నారు.

*  *  *



'ఇందిపోటు దొంగలు'లో నాగేశ్వరరావు.

# సినిమా

వీనస్‌నుండి యింటికి వస్తూ పోయస్ రోడ్డులో వున్న గీతాంజలి యింటికి వెళ్లాను. అప్పుడే ఆమెకూడ కారుదిగి యింట్లోకి వెళ్లింది. ముఖం అంతా వాడిపోయివుంది; తలవెంట్రుకలు గజిబిజిగ ముఖంపైకి పడివున్నాయి. ఏమిటమ్మా. వంట్లో బాగోలేదా అని గడిగాను. అబ్బే, కాదండి: యిప్పుడే కొడైకెనాల్‌నుండి వస్తున్నాను. ప్రయాణ బడలికవల్ల యిలా వున్నాను అంది. మీకు అభ్యంతరం లేకపోతే అక్కడ జరిగిన విశేషాలను చెప్పగలరా అని ప్రశ్నించాను. ఓ, ఎస్ అంటూ చెప్పసాగింది. 'బొమ్మలు చెప్పినకథ' షూటింగుకోసం నేను, కృష్ణ వెళ్ళాము కృష్ణను ఏడిపించేపాట నొకదాన్ని దర్శకుడు విశ్వనాథం చిత్రీకరించాడు. మీరు పాడినపాట జ్ఞాపకం వుందా? వుంటే చెప్పండి అని అడిగాను.

జోడునీవే నాతోడు
రమ్మని అంటే పలకవు
వదలను యీవేళ నిన్ను

వదలను నిన్ను అంటూ కృష్ణను కవ్విస్తూ, ప్రేమించమని అర్థిస్తాను. మా షూటింగు చూడడానికి కొందరు దొరలు వచ్చారు. వాళ్ళ కండల దేరిన బలాఢ్యులు— వాళ్లను చూపినప్పుడు 'చిలకడ దుంప' జ్ఞాపకం వచ్చింది. మనస్సులోని మాట పెదవివెంట వచ్చేసింది. 'ఏమిటి, అంటున్నావ్' అన్నాడు ఒకదొర. అమ్మ బాబోయ్ వీళ్లకు తెలుగు అర్థమయ్యేట్టుందే, మరే

# మీకు తెలుసా?

పద్మశ్రీ శివాజిగణేశన్‌వద్ద ఒక బంగారు తాళపుచెవి వుంది. అతడు అమెరికా వెళ్లినప్పుడు నయాగర మేయరు దాన్ని యిచ్చాడట.

జయలలిత సినిమా పరిశ్రమకు జీవనాడిలాగా వుంది. నాగేశ్వరరావు, రామారావు, శివాజి, ఎం. జి ఆర్, రవిచంద్రన్, జయశంకర్‌లతో నటించే యేకైక కథానాయిక ఈమె ఒక్కతే

నటుడు టి. ఎస్. ముత్తయ్యకు స్టుడియోలోకి వెళ్లేటప్పుడుగాని, స్టుడియోనుండి తిరిగి వచ్చేటప్పుడు పాదరక్షలను వదిలిపెట్టి, భూమాతకు సాష్టాంగ నమస్కారం చెయ్యడం అలవాటని తెలుస్తూంది.

రాగిణి రిక్రియేషన్ నాటకాలకు సంగీతాన్ని వినిపించే కుమార్ ప్రస్తుతం సినిమాలకు కూడ సంగీతాన్ని సమర్పిస్తున్నాడు. అలాగే రేఖా అండ్ మురళీ ఆర్ట్సు నాటకాలకు సంగీత దర్శకుడిగా వుండిన కోదండపాణి యిప్పుడు ప్రముఖ సినీ సంగీత దర్శకుడిగా ప్రశంసలందుకుంటున్నాడు

ప్రముఖ నటి కె ఆర్. విజయ అసలు పేరు దైవనాయకి అని మీకు తెలుసా?

రాజకపూర్ నిర్మిస్తున్న 'మేరా నామ్ జోకర్' హిందీ చిత్రంలో పాల్గొనడానికై ఒక పెద్ద సర్కస్ కంపెనీ తీసుకురాబడింది. ఈ కంపెనీకి కొన్ని లక్షలు ఖర్చవుతూ వుందట.

వహీదారహ్మాన్‌కు ప్రతిదినం అసంఖ్యాకమయిన పుత్తరాలు అభిమాన ప్రేక్షకులవద్దనుండి వస్తాయట అవన్నీకూడ చిన్నపిల్లల వద్దనుండి, వయస్సుమళ్లిన వారివద్దనుండి వస్తున్నాయట.



తప్పక చూడండి!
గౌరి ఆర్ట్ ఫిలిమ్స్
దేవుడిచ్చిన భర్త
నిర్మాణ: క. భావనారాయణ దర్శకత్వం: పద్మరాజు
పూర్ణా రిలీజ్
NAVRANG



'బొమ్మలు చెప్పిన కథ'లో కృష్ణ, గీతాంజలి.

దయినా పూతపదం వాడివుండే యీ పాటకి నా వీపు విమానంమోత మ్రోగుండేదే నని కృష్ణతో అన్నాను' అంది గీతాంజలి. ఆమెను చూస్తే జాలివేసింది. ఆమెను మరి మరి విసిగించడం యిష్టంలేక సరే వస్తానంటూ బయల్దేరాను. నేను ఎల్డామ్స్ లాడ్జ్‌ని చేరుకునేసరికి టాక్సీ ఒకటి రాసాగింది. ఆ టాక్సీని ఆపి అడయారుకు పోనివ్వమన్నాను.

*   *   *

అడయారులోని ఫగ్స్‌రోడ్డులో అంజలీదేవి బంగళావుంది; గేటు తోసుకుని యింట్లోకి వెళ్ళేసరికి వరండాలో సహకార దర్శకుడు శేఖర్ కన్పించాడు; అంజమ్మ వున్నారా అని అడిగాను. లేదంటే,

## సినిమా

గోల్డెన్‌కు వెళ్ళింది; ఆదినారాయణ వున్నారు, కల్సుకుంటారాలని నన్ను మేడపైకి తీసికెళ్ళాడు. ఇద్దరం కుశల ప్రశ్నలు వేసుకున్న తర్వాత అసలు విషయాన్ని లేవదీసాను. మహాకవి క్షేత్రయ్యను నిర్మిస్తున్నారా? అని అడిగాను 'లేదు. యిప్పట్లో కుదరదు. అందుకే రెండు సాంఘికాలను తయారు చెయ్యడానికి ప్రిపేర్ అవుతున్నాను' అని చెప్పి 'ఒకదాన్ని మార్చిలో చిన్న తారాగణంతో ప్రారంభిస్తాను. మరొకదాన్ని నాగేశ్వరరావుతో సెప్టెంబరులో మొదలెట్టాలనుకుంటున్నాను. అది యిప్పటి ప్లాను. మనం నిమిత్తమాత్రులం! అంతా ఆ భగవంతుడిచేతుల్లో వుంది' అని ముగించాడు. 'మొదటి చిత్రంలో మాతృత్వంయొక్క వైశిష్ట్యం కథాంశంగా వుంటుంది. రెండవ చిత్రంలో బిగువయిన కథాగమనం + సరస సంగీతం ప్రధానాంశంగా వుండగలదు' అని కూడా చెప్పాడు. భోజనానికి వేళ అయ్యేసరికి వస్తానండీ అని చెప్పి టాక్సీని పాండీబజారుకు మరలించాను.

*   *   *



శ్రీరాజ్ ఆగ్రా ఫిలింస్‌లో షీలా, శోభన్‌బాబు.

భోజనం ముగించుకుని హబిబుల్లా రోడ్డుకు వెళ్ళాను. అప్పుడే గుమ్మడి కారు వచ్చి ఆగింది. రండి, కాస్త పులిహోర తినండి అంటూ లోపలికి పిల్చుకుపోయాడు. నేను విలేఖరినిగదా. నా నోరు వూరకవుండదుగా. 'మీ ప్రోగ్రాము కాస్త చెప్తారా?' అని ప్రశ్నించాను. 'జనవరి 15వ నెల్లూరు ఫిలిం జర్నలిస్టు అసోషియేషన్ నిర్వహిస్తున్న నాటక, నాటిక పోటీలకు అధ్యక్షత వహించడానికి (యిహాలోజేనన్నమాట) వెళ్తున్నాను, 16,



'సత్తెకాలపు సత్తెయ్య'లో బేబీ రోజారమణి, విజయలలిత, చలం.

17 వెళ్ళగా షూటింగువుంది. 19 కి వరంగల్‌కు వెళ్ళి అక్కడ ఫిలింప్రేక్షక సంఘానికి ప్రారంభోత్సవంచేసి 20 న మద్రాసుకు వచ్చి శ్రీ దేవి షూటింగులో పాల్గొని 21 కి హైద్రాబాదుకు వెళ్తున్నాను' అన్నాడు. 'హైద్రాబాదులో ఎన్ని రోజులుంటారు?' అని అడిగాను. 'ఇక పై నెలకి 20 రోజులు అక్కడే వుండాల్సి వస్తుంది. పి. ఎ.పి, విజయభట్, చిత్రాల షూటింగు ప్రతినెలా జరుగుతున్నాయిగా' అన్నాడు. థ్యాంక్స్; వస్తానని చెప్పి ప్రక్కనేవున్న జగపతి ఆఫీసులోకి అడుగు పెట్టాను.

* * *

'అదృష్టవంతులు' చిత్రం పూర్వపు బాక్సాఫీస్ కలెక్షన్ రికార్డులను అధిగమించినందుకు నా అభినందనలు నిర్మాత రాజేంద్రప్రసాద్‌కు తెల్పాను. 'తర్వాతి కార్యక్రమం ప్లాన్ చేస్తున్నారా?' అని ప్రశ్నించాను. అయామ్‌రెడీ విత్ ది సబ్జెక్టు: మరి ఆర్టిస్టు కాల్‌షీట్లు సర్దుబాటు అయితే వెంటనే మరో చిత్రాన్ని ప్రారంభిస్తాను' అన్నాడు. రాజేంద్ర ప్రసాద్.

* * *



'కథానాయకుడు'లో జయలలిత, రామారావు.

# నాట్యతార కళ్యాణి

కూచిపూడి నృత్యాన్ని సుశిక్షితంగా అభినయించే నేర్పును ఓర్పుతో నేర్చుకున్న కుమారి కళ్యాణి అతిత్వరలో ఆంధ్రప్రదేశ్ అంతటా తన నృత్యకళాభినయంతో ప్రేక్షకుల్ని ముగ్ధుల్ని చేసేందుకు సంసిద్ధురాలౌతుంది. అందుకే ప్రతిరోజూ యింట్లో ఉదయం, సాయంకాలం ప్రాక్టీసు చేస్తున్నానండీ అంది. శ్రీ ఎం. జి. ఆర్, జగ్గయ్యల సమక్షంలో అరంగేటం జరిపి తన నృత్యంతో వారిని మైమరపించి విజ్ఞుల ప్రశంసలనందుకుంది. దేముడిచ్చిన వరంగా భావించి తన నాట్యకళా కౌశలాన్ని మీ అందరికీ అగుపర్చి, మీ ఆశీర్వాదాన్ని అభిమానాన్ని పొందాలనుకుంటుంది. 'అరంగేట్రం' చేసిన రోజున ప్రేక్షకులు ఆమె 'భామాకలాపం' చేస్తూ ప్రదర్శించిన అభినయానికి హాలు దద్దరిల్లేట్టు హర్షధ్వానాలను, కరతాళ ధ్వనులను చేశారు.



కళ్యాణి.



'సప్తస్వరాలు'లో విజయలలిత.

నటనకన్నా నాట్యంలో శ్రద్ధ ఎక్కువ చూపాలి. లేకపోతే ప్రేక్షకుల్ని ఆకట్టుకోవడం కష్టం అంటుంది కళ్యాణి... కూచిపూడి మాత్రమేగాక కథక్, జానపదం, భరతంలో తనే యింటిదగ్గర సాధన చేస్తున్నానంది.

నాట్యంలోనేగాక నటనలోకూడ ప్రావీణ్యత ను కనబర్చే శక్తివున్నా, నిర్మాతలు, దర్శకులు తగిన ప్రోత్సాహం కనబర్చక పోవడం ఆశ్చర్యంగానే వుంది.

—శ్రీనివాస్

# ఆ పీ - యి పీ...

## డిల్లీలో సంక్రాంతి సంబరాలు

తెలుగు సాహితీ సభ్యులు ఢిల్లీలో సంక్రాంతి వేడుకలు ఘనంగా జరుపుకున్నారు. ఆచార్య గంటిజోగి సోమయాజులుగారు సంక్రాంతి పండుగ విశేషాన్ని వివరించారు. బాలాంత్రపు రజనీకాంతరావు, వాకాటి పాండురంగారావు మహీధర నళినీమోహనరావు, ఇలపావులూరి పాండురంగరావు, రవినూతల సత్యనారాయణ మొదలైనవారు కావ్యగానం చేశారు. శ్రీయుతులు మోతీలాల్, వమిడి ముక్కల రామారావు, రాజారెడ్డి బృందం వివిధ వినోద ప్రదర్శనలతో సభికులని ఆనంద పరిచారు. ఆంధ్రప్రదేశ్ సమాచారశాఖ డాక్యుమెంటరీ ప్రదర్శించారు. తెలుగు సాహితి సెక్రటరీ నళినీమోహన్ వందన సమర్పణతో సభ ముగిసింది.

## ఉగాది కల్చరల్ అకాడెమీ

పేరుకు ఉగాది కల్చరల్ అకాడెమీగాని ప్రతి తెలుగు పండుగనీ ఘనంగా జరిపే సాంస్కృతిక సంఘమిది. రెండురోజుల సంక్రాంతి వేడుకల కార్యక్రమం అందుకొక ఉదాహరణ. ఇంటర్నేషనల్ ఆర్కెస్ట్రా బృందం లలిత సంగీత కచేరీ, కుమారి బి. ఆర్. లత, శ్రీ బి. బసవేశ్వర్, శ్రీ కె. వెంకటావుల పాటకచేరీ ఒక ప్రత్యేక ఆకర్షణగావున్న ఈ కార్యక్రమాలలో— బి. కామేశ్వరి, వెంకటజోగారావు, బేబీ అవంతి మాస్టర్ ప్రవీణ్ నృత్యమూ శ్రీ పూర్ణచంద్రరావు పాప్ సంగీతం వైబ్రేషన్సు ప్రేక్షకులను బాగా అలరించాయి. కార్యదర్శి యమ్.సి. యస్. గుప్తా కృషి ప్రశంసనీయం.

## చిల్డ్రన్ గార్డెన్ స్కూలులో కూచిపూడి నాట్యశాఖ

మైలాపూరులోని చిల్డ్రన్ గార్డెన్ స్కూలులో కొత్తగా కూచిపూడి శాఖని ప్రారంభించారు. డాక్టర్ పి. వి. రాజమన్నార్ ఈ శాఖ ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించారు. పద్మశ్రీ బాలసరస్వతి ప్రారంభోత్సవం చేస్తూ నిర్వాహకులు శ్రీ శర్మ దంపతుల ఔదార్యాన్ని ప్రశంసించారు. ఈ సందర్భంలో నాట్యాచార్యులు శ్రీ వసుమర్తి వేణుగోపాల క్రిష్ణశర్మగారిని సత్కరించారు. తదనంతరం చిరంజీవి భవాని, వసంతలక్ష్మి, శ్రీ నరసింహాచారి కొన్ని నృత్యరీతులని ప్రదర్శించారు.

## నాటక రచనపోటీ

దక్షిణ ఇలినాయ్ విశ్వవిద్యాలయం గాంధీ మహాత్ముని గురించి నాటకరచనల పోటీని ఏర్పరుస్తున్నారు. బహుమతి విలువ 4,500 డాలర్లు (రు. 33,750) అమెరికాలో నిర్వహింపబడుతున్న ఈపోటీలో ఏదేశ రచయితలైనా పాల్గొనవచ్చు. నాటక రచన ఇంగ్లీషులో మాత్రమే వుండాలి. 1969 అక్టోబరు 2న జరిగే మహాత్ముని శతజయంతి ఉత్సవాల భాగంగా ఈ పోటీని ఏర్పాటుచేస్తున్నారు. అముద్రిత రచనలు 1969 ఆగస్టు 1 లోపల చేరాలి. వివరాలకు శ్రీ ఆర్చి బాల్డ్ మెక్లియాడ్, చైర్మన్, థియేటర్ డిపార్ట్మెంట్, సదరన్ ఇలినాయ్ యూనివర్సిటీ, కార్బన్డేల్, ఇలినాయ్, యు. ఎస్. ఏ, 62901'కి రాసి పొందవచ్చు.

## శ్రీ పోతుకూచి సాంబశివరావు

అఖిలభారత తెలుగు రచయితల ప్రధానకార్యదర్శి శ్రీపోతుకూచి సాంబశివరావు మారిషస్ వర్యటించి వచ్చారు.

## రసనాలయ కళాపరిషత్తు

కొవ్వూరుపట్టణంలో కొత్తగా ప్రారంభించబడిన "రసనాలయ కళాపరిషత్తు" ఆధ్వర్యమున 1969 మే నెల 6వ తేదీనుంచి 10వ తేదీ వరకు నాటకముల పోటీలు, స్వర్గీయ బందా కనకలింగేశ్వరరావుగారి స్మారకార్థము ఏకపాత్రాభినయ పోటీలు భారీ ఎత్తున జరుపుటకు కార్యవర్గంవారు తీర్మానించారు.

ఈ పోటీలలో ఆంధ్రప్రదేశ్ లోగల అవుత్సాహిక సమాజములవారు, ప్రవాసాంధ్ర నాటక సమాజముల వారు పాల్గొనవచ్చును.

బహుమతులు మొత్తం 4 రోలింగు షీల్డులు, 13 పెర్మనెంటు షీల్డులు, రు 116లు నగదు బహుమతి యివ్వబడుటయే గాకుండా స్క్రూటినీలో ఎన్నిక చేయబడి పోటీలలో ప్రదర్శింపబడిన ప్రతి నాటక ప్రదర్శనమునకు నగదుగా రు 58లు మరియు మెరిట్ సర్టిఫికెట్లు పరిషత్తువారు యిచ్చి కళాకారులను ప్రోత్సహించుటకు నిర్ణయింపబడినది.

నాటక సమాజములనుండియు, ఏకపాత్రాభినయ పోటీదారులనుండి దరఖాస్తు ఫారములు చేరుటకు 1969 మార్చి 10వ తేదీ ఆఖరు తేదీగా నిర్ణయింపబడినది.

దరఖాస్తు ఫారములకు, నిబంధనావళికి యితర వివరములకు— శ్రీ వాడ్రేవు గవర్రాజు, కార్యదర్శి— రసనాలయ కళాపరిషత్తు, కొవ్వూరు —పశ్చిమ గోదావరిజిల్లాకు వ్రాసి పొందవచ్చును.



రచయిత శ్రీ ఆదివిష్ణుకు గుంటూరులో సన్మానం జరిగింది. శ్రీ వి. వి. నరసింహారావు, అధ్యక్షత వహించిన శ్రీ సి. వి. యస్. ధన్, పెద్దిభొట్ల సుబ్బరామయ్య సన్మానగ్రహీత శ్రీ ఆదివిష్ణు ఈ ఫోటోలోవున్నారు. సన్మానాన్ని పురస్కరించుకుని అతిథి, ఆశ్రయం. రెండు నాటకాల్ని హృద్యమంగా ప్రదర్శించారు.

# పుస్తకాలు

## ఎమెస్కో పుస్తకసమీక్షపోటీ

ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్ వారు విడుదల చేసిన 50 ఎమెస్కో పాకెట్ బుక్స్‌మీద పుస్తక సమీక్ష పోటీ ఒకదానిని ఏర్పాటు చేశారు. ఈ పోటీలో మొత్తం 474 పాఠకులు పాల్గొన్నారు. డా. యస్. వి. యస్. రావ్ (మైసూరు) గార్కి మొదటి బహుమతి లభించింది. రెండవబహుమతి శ్రీ చంద్రకాంత్ (వరంగల్)కి, మూడవ బహుమతి శ్రీమతి పోలేటి ఇందిరాదేవి (రాజమండ్రి)కి లభించాయి. మరో పన్నెండుగురికి కన్సొలేషన్ బహుమతులు వచ్చాయి. బహుమతులు పుస్తకరూపంలో ఇచ్చారు.

## అష్టదిగ్గజములు

అష్టదిగ్గజములు ఎనమండుగురినీ సవివరంగా పొందు పరచిన పుస్తకం. రచయిత శ్రీ కపులూరు ఆదినారాయణ శర్మ, 88 పేజీలు. రెండు రూపాయలు. శ్రీనివాసా పబ్లికేషన్స్, వర్రెగూడెం, మచిలీపట్నం.

## వాంటెడ్ ఫాదర్స్

నాటిక. శ్రీ ఆదివిష్ణు కలం నుంచి వెలువడిన ఈనాటిక అఖిలాంధ్ర ప్రశంసల నందుకొన్నది. నవోదయ పబ్లిషర్స్‌వారు ముచ్చటగా అచ్చువేశారు. 47 పేజీలు వెల రూపాయి. నవోదయ పబ్లిషర్స్, ఏలూరు రోడ్, విజయవాడ—2.

## ప్రేమపంజరం

నాటిక. నలుగురు నటులతో నడిచిన సాంఘిక నాటిక ఇది. రచయిత శ్రీ సుదర్శనమ్. 68 పేజీలు. రు. 1—25. ప్రతులకు కళానిలయం, సత్యనారాయణపురం, గుడివాడ.

## దగాపడ్డ తమ్ముళ్లు

స్త్రీ పాత్రలేని హాస్య నాటిక. అయిదు పాత్రలు. రచయిత కె. ఎస్. కె. వెంకటేశ్వర్లు. 30 పేజీలు. రు. 1—50. సీతాశంకర్ పబ్లికేషన్స్, సీతారామ నివాస్, 71 మునిసిపల్ కాలనీ, మలక్‌పేట, హైదరాబాదు—36.

## అతకని బ్రతుకులు

సాంఘిక నాటకం. 'సస్పెన్సుతో కూడిన సాంఘిక నాటకం' అనికూడా అట్టమీదే ముద్రించారు. రచన ప్రయాగ రంగశర్మ, కథ గూడూరి శివరామకృష్ణ, 6 రంగాలతో కూడిన ఈ పుస్తకం 149 పేజీలు. వెల రు 2—50. ప్రతులకు రచయితపేర ఐ. భీమవరం, వయా ఆకివీడు, భీమవరం తాలూకా.

## శ్రీదేవీస్తుతి కదంబము

పద్యకావ్యము. భక్తిరస ప్రధానమైన కందపద్య రచన. రచయిత్రి కొత్తపల్లి లక్ష్మీకామేశ్వరమ్మ. కవిత్వంలో మనోహరమైన భక్తిభావం పొడసూపుతుంది శబ్ద ప్రయోగములలోగాని, జాతీయములను ఉపయోగించుటలోగాని ఎంతో సరసత విజ్ఞత కనపడుతుంది.

తకధిమి తకధిమియనుచును
చకచక మద్వ్యాగ్విలాస సంపత్తికిదో
డౌకనృత్య గీతిపద్ధతి
వికసింపగఁ జేయుమమ్మ వేడుకరాణి!

వంటి పద్యాలు రచయిత్రి భావనావేగానికి ప్రజ్ఞకి దర్పణాలు. ప్రతిపద్యంలోను సహజమైన ధారావాహిని, పాండిత్య ప్రకర్ష తొంగిచూస్తుంది. ఆదర్శ గృహిణిగా వుంటూ ఇంతటి పాండిత్యాన్ని సంతరించుకున్న కవయిత్రి శ్రీమతి కొత్తపల్లి లక్ష్మీకామేశ్వరమ్మ ఎంతయినా ప్రశంసనీయురాలు.

మొత్తంపేజీలు సుమారు 140. అందులో అంబ దండకంతో కలిపి 52 పేజీల్లో మాత్రం కథా వస్తువున్నది. మిగతా పేజీలన్నీ ప్రశంసాపరంపరలతో నిండిపోయాయి. అంతటి ప్రశంసలకి తగిన కావ్యమే ఇది. వెల మూడు రూపాయలు ఎక్కువనిపించక పోదు. ప్రతులకు విశ్వేశ్వర గ్రంథమాల, బహుబలేంద్రుని గూడెం, వయా గన్నవరం, కృష్ణాజిల్లా.

## పన్నీటి జల్లు

నవల. గీతా పబ్లిషింగ్ హౌస్ వారి నూరవ ప్రచురణ. రచన శ్రీ కృష్ణమోహన్. గ్రామ వాతావరణాన్ని ఆధారం చేసుకున్న రచన. గ్రామంలో వర్గవైషమ్యాలు, సంఘానికి చీడపురుగులాంటి మనుషుల స్వభావాలూ ఈ నవలలో చక్కగా చిత్రించబడ్డాయి ఒక సినిమా కథలాగా ఉత్సాహంగా సాగిపోతుంది కథ. మంచి మనుషులకి ఎప్పుడూ మేలు జరుగుతుందని ముగిసే ఈ కథ ఆద్యంతమూ మనోహరంగా సృష్టించబడింది. చక్కని గెటప్‌తో 236 పేజీలు గల ఈ పుస్తకం వెల రెండు రూపాయలు మాత్రం. ప్రతులకు—గీతా పబ్లిషింగ్ హౌస్, 8, జవహర్లాల్ నెహ్రూ స్ట్రీట్, మద్రాసు—17.

## మణికుండలములు

పౌరాణిక నవల. మహాభారతములోని ఖాండవ దహన ఇతివృత్తం ఆధారంగా రచించబడినది. మణికుండలాల మహాత్మ్యము, తక్షకుడు వాటిని హరించచడానికి కారణము, మొదలైన ప్రశ్నలకి ఈ పుస్తకంలో హేతుబద్ధాలయిన సమాధానాలు లభిస్తాయి. చక్కని శైలిలో ఉత్కంఠతనిపెంచే కథాగమనంతో సాగిన కథ. రచయిత విద్వాన్ బి. లక్ష్మణరాజుగారు. 180 పేజీల పుస్తకం వెల నాలుగురూపాయలు. పబ్లిషర్సు: రాజశేఖర బుక్ డిపో, ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా.

## శ్రీ వంకపురి అన్నపూర్ణాస్తవము

శ్రీమతి వైద్యం పద్మావతమ్మ రచన 'శ్రీవంకపురి అన్నపూర్ణాస్తవము' మా కార్యాలయం చేరింది. ముప్పయి రెండు పేజీలు గల ఈ పుస్తకం వెల యాభై పైసలు. ప్రతులకు శ్రీమతి వైద్యం పద్మావతమ్మ, ఆదవానికి రాయాలి.

## రేపటి పౌరులు

శ్రీ కాణిపాక లింగన్న రచన 'రేపటి పౌరులు' (బాలల కథల సంపుటి) మా కార్యాలయం చేరింది. ఇందులో స్నేహితుడు, అరటిపండు, రేపటి పౌరులు, బహుమతి, వానరరాజ్యం కథలు ఉన్నాయి. 42 పేజీలు గల ఈ పుస్తకం వెల రూపాయి. ప్రతులకి నేతాజీ యూత్ రిక్రియేషన్ క్లబ్ పబ్లికేషన్స్, పూతలపట్టు, చిత్తూరు (ఆ. ప్ర.)

## బాలమనోవిజ్ఞానం

శ్రీ కండికొండ సూర్యనారాయణశాస్త్రి (ప్రాడయం) రచన "బాల మనోవిజానం' (కథలు) మా కార్యాలయం చేరింది. ఇందులో గొబ్బిళ్ళు, తియ్యని ఎదురు దెబ్బ, పాప రచన, దొంగను పట్టుకొని.. మురళి ముచ్చట్లు కథలు ఉన్నాయి. 63 పేజీల ఈ పుస్తకం వెల రు. 1—50 పైసలు. ప్రతులకి "హృదయం" కేరాఫ్ ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్, విజయవాడ—1 కి రాయాలి.

## రసికజనమనోభిరామం

శ్రీ పి. వి. ఎస్. పాత్రో రచన 'రసికజన మనోభిరామం' (ఆట వెలది శతకం) మా కార్యాలయం చేరింది. 50 పేజీలు గల ఈ పుస్తకం వెల నూరు పైసలు. ప్రతులకి శ్రీ పి. వి. ఎస్. పాత్రో, కవితా నికేతనం, పాచిపెంట (పోస్టు), శ్రీకాకుళం జిల్లా, (ఆం. ప్ర.)కి రాయాలి.

— సిరరాజు

## "గరికపోచలు"

రచన: పురాణం సూర్య ప్రకాశరావు, జీవన గంగ ప్రచురణలు, 88 పేజీలు: వెల: రూ. 1—50.

ఓ గొప్పింటి బిడ్డ ఒక పచారీ దుకాణానికి వెళ్లి తక్కెడలో అర్ధణావేసి, సిగరెట్టొట్టి ఇమ్మంటాడు. ఆ అర్ధణా తను వేసినదేనంటుంది మర్నో యిల్లాలు. షావుకారు తికమక పడతాడు. తగూ ప్రారంభ మయ్యేసరికి అబ్బాయికి కోపం వచ్చి ఇంకో అర్ధణా యిచ్చి, "అర్ధణా కోసం అబద్ధం ఆడతానని ఎప్పుడూ అనుకోకు" అనేసి, వెళ్ళిపోతాడు. వెనక నుంచి, "నిజం తేలిపోలా: అర్ధణా కాసోపారిస్తే మళ్లీ యిస్తాడూ: దొంగ దొరికిపోయె: చదువుకున్న బిడ్డ. లౌక్యంగా తప్పుకున్నాడు" అన్న మాటలు వినిపిస్తాయి. గొప్పవారబ్బాయి తన పొరపాటును గ్రహించి, బాధపడ్డాడు. ఇది "తగూ" కథ. "గరిక పోచలు"లో మొత్తం తొమ్మిది కథలున్నాయి. వీటిని కథలనేకన్నా, చిన్న సంఘటనలంటే సరిపోతుంది. ప్రతి చిన్న సంఘటననూ ఒక కథగా మలచడం ప్రారంభిస్తే—పాదం కదిపితే యిక కథ దొరుకుతుంది. కథలన్నీ చిన్న సంఘటనలుగానే వున్నాయి. కనీసం తొమ్మిదింటిలో ఒక్కటి అయినా "కథ"(?)గా వుంటే కాస్త బాగుండుండేది.

—భూపతి

**Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.**

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.

